శ్రీ

# ఆకాంక్ష



## మోటూరు టాన్యా

జ్ఞాపకాలు:
ఉదయం హనుమంతరావు గార్ల
మొదటి బిడ్డవు
గారాల పట్టివి
వీరనారి టాన్యా పేరు నీ పేరు
నీవు వీరనారీ మణివే!
నిన్ను చుట్టుముట్టిన
దుష్ట వ్యాధులతో అలుపెరుగని
పోరుసాగిస్తున్నావు

❖ ❖ ❖

మోకాళ్ళ శస్త్ర చికిత్స
ఓర్పుతో భరించావు
నిన్ను చూడటాన్కి వచ్చినప్పుడు
ఎలాంటి దయనీయ దృశ్యం
చూడాలో అని దిగులు పడ్డాము
మమ్ముచూచి సంతోషంతో
హుషారుగా కబుర్లు చెప్పావు
ఆపరేషను తరువాత రోగిపడే
అవస్థను నీవు వర్ణించిచెపితే
నీ మానసిక దిటవుకు ఆశ్చర్యపడ్డాము
ఛాతీ శస్త్ర చికిత్స అనంతరం
టాన్యా సురక్షితం అని సంతోషం
మన అమ్మాయికే ఆపదా రాదు
నిశ్చింత అనుకొన్నాము
తరువాత తెలిసింది
వ్యాధి నిన్ను వదలలేదని,
నన్ను చూడాలన్నావని,
అమ్మాజీ చెప్పిన వెంటనే మేము
ఒంగోలు బయలుదేరాము
టాన్యాను ఏ స్థితిలో చూడాలో అని
దిగులు పడుతూ వచ్చాము
నీవేమో మామూలు మనిషిలా
అతిథి మర్యాదలు సాగించావు
డా.రంగారావు గారు మాత్రం మానసికంగా
భారంగానే కన్పించారు.
ఆయన వైఖరినిబట్టి నీ ఆరోగ్యం
సరిగాలేదని అర్థమయింది
నీవు మాత్రం నిండుకుండలా ప్రవర్తించావు
ఉదయిని ఇంటికి పయనం కట్టావు
అక్కడ మనవరాలికి నీవు స్వయంగా తయారు చేసిన
ఆ దుస్తులను చూసి విస్తుపోవడం మా వంతయింది.
నీ నైపుణ్యం ఓపిక చూసి
ఎంతో ముచ్చట పడ్డాము.
(కాని మనసులో ఒకలాంటి బాధమెలిపెట్టింది!)
మనసులోని నీ నిబ్బరం
వ్యాధిని జయించదా?
మనిషి ఆత్మవిశ్వాసం ఆయుష్షుని పెంచుతుంది.
మందులకన్నా గొప్ప ఔషధ గుణం వుంది దానికి?
టాన్యా ఆరోగ్యవంతురాలవుతుంది
ఆయుష్కాలం పెంచుకుంటుంది అని ఒక ఆశ.

❖ ❖ ❖

పసితనంలోనే అమ్మానాన్నలకు దూరంగా
మద్రాసులో మొదట అక్షరాలు దిద్దుకున్నావు
నిన్ను చూడటానికి అమ్మ, నేను వచ్చినపుడు
నువ్వు ఎంతో అమాయకంగా, బుజ్జిపాపాయిలా
కన్పించావు
అమ్మను కౌగలించుకుని గారాలు పోయావు
" నేనూ వస్తా మీతోపాటు" అంటావనుకున్నాను.
నీవు టాన్యావుగదా? అలా అనలేదు
కళ్ళలో నీటిపొరలు దొరలినా
ముద్దులతో ముంచెత్తి చిరునవ్వుతో సాగనంపావు.

❖ ❖ ❖

నాన్న అజ్ఞాతం, జైళ్ళు, అమ్మ ఉద్యమాల కార్యకర్తగా
ఊళ్ళవెంట
మీ అక్కచెల్లెంద్ర బాల్యం అలాసాగింది.

❖ ❖ ❖

అక్క చెల్లెంద్రిద్దరూ వైద్య శాస్త్రంలో
పట్టాసాధించారు
మీరు చేయగల్గిన ప్రజాసేవ చేసారు
మంచి దయగల డాక్టర్లు అనిపించుకున్నారు.

❖ ❖ ❖

అమ్మాయికి, అబ్బాయికి అమ్మవైనావు
చక్కగా చదివించావు
డిగ్రీలందుకున్నారు
నీకు నాన్నమ్మ, అమ్మమ్మా పదవులందించారు

❖ ❖ ❖

ఎన్నుకున్న గమ్యం వైపు పయనిస్తున్న
బిడ్డలను చూస్తే తల్లి తండ్రులకు
ఎనలేని తృప్తిగదా?
సౌజన్యం మూర్తీభవించిన రంగారావుగారికి
నీతోడు ఎంత అవసరమో నీకు తెలియదా?
తోబుట్టువు "ఉష" ఎప్పటికీ పసితనం వాడని
పసిమొగ్గ
ఆమెకు అక్క ఆసరా ఉండితీరాలి
నాజీలతో వీరోచితంగా పోరాడిన యోధ
టాన్యా
ఆమె పేరే నీ పేరు
నీవు గెలవాలి ఈ రోగం నుండి
నీవు విముక్తవు కావాలి
ఆధునిక వైద్య విధానం
నీకు ఉపయోగించదా?
నిన్ను రక్షించే ఉపాయమే లేదా?
ఒక్కటే ఆశ
నీ ఆత్మబలం
బ్రతికి తీరాలన్న ప్రబలమైన కాంక్ష!
మూడోతరం డాక్టరు పట్టా అందుకొంటున్న
మనవరాలి నగుమోము చూడాలి నువ్వు
నీ బంధుమిత్రుల ఆత్మీయుల
అందరి "ఆకాంక్ష" ఇదే ఇదే
ఇదే ఇదే నా ఆకాంక్ష కూడా

-నీ కమలమ్మ

(ఒంగోలులో 19-10-2011 తేదీన డాక్టర్
మోటూరు టాన్యాగారిని పరామర్శించిన తరువాత
గారపాటి కమల హృదయ స్పందన ఇది)

(26-10-2011 తేదీన డా॥టాన్యా కన్నుమూశారు.)

జోహార్లు టాన్యా జోహార్లు....

చైతన్య మానవి

# పేదలతో పరిహాసమా?

సంపాదకీయం...

మీరు పట్టణ వాసులైతే మీ ఒక్కరి రోజు వారి తిండితిప్పల ఖర్చు 32 రూ॥లు దాటుతుందా? మీరు పల్లెవాసి అయితే ఈ మొత్తం 26 రూ॥లు అవుతుందా? అయితే మీరు పేదవారు కానేకాదు. దారిద్ర్యం రేఖకు దిగువవున్న (బి.పి.ఎల్) వారు పొందే ప్రయోజనాలకు మీరు అర్హులు కారు. మీ కుటుంబం అసలు బి.పి.ఎల్ కుటుంబమే కాదు. ప్రధాని మన్మోహన్‌సింగ్ నేతృత్వంలోని ప్రణాళికా సంఘం పేదరికానికి ఇచ్చిన నిర్వచనం ఇది. ప్రణాళికా సంఘం సుప్రీంకోర్టుకు పై అంశాలతో కూడిని నివేదికను సమర్పించింది. పెరుగుతున్న ద్రవ్యోల్బణం, దేశంలో రాజ్యమేలుతున్న అవినీతి వల్ల అల్లాడుతున్న పేద ప్రజలకు ఇది పుండుమీద కారం చల్లినట్లుగా వుంది.

పేదలను గుర్తించడానికి ప్రణాళికా సంఘం తీసుకున్న కొలమానాలేమిటి? కాకి లెక్కలు తప్ప. మనిషి ఆరోగ్యంగా జీవించడానికి ప్రతిరోజు 400 గ్రాముల తృణధాన్యాలు, 800 గ్రాముల కాయధ్యాన్యాలు, 300 గ్రాముల కూరగాయులు, 100 గ్రాముల తాజాపళ్ళు తప్పనిసరిగా తీసుకోవాలని జాతీయ పోషకాహార సంస్థ నిర్దేశిస్తోంది. ఒక వ్యక్తి పని చెయ్యడానికి 2400 కేలరీల ఆహారం అవసరం. మరి పోషకాహారంతోపాటు ఉండటానికి గూడు, కట్టుకోవటానికి గుడ్డ సమకూర్చుకోవడానికి వీరు చెప్పే మొత్తం సరిపోతుందా? విద్య, వైద్యం లాంటి ఇతర అవసరాల సంగతేమిటి?

ప్రపంచంలో ప్రతి ఇద్దరు ఆకలి పీడితుల్లో ఒకరు భారత్‌లోనే ఉన్నారు. 90 శాతానికి పైగా ఉన్న శారీరకంగా ఎదగని పిల్లలు ఆఫ్రికాలో కొన్ని దేశాలతోపాటు మన దేశంలో కూడా ఎక్కువగానే ఉన్నారు. నూటికి 80 శాతం మహిళలు పోషకాహార లోపంతో రక్తహీనతతో బాధపడుతూ ఉన్నారు. కొన్నిచోట్ల ఆదివాసీలు రెండు, మూడు రోజుల కొకసారి భోజనం చేసి కాలం గడుపుతున్నారని అనేక నివేదికలు చెబుతున్నాయి. ఆకలి స్థాయి ఇలా ఉంటే ప్రణాళికా సంఘం మాత్రం దేశవ్యాప్తంగా తన నోటి లెక్కలను రుద్దుతూ, మీరు, మీ పిల్లలు ఒక్కపూట కన్నా ఎక్కువ తింటే మీరు పేదలు కాదంటున్నది.

సుప్రీంకోర్టుకు ప్రణాళికా సంఘం సమర్పించిన నివేదిక హాస్యాస్పదంగా, అవాస్తవికంగా ఉండడంతోపాటు క్షేత్ర వాస్తవికతకు చాలా దూరంలో ఉంది. సంఖ్యాకమైన కోట్లాదిమంది అసంఘటిత కార్మికులు, వ్యవసాయ కార్మికులు ఈ ప్రతిపాదికన పేదరికానికి ఎగువనే ఉంటారు. ఖచ్చితంగా సంక్షేమ పథకాలకు ఎగనామం పెట్టే కుట్రలో భాగమే ఈ సరికొత్త గణాంకాలు.

ఇక రాష్ట్రంలో పేదలపై ఉన్నట్టుండి కిరణ్ ప్రభుత్వానికి ఎక్కడలేని ప్రేమ పుట్టుకొచ్చింది. అడగనిదే రెండు రూపాయల బియ్యాన్ని రూపాయి చేసింది. పేదలను ఆదుకోవడం కోసమే ఈ పథకం తెచ్చామన్న ప్రభుత్వం తినలేని నాసిరకం బియ్యం ఇస్తోంది. రెండు రూ॥ల కిలో బియ్యం ప్రారంభమైన రోజే పేదవాడికిచ్చే కిరోసిన్ కోటాలో కోత విధించారు. ఇక పేదలకు ఒరిగేదేమిటి? ఆహార ద్రవ్యోల్బణం 12.21 శాతనికి చేరి పేదలకు నిత్యావసరాలు మరింత భారమైనవి. ప్రస్తుతం ఉన్న కార్డులకే అరకొర రేషన్ అందుతుంటే రచ్చబండలో 25 లక్షల కొత్త రేషన్ కార్డులు ఇస్తామని చెప్పడం హాస్యాస్పదం. రాష్ట్రంలో ఆరోగ్యం పడకేసింది. డెంగ్యూ, మలేరియా లాంటి విషజ్వరాలు విజృంభించాయి. పూట గడవటమే కష్టంగా ఉంటే వైద్యం మాటెక్కడ?

ప్రభుత్వం రేషన్ సరుకులకు ఆధార్ కార్డుతో ముడిపెడుతోంది. రాబోయే సం॥ నుండి ఆహార సబ్సిడీలన్నింటికి నగదు బదిలీ వర్తింపజేస్తానంటుంది కేంద్రం. ప్రజాపంపిణీ ద్వారా ఇచ్చే పేదల నోటికాడి కూడును నగదు బదిలీ పథకం ద్వారా సిద్ధపడిందీ ప్రభుత్వం. నేటి పితృస్వామిక సమాజంలో ఈ పథకం ద్వారా నగదు పురుషుడి చేతిలోకి పోయి కనీసంగా దొరికే ఈ తిండి కూడా దొరకక మహిళల, పిల్లల ఆరోగ్యం మరింత క్షీణించదా? ఆహార భద్రతా బిల్లు ఎండమావిలో నీరు కాదా?

ప్రజాపంపిణీ అనేది పేదలకు అత్యంత ప్రధానమైంది. అందుకే నిరుపేదల సంఖ్యపై ఖచ్చితమైన అవగాహన ఉండాలి. సరైన ప్రతిపాదనలతో సహేతుకమైన ప్రమాణాలతో పేదల సంఖ్యను నిర్ధారిస్తే సబ్సిడీల బిల్లు తడిసి మోపడవుతుందని మన్మోహన్ సర్కార్ భయపడ్తోంది. అందుకే పేదల వాస్తవ సంఖ్యకు మసిపూసి మారేడుకాయ చేసే ప్రయత్నాలు ఊపందుకున్నాయి. ఇలాంటి జిమిక్కులకు ప్రభుత్వం స్వస్తి పలకాలి.

ప్రణాళికా సంఘం చెప్పిన అర్హతలను ప్రామాణికంగా తీసుకుంటే ప్రజా జీవితంలో తీవ్ర దుష్పలితాలుంటాయి. పేదరికం అంచనాలకు వారి ఇతర లెక్కలను వెంటనే పునఃసమీక్షించాలి. ప్రజాపంపిణీని సార్వత్రికం చేయాలి. ధరలు తగ్గి ప్రజల నిజ ఆదాయాలు పెరిగినపుడు మాత్రమే సామాన్యుడికి కొంతైనా ఊరట లభిస్తుంది.



చైతన్య మానవి

## ఈ సంచికలో...




**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం**

రాష్ట్ర కార్యాలయం, బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్:
2,1-8-1, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్
ఫోన్ : 27605845, ఫ్యాక్స్ : 040 - 27605845

సంపాదకులు

**ఎస్. పుణ్యవతి**

మేనేజర్

**ఎం. సుధ**

సంపాదక వర్గం

మల్లు స్వరాజ్యం
అల్లూరి మన్మోహిని
టి. జ్యోతి
కె. స్వరూపరాణి

**విరాళం రూ : 10/-**

ప్రజాశక్తి డైలీ ప్రింట్‌ప్రెస్, ఆజామాబాద్ హైదరాబాద్ - 044


## సూక్తి

ఏ పనినైనా మూడు గంటలు ముందు చేయడంలో తప్పలేదు. కానీ ఒక్క క్షణం కూడా ఆలస్యంగా చేయకూడదు

-షేక్ స్పియర్

## కాలం...... నన్ను

- ఎం.శేషగిరి

పల్లవి: కాలం......నన్నూ.....పదే.....పదే
పలకరించింది.....
ఎదురుగా నిలబడి.....వెక్కిరించింది-నన్ను
హెచ్చరించింది. ॥కాలం॥

1. వేగుచుక్కను వెంట నిడుకొని
తట్టిలేపింది....
పరుగులిడమని......తాకరమ్మని
చుట్టు తిరిగింది.....నాతో పట్టుపట్టింది. ॥కాలం॥

2. వెనకబడితే తడుములాట
తీరు చూపింది.....
అధిగమిస్తే.....అవధులకు ఇక
తావులేదంది..... నే పావుకానంది ॥కాలం॥

3. వ్యవధి తెలిసి మసలుకుంటే
చెలియ తానంది.....
చేతగాని.....చావలేని
బతుకు వద్దంది-మనిషికి తెగువ బలమంది
॥కాలం॥

4. త్యాగధనుల జీవితాలను.....
ఆలపించింది.....
కర్మజీవుల......ఘర్మజలముల
కథలుచెప్పింది....నావెతలుబాపింది.
॥కాలం॥

# హక్కులే కాదు అవకాశాలూ కల్పించాలి

ఎం. కోటేశ్వరరావు.

" ఇటీవలనే అంతర్జాతీయ మహిళా దినోత్సవం శతవార్షికోత్సవం జరుపుకున్నాము. ఎన్ని దినోత్సవాలు జరుపుకున్నా, ఓటింగ్‌తో సహా ఎన్ని హక్కులు సాధించినా మొత్తం మీద చూసినపుడు మహిళల పరిస్థితి దయనీయమే. కాగితాల మీద, నాయకుల నోళ్ళలో అవి గంభీరంగా ఉంటాయి తప్ప ఆచరణలో ఉండటం లేదు. సోషలిస్టు దేశాలు ఇందుకు మినహాయింపు. ఓటింగ్ హక్కు, స్థానిక సంస్థలు, చట్టసభల్లో రిజర్వేషన్లతోనే మహిళాభివృద్ధి జరిగినట్లు కాదు. అది మహిళలకు ఒక అవకాశం మాత్రమే."

**న్యూజిలాండ్ నుంచి భూటాన్ వరకు....**

"ప్రజాస్వామిక సమాజంలో అందరూ సమానమే" అని చెప్పినప్పటికీ ఆధునిక ప్రజాస్వామిక వ్యవస్థకు పుట్టినిల్లుగా చెప్పుకునే బ్రిటన్‌లో 1928 అపూర్వ మహిళలకు ఓటింగ్ హక్కు ఇవ్వని అవర ప్రజాస్వామిక సమాజం అది. విచిత్రం ఏమి టంటే బ్రిటిష్ వలస ప్రాంతం గా ఉన్న న్యూజిలాండ్ లో 1883లో తొలిసారిగా మహి ళలకు ఓటింగ్ హక్కు ఇచ్చారు. ఒక దేశంగా న్యూజిలాండ్ ముందున్నప్ప టికీ అమెరికా, ఐరోపాలోని కొన్ని ప్రాంతాలలో అంతకంటే ముందుగానే ఓటింగ్ హక్కు కల్పించారు. చివరగా 2008లో పార్లమెంట్ ఎన్నికల లో భూటాన్ అతివలకు అవకాశం ఇచ్చారు. ఇప్పటికీ ఓటింగ్ హక్కులేని దేశాలు, మత సంస్థలు ఉండటం సిగ్గుచేటు.



**పోరాటాల వల్లే మహిళలకు ఓటు హక్కు**

మహిళలకు ఓటింగ్ హక్కు దయా దాక్షిణ్యంగానో లేక మారుమనస్సు కలిగో ఇవ్వలేదు. పోరాటాల పర్యవసానాలు, పరిస్థితుల ప్రాబల్యంతోనే ఇచ్చారని గుర్తించాలి. ఐరోపాలో భూస్వామిక-పెట్టుబడి దారీ శక్తుల మధ్య తలెత్తిన వైరుధ్య ఫలితంగా తాము ప్రజాస్వామిక శక్తులుగా కనిపిం చేందుకు స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వ నినాదాలతో ముందుకు వచ్చారు. పట్టణాలలో పౌరసభలకు ఎన్నికలు నిర్వహించారు. వాటిలో మహిళలను మినహాయించటంతో తాము మాత్రం ఎందులో తీసిపోయామంటూ మహిళలు తమ నిరసన గళం అప్పటి నుంచి విప్పారు. అది ఫ్రెంచి విప్లవ కాలంలో మరింత బలపడింది. పెట్టుబడిదారులు ఆ డిమాండుకు మద్దతు ప్రకటించారు. ఫ్రాన్స్‌లోని కోరిసియన్ ప్రాంతంలో 1755లోనే పన్ను చెల్లింపుదారులైన స్త్రీ పురుషులకు ఓటింగ్ హక్కు కల్పించారు. అయితే 1769లో ఫ్రాన్స్ ఆ ప్రాంతాన్ని ఆక్రమించింది. హక్కు రద్దయింది. మహిళల ఓటింగ్ బ్రిటీష్ పాలనలోని అమెరికాలో మసాచుసెట్స్ వలస ప్రాంతంలో 1756లో మహిళలకు స్థానిక ఎన్నికలలో ఓటుహక్కు కల్పించారు. తరువాత న్యూజెర్సీలో ఆస్తిహక్కు ఉన్న మహిళలకు ఓటింగ్ హక్కు ఇచ్చారు. అవివాహితలు, వితంతువులు మాత్రమే అర్హుల య్యారు. ఎందుకంటే వివాహం అయిన తరువాత మహిళలకు తమకంటూ ప్రత్యేకంగా ఆస్తి కలిగి ఉండే అవకాశం లేదు. ఇదంతా ఫ్రెంచి విప్లవ ప్రభావమే అని గ్రహించాలి. అనేక ఇతర ఐరోపా దేశాలలో కూడా ఈ సమయంలోనే పరిమితంగా అయినా ఓటింగ్ హక్కు ఇచ్చారు. ఒక్క ఓటింగ్ హక్కే కాదు, అమెరికా, ఇతర ఐరోపా దేశాలలో మహిళా కార్మికులు కార్మిక సంఘాలలో సభ్యత్వం, సమాన పనికి సమానవేతనం ఇవ్వాలన్న డిమాండ్‌ను కోర్కెల

పత్రాలలో చేర్చటం కోసం కూడా ఆందోళనలు జరపాల్సి వచ్చింది. వలస పాలకులు ఎవరైనా మహిళలను అణచివుం చేందుకే ప్రయత్నించారు.

మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో ఆవిర్భవించిన సోవియట్ యూనియన్‌లో మహిళలకు ఇచ్చిన హక్కులతో అమెరికా, బ్రిటన్, జర్మనీతో సహా అనేక ఐరోపా దేశాలు కమ్యూనిస్టు ప్రభావాన్ని అడ్డుకునేందుకు ఓటింగ్ హక్కులను ఇచ్చాయి. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసి ఐక్యరాజ్యసమితి ఉనికిలోకి వచ్చిన తరువాత 1948లో మహిళల ఓటింగ్‌ను గుర్తిస్తూ అంతర్జాతీయ చట్టం ఆమోదం పొందింది.

## అంతర్జాతీయ చట్టంగా మార్చడంలో కమ్యూనిస్టుల దోహదం

ఫ్రెంచి విప్లవం తరువాత ప్రపంచాన్ని ఒక ఊపు ఊపిన ఉదంతం పారిస్ కమ్యూన్. కమ్యూనిస్టుల నాయకత్వాన పారిస్ నగరంలో 1871లో ఏర్పడిన తొలి కమ్యూనిస్టు ప్రభుత్వం మహిళల ఓటింగ్ హక్కులను గుర్తించింది. అయితే అది కొద్ది రోజుల్లోనే పతనం కావటంతో తిరిగి హక్కుల సమస్య ముందుకు వచ్చింది. ఫ్రెంచి మహిళలకు రెండవ ప్రపంచ యుద్ధం ముగింపు సమయంలో నాజీ ఆక్రమణలో ఉండగా 1944లో మాత్రమే అనివార్యమై నాటి పాలకులు ఓటింగ్ హక్కు ఇచ్చారు.

తొలి మహిళా పార్లమెంటు సభ్యులను కలిగి ఉన్న దేశంగా ఫిన్లాండ్ గర్వంగా చెప్పుకోవచ్చు. అది కూడా ఆందోళన ఫలితమే. రష్యన్ జార్ పాలన నుంచి వేరు పడేందుకు సాగిన పోరుతో 1905లో అమలు జరిపిన సంస్కరణలతో ఓటింగ్ హక్కు ఇచ్చిన తొలి ఐరోపా దేశమైంది ఫిన్లాండ్. తొలి పార్లమెంట్‌కు జరిగిన 1907 ఎన్నికలలో19 మంది మహిళలు ఎన్నికయ్యారు. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో ఆవిర్భవించిన సోవియట్ యూనియన్‌లో మహిళలకు ఇచ్చిన హక్కులతో అమెరికా, బ్రిటన్, జర్మనీతో సహా అనేక ఐరోపా దేశాలు కమ్యూనిస్టు ప్రభావాన్ని అడ్డుకునేందుకు ఓటింగ్ హక్కులను ఇచ్చాయి. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసి ఐక్యరాజ్యసమితి ఉనికిలోకి వచ్చిన తరువాత 1948లో మహిళల ఓటింగ్‌ను గుర్తిస్తూ అంతర్జాతీయ చట్టం ఆమోదం పొందింది. అయినప్పటికీ ఇప్పటికీ దానిని ఉల్లంఘిస్తున్న దేశాలు, సంస్థలు ఉండటమే విషాదం.

## ఓటింగ్ హక్కుకు మోకాలడ్డుతున్న దేశాలు

మహిళలనే కాదు పురుషులకు కూడా ఓటింగ్ హక్కు లేని ఏకైక దేశంగా బ్రూనే వుంది. అక్కడ 1962 నాటి ఫర్మానా ప్రకారం పార్లమెంట్‌కు పోటీ చేయడం, ఓటింగ్ హక్కు రెండింటినీ నిరాకరించారు. స్థానిక సంస్థలలో మాత్రమే అదీ అనుమతిస్తేనే ఓటు వేయవచ్చు. ఆస్ట్రేలియాలో 1902లోనే




ఓటింగ్ హక్కు ఇచ్చినప్పటికీ అక్కడి భూమిపుత్రులు పురుషులైనా మహిళలైనా 1962లోనే ఓటింగ్‌కు పొందారు. కెనడా, దక్షిణాఫ్రికాలో కూడా ఇదే అన్యాయం జరిగింది. కెనడాలోని రెడ్ ఇండియన్ మహిళలను మినహాయించి మిగిలిన వారికి 1917లో హక్కునిచ్చారు. రెడ్ ఇండియన్ స్త్రీ పురుషులు 1960 దశకంలోనే ఓటర్లయ్యారు. దక్షిణాఫ్రికాలో కూడా ఇదే జరిగింది. శ్వేత జాతి మహిళలకు 1930లో హక్కునివ్వగా 1968లో రంగుజాతి, 1984లో భారతీయ సంతతి, శ్వేత జాతి దురహంకార పాలన అంతమైన తరువాత 1994లో ఆఫ్రికన్ జాతి వారికి ఓటింగ్ హక్కు ఇచ్చారు.

లెబనాన్‌లో మహిళలు ఓటువెయ్యాలంటే వారు ప్రాథమిక విద్య అయినా అభ్యసించినట్లు రుజువును చూపాలి. తరువాత ఈ నిబంధనను తొలగించారు. పురుషులు నిశానీ (వేలిముద్ర) గాళ్ళయినా ఓటేయవచ్చు. అంతేకాదు పురుషులు విధిగా ఓటేయాలి. స్త్రీలకు అలాంటి నిర్బంధం లేదు. ప్రపంచంలో అత్యంత సంపన్న దేశాలలో ఒకటైన సౌదీ అరేబియాలో ఓటు హక్కు లేదు. తొలిసారిగా 2005లో స్థానిక సంస్థల ఎన్నికలు పురుషులతో మాత్రమే జరిగాయి. ఓటింగ్ హక్కు గురించి వాగ్దానాలే తప్ప ఇంతవరకు ఇవ్వలేదు. యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్‌లో లాంఛనంగా ఓటుహక్కు ఇచ్చినప్పటికీ అది పురుషులు, స్త్రీలకు కూడా పరిమితంగానే ఉంది.

## మత సంస్థల్లో సమాన అవకాశాలేవి?

మత సంస్థల విషయానికి వస్తే ప్రపంచంలోని పెద్ద మతమైన క్రైస్తవంలో పోప్‌ను కార్డినల్స్ ఎన్నుకుంటారు. కార్డినల్స్‌గా మహిళలు అనర్హులు. అందువలన వారికి ఓటింగ్ అవకాశం లేదు. హిందూమతంలో ఒక శాఖగా చెప్పుకునే 'ఇస్కాన్' (ఇంటర్నేషనల్ కృష్ణా కాన్షస్‌నెస్) లో మహిళలకు సమాన హక్కులు లేవు. అందుకోసం పెద్ద ఎత్తున పోరాటమే చేయాల్సి వచ్చింది. చివరికి 1997లో మహిళా విభాగాన్ని ఏర్పాటు చేశారు. ఆ మరుసటి ఏడాది ఇస్కాన్ పాలక మండలిలో తొలి మహిళను నియమించారు. ఇక్కడ సమన్య భక్తి,

**క్యూబాలో మహిళల పరిస్థితి ఎంతో మెరుగ్గా ఉంది. అక్కడ విద్యారంగంలో 72 శాతం, ఆరోగ్య రంగంలో 67 శాతం, టెక్నీషియన్లలో 66, శాస్త్రరంగంలో 43 శాతం మహిళలే ఉన్నారు. వేతనంతో కూడిన ప్రసూతి సెలవు ఏడాది, ఇదిగాక పురుషులకు కూడా కొన్ని రోజుల సెలవులు ఇవ్వటం క్యూబాలో తప్పమరి ఏ దేశంలోనూ లేదు.**

విశ్వాసాలు కాదు, సమాన అవకాశాలు ఎందుకు ఇవ్వటం లేదనేదే. అంతకు ముందు మహిళలకు ప్రాధాన్యత ఇవ్వనందుకు 2000 సంవత్సరంలో జరిగిన సభలో ఇస్కాన్ పాలక మండలి క్షమాపణలు కోరింది. యూదు మతం కూడా తన సంస్థలలో మహిళలకు స్థానం, ఓటింగ్ హక్కును నిరాకరిస్తోంది.

## అవకాశాలు లేకపోతే హక్కులున్నా లేనట్లే.......

ఓటింగ్ హక్కుకోసం జరిగిన పోరాట కాలం ఏదంటే 1718 సంవత్సరం నుంచి 1948 వరకు అని చెప్పవచ్చు. ఇంతటి సుదీర్ఘపోరాటం, హక్కుల సాధనతోనే చాలదు, వాటిని అమలు జరిపించుకోవటానికి మరింత పదును పెట్టేందుకు మున్ముందు కూడా పోరాడాల్సిన అవసరాన్ని వర్తమాన స్థితి గుర్తు చేస్తోంది. ఓటింగ్ హక్కుతోపాటు మహిళా ప్రాతినిధ్యాన్ని వారి నిష్పత్తిమేరకు సరే కనీసం కొంత మేరకైనా సాధించిన దేశాలు వేళ్ళమీద లెక్కించదగినవిగానే ఉన్నాయి. సార్వత్రిక ఓటింగ్ హక్కు కలిగించిన తొలి దేశంగా చరిత్రకెక్కిన న్యూజిలాండ్‌లో మహిళల పరిస్థితిని చూస్తే సాధించింది ఎంత పరిమితమో అవగతం అవుతుంది. ఓటింగ్ హక్కు ఇచ్చినప్పటికీ మొదటి ప్రపంచయుద్ధం తరువాతే న్యూజి లాండ్ మహిళలు 1919లో పార్లమెంటుకు పోటీ చేసే అవకాశం కల్పించారు. అయితే 1933లో మాత్రమే అక్కడ తొలి మహిళా ఎంపి ఎన్నికయ్యారు.

బలవంతపు బాల్య వివాహాలు కూడా అక్కడ జరుగుతున్నాయంటే ఆశ్చర్య పోనవసరం లేదు. న్యూజిలాండ్, ఆస్ట్రేలియా మెజారిటీ ఐరోపా వాసులు, ఇతర ఖండాల వలసవారితో నిండిన దేశాలన్న విషయం తెలిసినదే. న్యూజిలాండ్‌లో 75 శాతం వరకు ఐరోపా సంతతి. మిగిలినవారు స్థానికులు, ఆసియా, ఆఫ్రికా, మధ్యప్రాచ్య దేశాలనుంచి వలస వచ్చిన వారి సంతతి. నాలుగోవంతు మంది ఉన్న ఈ తరగతుల మహిళల పరిస్థితి దయనీయంగా ఉందని వారి అభ్యున్నతి కోసం పాటుపడుతున్న 'శక్తి' సంస్థ తన నివేదికల్లో




పేర్కొన్నది. బలవంతపు బాల్య వివాహాలు మానవ, బాలల హక్కుల నిరంతర ఉల్లంఘనలో తీవ్రమైనవి. కొన్ని తరగతుల సంప్రదాయం, సంస్కృతులను గౌరవించే ముసుగులో బలవంతపు బాల్యవివాహాలను అధికారులు సహించటం ప్రాథమిక హక్కులను ఉల్లంఘించటమే' అని శక్తి సంస్థ గతేడాది న్యూజిలాండ్ పార్లమెంటుకు ఫిర్యాదు చేసింది. ప్రపంచ జనాభాలో ప్రతి 33 మందికి ఒకరు వలస పోయినవారే. బ్రిటన్‌లో బలవంతపు వివాహాల నిరోధ యూనిట్‌కు 2008లో ఐదువేల ఫిర్యాదులు అందాయి.

న్యూజిలాండ్‌లో ప్రతి ఐదుగురు మహిళల్లో ఒకరు బలవంతపు వివాహాలకు గురైనవారే నని 'శక్తి' ఫిర్యాదు చేసింది. అనేక ఉదంతాలు బయటికి రావటంలేదని కూడా తెలిసింది. వివిధ దేశాలలో మైనారిటీ సమాజాలలో మహిళలపై హింస, మతం, సంప్రదాయాల పేరుతో బలవంతపు బాల్య వివాహాలు జరుగుతున్నాయని బీజింగ్ మహాసభ కూడా గుర్తించింది. న్యూజిలాండ్‌లో ఐరోపాయేతర సంతతుల స్థితేకాదు. మెజారిటీ ఐరోపా సంతతి మహిళల స్థితికూడా మిగతా దేశాల మాదిరే ఉంది. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో పురుషాధిక్యత కొనసాగుతోంది. నూటికి నూరు అంశాలలో తాము పోటీ పడాలని న్యూజిలాండ్ మహిళలు ఆకాంక్షిస్తుండగా పురుషులు కేవలం 40 అంశాలకే పరిమితం చేయాలని భావిస్తున్నట్లు ఒక సర్వేలో వెల్లడైంది. అక్కడి వంద బడా కంపెనీలలో డైరెక్టర్లుగా కేవలం తొమ్మిది శాతం మందే మహిళలు ఉన్నారు. గత దశాబ్దంలో ఒకే పని చేసే స్త్రీ పురుషులకు ఇచ్చే వేతనాల తేడా 12 శాతం ఉంది. ఇది ఒక్క న్యూజిలాండ్‌కే పరిమితం అనుకుంటే పొరపాటు.

## అగ్రరాజ్యాలు, బడా కంపెనీల్లో అట్టగుస్థాయిలో మహిళలు

ప్రపంచంలో ఐదు వందల అగ్రశ్రేణి కంపెనీల సారథుల్లో (సిఇఓలు) కేవలం15 మంది మాత్రమే మహిళలు. ఇది

**నూటికి నూరు అంశాలలో తాము పోటీ పడాలని న్యూజిలాండ్ మహిళలు ఆకాంక్షిస్తుండగా పురుషులు కేవలం 40 అంశాలకే పరిమితం చేయాలని భావిస్తున్నట్లు ఒక సర్వేలో వెల్లడైంది. అక్కడి వంద బడా కంపెనీలలో డైరెక్టర్లుగా కేవలం తొమ్మిది శాతం మందే మహిళలు ఉన్నారు. గత దశాబ్దంలో ఒకే పని చేసే స్త్రీ పురుషులకు ఇచ్చే వేతనాల తేడా 12 శాతం ఉంది. ఇది ఒక్క న్యూజిలాండ్‌కే పరిమితం అనుకుంటే పొరపాటు.**

**ఫ్రాన్స్‌లోని కోరిసియన్ ప్రాంతంలో 1755లోనే పన్ను చెల్లింపుదారులైన స్త్రీ పురుషులకు ఓటింగ్ హక్కు కల్పించారు. అయితే 1769లో ఫ్రాన్స్ ఆ ప్రాంతాన్ని ఆక్రమించింది. హక్కు రద్దయింది. మహిళల ఓటింగ్ బ్రిటీష్ పాలనలోని అమెరికాలో మసాచుసెట్స్ వలస ప్రాంతంలో 1756లో మహిళలకు స్థానిక ఎన్నికలలో ఓటుహక్కు కల్పించారు.**

ఎప్పటిదో కాదు. గతేడాది సమాచారం. ఈ కంపెనీల్లోని కార్యనిర్వహణాధికారుల్లో మహిళలు 14.4 శాతమే. అమెరికన్ సొసైటీ ఫర్ క్వాలిటీ అనే సంస్థ 2009లో జరిపిన సర్వేలో 8-17 సంవత్సరాల మధ్య వయసున్న బాలబాలికల ఆసక్తులేమిటన్న ప్రశ్నకు కేవలం ఐదుశాతం బాలికలు మాత్రమే తమకు ఇంజనీరింగ్ ఇష్టం అంటే బాలురు 24 శాతం మంది అన్నారట. తమ జీవితాలపై సామాజిక డిమాండ్లు ఎక్కువగా ఉంటాయని అందువల్లన ఫిజిక్స్, కెమిస్ట్రీ, గణితం వంటి చదువుల్లో పడితే వాటికి ఎక్కువ సమాయాన్ని కేటాయించటం, వత్తిడి ఎక్కువగా ఉంటుందని అందువలనే వారు ముందుకు రావటం లేదని పిట్స్‌బర్గ్ విశ్వవిద్యాలయ బయాలజీ ప్రొఫెసర్ వర్జీనియా రైడర్ వంటి వారు అభిప్రాయపడుతున్నారు. ఆల్జీబ్రా గణితంలో చేసిన కృషికి అవార్డు పొందిన బెంగళూరుకు చెందిన సుజాతా దామోదర కూడా దాదాపు ఇలాంటి అభిప్రాయానే వెలిబుచ్చారు. సైన్స్‌లో మహిళల ప్రవేశానికి సమాజం ఇంకా పూర్తిగా సిద్ధపడలేదు. భారత్‌లో మహిళలు తమ చాతుర్యంతో బహుముఖ పాత్రలను సులభంగా పోషిస్తున్నారు. అయితే అదంతా ఆమె చేసుకునే భర్త మీద ఆధారపడి ఉంటుంది' అన్నారు.

టెక్ మహిళలకూ మంచి వేతనాలు లభించినప్పటికీ వివాహం తరువాత వారు తమ రంగాలను వదలి పెడుతున్నారు. అమెరికాలో కొన్ని రంగాలలో గతం కంటే పరిస్థితి దిగజారుతున్నది. కంప్యూటర్ సైన్స్ డిగ్రీలు తీసుకున్నవారు 1980 దశకంలో 36 శాతం ఉంటే 2006 నాటికి 20 శాతానికి పడిపోయింది. విద్యా సంస్థలలో కూడా అమెరికా మహిళల స్థితి అంత మెరుగ్గా ఏమీలేదు. దేశవ్యాపితంగా బోధనా సిబ్బందిలో 40 శాతం మంది పూర్తి కాలపు సిబ్బందిగా మహిళలుంటే కంప్యూటర్, ఇన్ఫర్మేషన్ సైన్స్ ఫ్యాకల్టీలో 22 శాతం, గణితంలో 19 శాతం, ఇంజనీరింగ్‌లో 12 శాతం మాత్రమే మహిళలున్నారు.

అనేక దేశాల్లో జరిగిన పరిశోధనల్లో టెక్ కంపెనీల మేనేజిమెంట్ టీముల్లో మహిళలు ఎక్కువమంది ఉన్నచోట కంపెనీల లాభాలు కూడా ఎక్కువగా ఉన్నట్లు తేలింది. బృందాలలోని మహిళలు తమ ఉమ్మడి మేధాశక్తిని కూడా పెంచుకుంటారని, సమస్యలను పరిష్కరించటంలో చురుకుగా ఉంటారని తేలింది. ఐటి యాజమాన్య హోదాలలో మహిళలు కేవలం తొమ్మిది శాతం మంది మాత్రమే ఉన్నారు. భారత్‌లో మహిళల గురించి నాస్కామ్-మెర్సర్ సంస్థలు 2009లో జరిపిన సర్వే వివరాల ప్రకారం ఐటి ఉద్యోగుల్లో మహిళలు కేవలం 23 శాతం మాత్రమే ఉన్నారు.

**హక్కులే కాదు అవకాశాలూ కల్పించిన సోషలిస్టు సమాజం**

దశాబ్దాల తరబడి అమెరికా అమలు జరుపుతున్న ఆర్థిక దిగ్బంధానికి గురౌతున్నప్పటికీ క్యూబాలో మహిళల పరిస్థితి ఎంతో మెరుగ్గా ఉంది. అక్కడ విద్యారంగంలో 72 శాతం, ఆరోగ్య రంగంలో 67 శాతం, టెక్నీషియన్లలో 66, శాస్త్రరంగంలో 43 శాతం మహిళలే ఉన్నారు. వేతనంతో కూడిన ప్రసూతి సెలవు ఏడాది, ఇదిగాక పురుషులకు కూడా కొన్ని రోజుల సెలవులు ఇవ్వటం క్యూబాలో తప్పమరి ఏ దేశంలోనూ లేదు. సుప్రీంకోర్టు, ఇతర కోర్టుల్లో 49 శాతం మంది జడ్జీలు, 60 శాతం ప్రాసిక్యూటర్లు మహిళలే ఉన్నారు. పార్లమెంట్‌లో 36 శాతం మంది ఉన్నారు.

మరో సోషలిస్టు దేశమైన చైనాలో 1949లో విప్లవం జయప్రదం కాగానే మహిళలకు ఓటింగ్ హక్కు ఇచ్చారు. గడచిన ఆరు దశాబ్దాల్లో అక్కడ జరిగిన ప్రగతిని గమనిస్తే సోషలిజంలో మహిళల అభ్యున్నతి ఎలా ఉంటుందో అర్థం చేసుకోవచ్చు. గ్రాంట్ థ్రోన్‌టన్ బిజినెస్ రిపోర్టు ప్రకారం మేనేజర్ స్థాయిలో ఉన్నవారిలో 19 శాతం మంది సిఇఓలుగా మహిళలు ఉన్నారు. ఈ సంఖ్య ఐరోపా కంటే పదిశాతం, అమెరికా కంటే 14 శాతం ఎక్కువ. జపాన్‌లో ఉన్నది ఎనిమిది శాతమే. చైనా కంపెనీలలోని ఆర్థిక విభాగాల్లో 69 శాతం మహిళలే. విప్లవ సమయంలో కార్మిక శక్తిలో కేవలం ఏడు శాతంగా ఉన్న మహిళలు నేడు 70 శాతానికి చేరి ప్రపంచంలో అత్యధిక మహిళా కార్మికులున్న దేశంగా చరిత్రకెక్కింది. ఇదీ కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు సమాజ ఘనత.

## ఆణిముత్యాలు

## పరుల కోసం పాటు పడని

**పల్లవి:** పరుల కోసం పాటుపడని
నరుని బ్రతుకుదేనికని
మూగనేలకు.....
మూగనేలకు నీరందివ్వని
వాగు పరుగుదేనికని ॥పరుల॥

1. తాతలు తాగిన నేతుల సంగతి
నీతులుగా పలికెను మన సంస్కృతి
జల్లుకు నిలవని-ఎండకు ఆగని
చిల్లుల గొడుగు దేనికని ॥పరుల॥

2. ఆదర్శాలకు నోళ్ళు చాలవు
ఆశయాలకు ఫైళ్ళు చాలవు
పద పద మంటూ పలుకులే గాని
కదలని అడుగు దేనికని ॥పరుల॥

3. జల విద్యుత్తుకు కరువే లేదు
జన సంపత్తికి కొరవే లేదు
అవసరానికి మీట నొక్కితే
అందని వెలుగు దేనికని ॥పరుల॥

4. శిశు హృదయానికి కల్లలు లేవు
రసరాజ్యానికి ఎల్లలు లేవు
లోపలి నలుపు సినారెకు తెలుసు
పైపై తొడుగులు దేనికని ॥పరుల॥

-డా॥సి. నారాయణ రెడ్డి

# మహిళా శాంతి కపోతాలు

✍ వేములపల్లి సత్యవతి

ఆఫ్రికా ఖండమనగానే నేటి కాలంలో మనకందరకు గుర్తుకొచ్చేది నెల్సన్ మండేలా. శ్వేతజాతీయుల దురహంకారానికి, నిరంకుశ పాలనకు, రంగు భేదానికీ వ్యతిరేకంగా అవిశ్రాంత పోరాటం చేసిన యోధుడు. 27 సంవత్సరాలు కారాగారంలో (జైలులో) బందీగా ఉండి వచ్చిన ఆఫ్రికా నూరీడు నెల్సన్‌మండేలా. ఆఫ్రికా ఖండంలోని లైబీరియాలో కూడా శ్వేతజాతీయుల నిరంకుశ పాలన కొనసాగింది. ఇక్కడ విశేషమేమంటే వారి పాలనకు వ్యతిరేకంగా పోరాడి విజయం సాధించినది ఇరువురు మహిళలు. లైబీరియా జనాభా 37 లక్షలు. అక్టోబరు 2011లో ఆ దేశానికి చెందిన ఎల్లెన్‌జాన్సన్ సర్లీఫ్, లేమాబోవితోపాటు యోమెన్ దేశీయురాలైన ముస్లిం మహిళ తవక్కుల్ కర్మన్ లకు 'నోబెల్' శాంతి బహు మతి ఉమ్మడిగా ప్రధానం చేయ బడింది. ఒకే దేశానికి చెందినవారికి వివిధ రంగాలలో 'నోబెల్' బహుమతులు పొందినవారున్నారు. భారతీయులలో రవీంద్రనాథ్ ఠాగూర్, సర్ సి.వి. రామన్, అమెరికా పౌరసత్వం పొందిన ఖురానా, అమర్త్యసేన్ మొదలగువారు 'నోబెల్' బహుమతి గ్రహీతలే. కాని ఒకే సంవత్సరం, ఒకేనెల, ఒకేరోజున, ఒకే దేశానికి చెందిన వారయిన ముగ్గురు మహిళలకు ఆ ఘనత దక్కింది.

లైబీరియా అధ్యక్షురాలు ఎల్లెన్ జాన్సన్ సర్లీఫ్. ఆమె వయస్సు 67సంవత్సరాలు. హార్వర్డు విశ్వవిద్యాలయంలో ఆర్థికశాస్త్రంలో పట్టభద్రురాలు. ప్రజాస్వామ్య పద్ధతిలో ఆఫ్రికా ఖండంలో ఒక దేశానికి అధ్యక్షురాలిగా ఎన్నుకోబడిన తొలి మహిళ సర్లీఫ్. 2005లో అధ్యక్ష పీఠాన్ని అధిష్టించకపూర్వం సంఘ సంస్కర్తగా పనిచేసింది. శాంతి పరిరక్షకురాలిగా పేరుగాంచింది. అంతర్యుద్ధాలలో అన్నివేళలా అట్టుడికిపోతున్న లైబీరియా శాంతి స్థాపన కొరకు అవిశ్రాంత కృషి చేసిన మహిళ. 1980లో లైబీరియా ప్రభుత్వంలో ఆర్థిక మంత్రిగా పనిచేసింది. వివిధ శాఖలకు అధికారిణిగా బాధ్యతలు చేపట్టింది. చార్లెస్ టేలర్ పాలనలో కారాగారవాసంలో ఉండి వచ్చింది. ప్రతిపక్ష ప్రభుత్వ వేధింపులు భరించలేక రెండుసార్లు దేశం విడిచి వెళ్ళింది. ఇవేవీ ఆమె దృఢసంకల్పాలను సడలించలేకపోయాయి. ఉక్కు ఉద్దేశాలను దెబ్బతీయలేకపోయాయి. దేశం విడచి వెళ్ళిన తర్వాత ఐక్యరాజ్య సమితిలో, ప్రపంచ బ్యాంక్‌లో పనిచేసింది. అధ్యక్షురాలిగా ఎన్నికయినపుడు దేశ ఆర్థిక స్థితి చితికి చిన్నాభిన్నమైవుంది. దేశంలో తాగటానికి నీళ్ళు లేవు. కరెంటు లేదు. రహదారులు, రోడ్లు చెప్పనలవిగాని శిధిలావస్థలో ఉన్నాయి. శాసన పగ్గాలు చేతబూనిన తరువాత ఆర్థిక, సామాజిక అభివృద్ధిని సాధించింది. సమాజంలో మహిళల స్థానాన్ని సమాజ గుర్తింపు పొందటానికి కృషి చేసింది. దేశంలో శాంతిని నెలకొల్పింది. వీటన్నిటి కోసం అహింసా మార్గాన ఉద్యమించినందుకు 'నోబెల్' శాంతి బహుమతి వరించింది.



లైబీరియాకే చెందిన ద్వితీయ మహిళ లేమాబోవీ. 39 సంవత్సరాల వయస్కురాలు. 1999లో లైబీరియాలో మొదలైన రెండవ అంతర్యుద్ధం 2003లో అంతమయ్యేవరకు అవిరళ కృషి చేసిన కార్యశీలురాలు. ఆమె ఆధ్వర్యంలో 'ఉమెన్ లైబీరియా మాస్ యాక్షన్ ఫర్ పీస్'సంస్థ నెలకొల్ప బడింది. చిన్న చేపల మార్కెట్‌లో వందలాది మంది మహిళలతో కలిసి

**అక్టోబరు 2011లో ఆ దేశానికి చెందిన ఎల్లెన్‌జాన్సన్ సర్లీఫ్, లేమాబోవితోపాటు యోమెన్ దేశీయురాలైన ముస్లిం మహిళ తవక్కుల్ కర్మన్ లకు 'నోబెల్' శాంతి బహుమతి ఉమ్మడిగా ప్రధానం చేయ బడింది. ఒకే దేశానికి చెందినవారికి వివిధ రంగాలలో 'నోబెల్' బహుమతులు పొందినవారు న్నారు. భారతీయులలో రవీంద్రనాథ్ ఠాగూర్, సర్ సి.వి. రామన్, అమెరికా పౌరసత్వం పొందిన ఖురానా, అమర్త్యసేన్ మొదలగువారు 'నోబెల్' బహుమతి గ్రహీతలే. కాని ఒకే సంవత్సరం, ఒకేనెల, ఒకేరోజున, ఒకే దేశానికి చెందిన వారయిన ముగ్గురు మహిళలకు ఆ ఘనత దక్కింది.**

పాటలు పాడటంతో, ఆమె నాయ కత్వంలో ప్రారంభమైన ఉద్యమం ఎన్నికల్లో మహిళలు పోటీచేసేహక్కు సాధించే వరకు అహింసా పథంలో సాగింది.

ఒకసారి అప్పటి లైబీరియా అధ్యక్షుడు చార్లెస్ టేలర్ చర్చల కొరకు ఆహ్వానించారు. చర్చల్లో పాల్గొనటానికి వెళ్లింది. ఆ సందర్భంలో ఆమెను అరెస్టు చేసే ప్రయత్నాలు జరిగాయి. అది గ్రహించి లేమా బోవీ అరెస్టు చేయటం జరిగితే బహిరంగంగా నగ్నంగా నిలబడతానని బెదిరించింది. దానితో ప్రభుత్వం వెనక్కు తగ్గింది. లేమా బోవీ 'సెక్స్ సమ్మెలకు' శ్రీకారం చుట్టింది. అంతర్యుద్ధ సమయంలో మహిళలపై అత్యాచారాలు జరపటం అణచివేతలో ఒక సాధనంగా తలచి అమలు పరచిన ప్రభుత్వ దళాలకు వ్యతిరేకంగా 'సెక్స్ సమ్మె' ఉద్యమాన్ని ప్రారంభించింది. దానిలో కుల, మత, ప్రాంత, భాష, జాతి భేదాలు లేకుండా మహిళలందరూ ఏకోన్ముఖంగా ఉద్యమంలో పాల్గొన్నారు. 'సెక్స్ సమ్మెలు' విజయవం తంగా నడిచాయి. ఈ కారణాల వల్లనే లేమాబోవీ ఐరన్ లేడీగా పేరు పొందింది. ఎల్లెన్ జాన్సన్ సర్లీఫ్ దేశాధ్యక్షురాలిగా ఎన్నుకోబడటంలో లేమాబోవీ ముఖ్యపాత్ర వహించారు. లేమా బోవీ తోడ్పాటు, సహకారాలు 'సర్లీఫ్' అధ్యక్షురాలవటానికి ఎంతగానో తోడ్పడ్డాయి.

ఉమ్మడి 'నోబెల్' శాంతి పురస్కారాన్నందుకున్న ఆ ఇరువురి మహిళల కంటే చిన్న వయస్కురాలు తవక్కుల్ కర్మన్. యెమెన్ దేశపు ముస్లిం యువతి. 32 సంవత్సరాల కర్మన్ పాత్రికేయురాలు. యెమెన్ అధ్యక్షుడు అలీ అబ్బుల్లా సలేహ్ నిరంకుశ పాలనకు, అరాచకాలను ఎదిరించి పోరాడి రెండుసార్లు జైలుకెళ్లింది. ముస్లిం రాజ్యాలలో మహిళలు ఘోషా పాటించాలి. గడపదాటితే బురఖా ధరించటం తప్పనిసరి. అలాంటి ముస్లిం మహిళ అందునా పాత్రికేయురాలిగా పనిచేయటం నిప్పుతో చెలగాటమాడటమే. 2005లో కర్మన్ 'ఉమెన్ జర్నలిస్ట్స్ చైన్' అనే ఎన్‌జీఓను స్థాపించి సారధ్యం వహించి పనిచేస్తున్నారు. వాక్ స్వాతంత్ర్యం, ప్రజాస్వామిక హక్కుల కోసం, నిరంకుశ పాలకులకు వ్యతిరేకంగా పోరాడుతున్నది. దేశంలో ప్రజల్ని పట్టిపీడిస్తున్న పేదరికం, అవినీతి, నిరుద్యోగం మొదలగు సామాజిక సమస్యల మీద ఎడతెరిపిలేని పోరాటం చేస్తున్నది. వీటిని పరిష్కరించలేని పాలకుడు అలీ అబ్దుల్లా సలేహ్ పదవి నుండి వెంటనే వైదొలగాలని డిమాండ్ చేస్తున్నది. యెమెన్ రాజధానిలో 'ఫ్రీడమ్ స్క్వేర్' వద్ద ప్రతివారంలో ఒకరోజు ధర్నా చేస్తుంది. 2007 నుంచి ఈ ధర్నా నిరంతరాయంగా సాగుతూంది. యెమెన్ ముస్లిం మహిళలు ఆపాదమస్తకం బురఖా ధరిస్తారు. కాని కర్మన్ మాత్రం తలమీద కేవలం స్కార్ఫ్‌ని కప్పుకుంటుంది. ఛాందస మత సాంప్రదాయవాదులకు ఇది కంటగింపుగానే ఉంటుంది. ప్రజల అభిమానాన్ని చూరగొని కొరకరానికొయ్యగా తయారైన కర్మన్‌ను ఏమీ చేయలేక తమ కోపాగ్నిని దిగమింగి ఊరుకున్నారు. గల్ఫ్ దేశాలలో రగులుకొన్న ప్రజాపోరాట జ్వాలలు ఒక దేశం నుంచి మరోదేశాన్ని దావానంలా చుట్టు ముట్టు తున్నాయి. వాటిలో యెమెన్ అధ్యక్షుడు నియంత అబ్దుల్లా కూడా పరాజితుడుగాక తప్పదు. కర్మన్ పోరాటానికి విజయం తథ్యం. అహింసా పథంలో పయనించి, అహింసాయుత పద్ధతులను అనుసరించి శాంతి స్థాపన కొరకు అవిరళ కృషికి గుర్తింపుగా సర్లీఫ్, లేమా బోవీ, తవక్కుల్ కర్మన్‌లు 'నోబెల్' శాంతి బహుమతి గ్రహీతలయ్యారు. అందుకు మనమందరం కూడా ఆ మూడు శాంతి కపోత మహిళా మణులకు హర్షాతిరేకంతో హృదయపూర్వక అభినందనలు అందజేద్దాం.



**యెమెన్ దేశపు ముస్లిం యువతి. 32 సంవత్సరాల కర్మన్ పాత్రికేయురాలు. యెమెన్ అధ్యక్షుడు అలీ అబ్బుల్లా సలేహ్ నిరంకుశ పాలనకు, అరాచకాలను ఎదిరించి పోరాడి రెండుసార్లు జైలుకెళ్లింది. ముస్లిం రాజ్యాలలో మహిళలు ఘోషా పాటించాలి. గడపదాటితే బురఖా ధరించటం తప్పనిసరి. అలాంటి ముస్లిం మహిళ అందునా పాత్రికేయురాలిగా పనిచేయటం నిప్పుతో చెలగాటమాడటమే. 2005లో కర్మన్ 'ఉమెన్ జర్నలిస్ట్స్ చైన్' అనే ఎన్‌జీఓను స్థాపించి సారధ్యం వహించి పనిచేస్తున్నారు.**

# అమ్మమ్మ కథ

కొడవటిగంటి కుటుంబరావు.

మా శంభూగాడూ, తలోదరీ వాళ్ళ అమ్మమ్మను కథ చెప్పమని వేధించటం నాకు వినిపించింది.

ఈ ఒక్క ముక్కా వివరించటానికి కొన్ని విషయాలు చెప్పాలి.

మా అత్తగారు మాతోటే ఉంటున్నది. ఆవిడ కిద్దరు కూతుళ్ళు. నా భార్య చిన్నది. మా వదినెగారిని పోవూరిచ్చారు. అయితే వాళ్ళు పోవూర్లో ఉండడం లేదు. బొంబాయిలో ఉంటున్నారు. నా షడ్డకుడికి రెక్కాడితేగాని డొక్కాడదు. అందులో కూడా రెక్కాడటం జాస్తీ డొక్కాడటం కాస్త తక్కువాను. పెళ్ళినాటికి అతనికి కాస్త పొలమూ పుట్రా ఉండేది. పెళ్ళయాక ఆ కాస్తా హరించుకుపోయింది. మా వదినెగారి పాదం నిప్పాదమని అత్తవారు విసుక్కున్నారు. దరిద్రుణ్ణి చేసుకున్నదని మా అత్తగారు కూడా పెద్ద కూతురిపైన చిరాకుపడి తనకున్న నాలుగెకరాల " పసుపు కుంకుమా"తో సహా మా దగ్గరికి వచ్చేసింది. లేనివాడి కెవరిస్తారు? మొగుడుపోయిన ఆవిడకి తన " పసుపు కుంకుమ " పొలంతో రుణం తీరిపోయినట్టయి, దాన్ని ఏ కూతురికిద్దామని, ఎరిగినవాళ్ళందరితోనూ సంప్రదించి ఆలోచన చేసింది. ఇద్దరికి చెరిసగం ఇవ్వమని చాలామంది సలహా ఇచ్చారు. అంత ధర్మబద్ధంగా పంచేసి అనామకురాలిగా ఉండటం 'ఆస్తి' గల ఏ ఆడదానికిష్టమవుతుంది గనకా?

తల్లికోసం మా వదినగారు మహా తహతహలాడింది. మొగుడు తెచ్చే మూడు వందలతో వాళ్ళ సంసారం ఏమాత్రమూ సుఖంగా జరగటంలేదు. అందులో వంద పైచిలుకు ఇంటి అద్దెకూ కరెంటుకూ పోనేపోతుంది.



కొందరి అదృష్టం అలా ఉంటుంది. యుద్ధానికి ముందు మా షడ్డకుడు బెజవాడ రైసు మిల్లులో పని చేశాడు. అప్పుడూ అతని జీతం చాలీ చాలకుండానే అఘోరించింది. ఇట్లా కాదని మద్రాసులో ఒక ఉద్యోగం సంపాదించుకుని అక్కడికి మకాం మార్చాడు. వద్నాలుగు మాసాల వ్యవధిలో మా వదినెగారు ఇద్దరు పిల్లల్ని కని ఆ జీతం రాళ్ళు చాలీచాలకుండా చేసింది.

తరువాత బొంబాయి ఉద్యోగమూ, మరి ముగ్గురి పిల్లలూ దారిద్ర్యమూ– మా షడ్డకుడి అదృష్టంలో ఏమీ మార్పులేదు. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టుగా మా షడ్డకుడు ఆరోపిల్ల కూడా పుట్టాక ఆపరేషను చేయించుకుని ఫామిలీ ప్లానింగు అనబడే కుటుంబ నియంత్రణ అమలు జరిపాడు.

చెప్పొచ్చిందేమిటంటే, తన తల్లి తాలూకు నాలుగెకరాలూ తన పేరే పెట్టించేసుకుందామని మా వదినెగారు భగీరథ ప్రయత్నం చేసింది.

" దాని దురాశ చూశావుటేవ్?" అన్నది మా అత్తగారు మా ఆవిడతో.

" ఒక చెంప జరగకచస్తుంటే దురాశ అంటావేమిటి?" అని మా ఆవిడ తల్లిని కోప్పడింది. తెలుగు వాళ్ళకు దుఃశబ్దం చాలా ఇష్టం. శాలువాను దుశ్శాలువ అన్నట్టే ఆశను దురాశ అంటారు. అభిమానాన్ని దురభిమానమంటారు.

" అయితే ఆ కాస్తా దానికిచ్చేసి నీ నోటా నీ పిల్లల నోటా కరక్కాయ కొట్టనా?" అన్నది మా అత్తగారు. అంత దురన్యాయం, ఆలోచిస్తేనే తనకు కంపరంగా ఉన్నట్లు.

మా ఆవిడ తల్లి మీద విసుక్కుని, " నీ పొలం లేకపోతే మేం కరక్కాయలు తినలేం. ఆ ముష్టి పొలాన్ని పట్టుకుని ఊరేగక దానికిచ్చేసి నిశ్చింతగా కూర్చో" అన్నది.

" అయితే నీకక్కర్లేదంటావ్?" అన్నది మా అత్తగారు బెదిరింపుగా.

" వద్దు"

" నిజంగా వొద్దా?"

" వద్దు మొర్రో అంటుంటిని కాదుటమ్మా?"

అంతే తన ఆస్తిని మా ఆవిడకే ఇవ్వాలని మా అత్తగారు నిర్ధారణ చేసింది.

నాకు మామూలు మనుషుల మనస్తత్వమే అర్థం కాదు. డిటెక్టివు నవల ప్లాటులాంటి మా అత్తగారి మనస్తత్వం ఏం అర్థం అవుతుంది? దేహీ అని అడగని వాళ్ళే ఎక్కువ పాత్రత గలవాళ్ళని ఆవిడ

" ఒక చెంప జరగకచస్తుంటే దురాశ అంటావేమిటి?" అని మా ఆవిడ తల్లిని కోప్పడింది. తెలుగు వాళ్ళకు దుఃశబ్దం చాలా ఇష్టం. శాలువాను దుశ్శాలువ అన్నట్టే ఆశను దురాశ అంటారు. అభిమానాన్ని దురభిమానమంటారు.

" అయితే ఆ కాస్తా దానికిచ్చేసి నీ నోటా నీ పిల్లల నోటా కరక్కాయ కొట్టనా?" అన్నది మా అత్తగారు. అంత దురన్యాయం. ఆలోచిస్తేనే తనకు కంపరంగా ఉన్నట్లు.

ఉద్దేశ్యమేమో. లేకపోతే తన చిన్న కూతురికి తనమీద గురి తక్కువగా ఉన్నట్టు గ్రహించి, మరింత గౌరవం సంపాదించగలందులకు తన పొలాన్ని ఇవ్వాలని నిశ్చయించిందేమో. పెద్ద కూతురు-ఆ నాలుగెకరాల కోసమే కావచ్చు గాక- తల్లిని దేవుడల్లే చూసింది. అలా చూసే ఆవిడ తల్లికి లోకువయిందేమో నాకు తెలీదు.

మా ఆవిడ నాలో నమ్మకం లేక ముందుగానే హెచ్చరించింది.

" మా అమ్మ మీతో చెబుతుంది. తన ఆస్తి నా పేర పెట్టబోతున్నానని, మీరు ఎగిరి చంకలు గుద్దుకోక గుంభనంగా ఉండండి. ఆస్తి నీ పేర పెడతానే అంటుంది గాని, అది నా పేర పెట్టడమూ కాదు, పాడూ కాదు. ఆ పొలం మీద ఏటా ఆరేడు వందలు వస్తాయి. వాటిని తెచ్చి నా ఒళ్ళో పోసి తాను వచ్చి నా నెత్తిన ఎక్కి కూర్చుంటుంది. ఈవిణ్ణి ఎట్లా వదిలించుకోవాలో నాకు తోచటం లేదు".

" పెద్దది వచ్చి మన దగ్గిర ఉంటానంటే వద్దంటావా. డబ్బియ్యక పోయినా ఉంచుకోవచ్చునే!" అన్నాను.

" ఆవిడ రాకుండా ఉంటే ఎదురు డబ్బిస్తాను. మీకేం, చెబుతారు? అత్తగారని మీకు మోజైతే నాకేమీ లేదు" అన్నది మా ఆవిడ.

చెప్పు ఎక్కడ కరిచేది, తొడుక్కున్న వాడికే తెలుస్తుందని నేనూ ఒప్పుకుంటాను. మా అత్తగారు నా నరాల మీదికేనాడు రాలేదు. కాని మా ఆవిడ మాత్రం తన తల్లితో అంత బాగా వేగలేని మాట నిజం. మా అత్తగారు రెండే రెండు మాటలు అనేసరికి మా ఆవిడకు ఊపిరి అందక పోవటమూ, కళ్ళు మెరవటమూ, గొంతు కీచుపోవటమూ నేను కళ్ళారా చూసి నేను రహస్యంగా మందలించాను కూడా.

" ఆవిడ మీద నీకేదో శత్రుత్వం. ఉత్త పుణ్యానికెందుకట్లా ఆయాసపడి పోతావు? ఆవిడ ఏమన్నదని?" అన్నాను.

"మీకు తెలియకపోతే ఊరుకోండి. ఆవిడ మనస్సులకు తొడపాశం పెడుతుంది" అన్నది మా ఆవిడ. మనస్సుకు తొడపాశం పెట్టటమనేది నేను మా ఆవిడ నోటే విన్నాను.

మా ఆవిడ ఓడిపోయిందని నేననుకున్నా, మా అత్తగారు గెలిచాననుకున్నట్టు కనపడలేదు. ఆవిడ మనస్తత్వంలో నాకు కనిపించిన తిరుగుడు అదే. మరొకరైతే విజయగర్వంతో తృప్తిపడేవారు. కాని ఆవిడ మట్టుకు మధ్య మధ్య మా ఆవిడకు పరీక్షపెట్టేది. "

మా ఆవిడ కూడా భగీరథ ప్రయత్నమే చేసింది తల్లిని దూరంగా ఉంచటానికి. మా అత్తగారు సామాన్యురాలు కాదు. ఇద్దరు కూతుళ్ళ భగీరథ ప్రయత్నాలనూ వ్యర్థం చేసి మా ఇంటికి వచ్చేసింది.

" నువ్వు మీ అమ్మను రెండు చేతులూ చాచి ఆహ్వానించి ఉంటే ఆవిడ రాకపోనేమో" అన్నాను.

" ఈ మాట ముందు చెప్పకపోయారా. ఇన్నాళ్ళూ ఏం చేస్తున్నారు?" అన్నది మా ఆవిడ.

మా షడ్డకుడి కుటుంబ నియంత్రణలాగే నా నలహా కూడా గత జలసేతు బంధనమయింది.

❖ ❖ ❖

మా ఆవిడ ఓడిపోయిందని నేననుకున్నా, మా అత్తగారు గెలిచాననుకున్నట్టు కనపడలేదు. ఆవిడ మనస్తత్వంలో నాకు కనిపించిన తిరుగుడు అదే. మరొకరైతే విజయగర్వంతో తృప్తిపడేవారు. కాని ఆవిడ మట్టుకు మధ్య మధ్య మా ఆవిడకు పరీక్షపెట్టేది. " పాపం,అది బొంబాయిలో ఆ దరిద్రుడితో ఏం అగచాట్లు పడుతోందో, దాన్ని చూడాలనిపిస్తోందే" అనేది.

వెళ్ళాలని ఉందనకపోతే ఒకసారి చూసి రారాదూ, ఇక్కడ రైలెక్కి అక్కడ దిగటమేగా?" అనేది.

" రైలైతే మాత్రం దూరాభారం కాకుండా పోతుందా? పైగా అదేం పట్నం, అవేం కార్లు! ఒకసారి వెళ్ళాగా? క్షణాన ఏ కారు మీదుగా పోతుందోనని భయపడి చచ్చాననుకో."

వెంటనే మా ఆవిడ " నీకు అక్కమీద అంత జాలి ఉంటే ఒక ఏడాది అయివేజు దానికి పంపరాదూ?" అన్నది మా ఆవిడ ఒకసారి.

మా అత్తగారు అంకిళ్ళు నొక్కుకుని, " మీ మీద పడి తింటూ దానికెక్కడ డబ్బు పంపనే హవ్వ!" అన్నది.

"నీకింత తిండిపెట్టలేమంటావా ఏమిటి? లేక మేం హోటలు నడుపుతున్నామని నీ ఉద్దేశ్యమా?" అన్నది నా భార్య రెచ్చిపోయి.

" చూశావా, చూశావా? నేననని మాటలు కూడా ఎట్లా కల్పిస్తోందో?" అన్నది మా అత్తగారు ఆశరీర ధర్మసాక్షితో.

" డబ్బుకు తిండికి ముడిపెట్టింది నువ్వా? నేనా?"

మా అత్తగారు విషయం మార్చేసి " పోవాలనుకుంటే మాత్రం చెంబుగాణ్నీ, వట్టిముండనూ వదిలి ఎట్లా ఉండనే?" అన్నది.

ఇక్కడ రెండు విషయాలు స్పష్టం చేయాలి. మా అత్తగారు తన డబ్బు మేం తింటున్నామని మనస్ఫూర్తిగా నమ్మిందేగాని, నేనేనాడూ అనుకోలేదు. ఆ డబ్బు ఆవిడ చేతి మీదుగానే ఖర్చయేది. ఒకసారి నగలు కొనేది- (నాకు పనికివచ్చే ధోవతులు గాని, పాంటు, షర్టు గుడ్డలు గాని ఏనాడూ కొనలేదు. ఒక్కసారి కొన్నా నేనావిడ రుణాన పోయినట్టు బాధపడి ఉండేవాణ్ణే) ప్రతి నాటకానికీ, సినిమాకు బయలుదేరేది. ఇరుగు

పొరుగువాళ్ళకు అప్పులిచ్చేది. ఏమేమిటో చేసేది. నిజంగా ఆవిడ ఖర్చు ఆవిడ భరించుతుంటే ఆవిడ ఉన్నందుకు నాకు అదనపు ఖర్చుకానవసరంలేదు. కాని అవుతూ వచ్చింది.

" మీ అమ్మ ఒక్కతేకదా వచ్చింది. మన ఇంటి ఖర్చు దాదాపు రెట్టింపయిందేమి?" అని నేను మా ఆవిణ్ణి అడిగితే " అడక్కండి, రోజూ పిండివంటలు చేస్తానంటుంది నూనె, నెయ్యీ మంచినీళ్ళలాగా వాడేస్తుంది. ఎక్కడ అడ్డు పడనూ! అప్పడాలు కాల్చరాదట, వేయించాలట. అక్కడికీ ఏదో వంక చెప్పి అడ్డు పడుతూనే ఉన్నాను. నాకు మతిపోతున్నది. ఆవిడతో రోజుకు తొంభై అబద్ధాలాడేస్తున్నాను" అన్నది.

ఇక రెండవ సంగతి- మా పిల్లలంటే ఆవిడకు ముద్దు. నేను నమ్మను. వాళ్ళు మా అత్తగారిని చాలా అసహ్యమైన మాటలన్నీ అంటారు. మరీ మా తలోదరి నోటికి హద్దూ, పద్దూ లేదు. దానికి మేం బారసాల చేసి పేరంటూ పెట్టలేదు. అది అందరినీ తన పొట్టతో కొలుస్తుంది. దానికి మూడు చాక్లెట్లిచ్చిన వాళ్ళకన్నా నాలుగిచ్చినవాళ్ళు ఎక్కువ మంచివాళ్ళంటుంది. తాను తినేది అటుకులైనా సరే ఓపిగ్గా కూచుని లెక్కపెట్టి, కుర్రాడికి కూడా లెక్కపెడతానంటుంది. చూసి చూసి దానికి తలోదరి అని పేరు పెట్టాను. " తలోదరి ఏమిటి?" అని మా ఆవిడ అడిగితే

"దానితలలో ఉదరం ఉందో, ఉదరంలో తల ఉందో ఇంకా తేలలేదు గాని, అది తలోదరి మటుకు అవును" అన్నాను.

మా అత్తగారు మొట్టమొదటిసారి దాన్ని నెలల పిల్లగా చూసి, "దీనికేం పేరు పెట్టారే?" అని అడిగితే మా ఆవిడ నీపేరే పెట్టాం'అనేసింది. ఆవిడ నమ్మింది.

కాని మేం దాన్ని "తలోదరీ,' తలా" " ఉదరం" అని పిలుస్తుంటే పిల్ల పలకటం చూసి ఆవిడ " నాపేరు పెట్టామన్నారూ?" అన్నది.

" అది ముద్దు పేరులే" అన్నది మా ఆవిడ.

పిల్లకు తన పేరే పెట్టుకున్నామనే నమ్మకంతో ఆవిడ మా తలోదరిని కొంతకాలం జాస్తి మమకారంతో చూసింది. కాని ఆ మమకారం దక్కలేదు.

" నీ పేరు సుభద్రే! నా పేరూ అదే. నన్ను చిన్నపుడు సుబ్బా అని పిలిచేవాళ్ళు, నువ్వు కూడా అట్లా పిలిస్తేగాని పలక్కు" అన్నదావిడ.

మా పిల్లలిద్దరు కొత్తరకం పిప్పరమెంటును చప్పరించినట్టు "సుబ్బ" అనే మాటను చాలాసార్లు ఉచ్చరించి చూసుకుని, 'హెహెహే, సుబ్బు, చుప్పు, సుబ్బు సుబ్బు జబ్బు బుబ్బుబ్బు బ్బు బ్బు" అని ఆట మొదలుపెట్టారు.

ఈ ఆట కొంచెంసేపు ఆడాక వాళ్ళు కోతులల్లే ఒకరినొకరు అనుకరిస్తూ ఆవిడ నెత్తిన చెయ్యిపెట్టి రుద్దుతూ, "సుబ్బా ఓ సుబ్బా!" అని పిలుస్తూ కిలకిలా నవ్వారు.

"చాల్లే ఊరుకోండి! మీకు చిన్నంతరం పెద్దంతరం లేదు" అని ఆవిడ వాళ్ళను కసిరింది. వాళ్ళావిడ ఆగ్రహాన్ని లక్ష్య పెట్టలేదు. మొత్తంమీద ఆవిడ వాళ్ళ గౌరవాన్ని సంపాదించలేకపోయింది. ఏ పత్రికలో ఏ ముసలమ్మ బొమ్మ కనిపించినా, " అచ్చు అమ్మమ్మే" అనేవాళ్ళు.

" అమ్మమ్మా నీకు సినిమాలంటే అంత ఇష్టమైతే సినిమాల్లో వేషం వెయ్యరాదూ?" అనేవాళ్ళు.

మా ఆవిడే పిల్లల్ని మందలించేది, బెదిరించేది కూడా.

" ఎందుకు వాళ్ళని తిట్టిపోస్తావు?" అన్నాను.

" వాళ్ళావిణ్ని నోటికొచ్చిన మాటల్లా అంటున్నారు. పెద్దవాళ్ళం మనం అనివిన్నా మనుకుంటుందేమోనని నాభయం".

" అనుకోనీ అనుకుంటే మన దగ్గిర ఉండకుండా వెళ్ళిపోతుందనా నీ భయం?"

"ఆవిణ్ని పంపాలంటే ఇదా పద్ధతి? పిల్లల దగ్గర లొల్లి అయింది. వాళ్ళు చెడిపోతున్నారని కూడా నాకు భయమే. చెప్పొద్దూ? శంభుగాడు మరీ పెచ్చుమీరిపోతున్నాడు".

" అవును వాణ్ణి ఆవిడ చుడింబూ వెండి చెంబూ అని వైన వైనాలుగా పిలుస్తున్నది. వాడు పోటీపడి ఆవిణ్ణి కూడా వైన వైనాలుగా పిలుస్తున్నాడు!"

" ఎక్కడి పీడ వచ్చి పడిందండీ?"



మా పిల్లల్ని నేను అదుపు చెయ్యదలచలేదు. మా ఆవిడ చెయ్యలేకపోయింది. కాని వాళ్ళను నిగ్రహించే ఉపాయం మా అత్తగారే కనిపెట్టింది.

ఆవిడ వాళ్ళకు నీతి కథలు చెప్పనారంభించింది. ఒక విధంగా ఆవిడది క్లాసికల్ పద్ధతి. నీతి కథలన్నవి ఒక్కొక్క సందర్భాన్ని పురస్కరించుకుని పుట్టాయి. వాటిలో ఉండే నీతిని ఆధారం చేసుకుని ఎవరో ఒకరు తమ ప్రవర్తనను సరిదిద్దుకున్నారు. ఆ తరువాత వాటిని మనం పుస్తకాలలో చదువుకోవటం సందర్భం, శుద్ధి లేకుండా జరిగింది. దర్జీవాడి కొడుక్కి మూడో తరగతిలో మిత్రభేదం చెప్పితే ఏమంటాడు? నీతి కథలను సందర్భోచితంగా చెప్పటమే సరి అయిన పద్ధతి అని నా నమ్మకం.

మా అత్తగారు ఆ పద్ధతి అవలంబించింది. ఆవిడ వాటిని కేవలం ఆత్మరక్షణార్థం వినియోగించుకున్నది. పాత కథలో సందర్భోచితంగా ఉండే వాటినే చెప్పేది. సందర్భానికి సరిపడే కథ లేనప్పుడావిడ కొత్తవాటిని సృష్టించి చెప్పేది....

**ఆవిడ వాళ్ళకు నీతి కథలు చెప్పనారంభించింది. ఒక విధంగా ఆవిడది క్లాసికల్ పద్ధతి. నీతి కథలన్నవి ఒక్కొక్క సందర్భాన్ని పురస్కరించుకుని పుట్టాయి. వాటిలో ఉండే నీతిని ఆధారం చేసుకుని ఎవరో ఒకరు తమ ప్రవర్తనను సరిదిద్దుకున్నారు. ఆ తరువాత వాటిని మనం పుస్తకాలలో చదువుకోవటం సందర్భం, శుద్ధి లేకుండా జరిగింది. దర్జీవాడి కొడుక్కి మూడో తరగతిలో మిత్రభేదం చెప్పితే ఏమంటాడు? నీతి కథలను సందర్భోచితంగా చెప్పటమే సరి అయిన పద్ధతి అని నా నమ్మకం.**

"ఒక మంచి కథ చెప్పు అమ్మమ్మా!" అన్నాడు శంభు.

"ఒక మంచి కథ చెప్పు సుబ్బమ్మా! అన్నది తలోదరి.

" ఇవాళ ఒక మంచి కథ చెపుతానర్రా" అన్నది మా అత్తగారు. కథ చెప్పాలన్న బుద్ధి తానంతట తనకే కలిగినట్టుగా, "అనగనంగా ఒక రాజుకొక కూతురుండేది."

" దాని పేరు తలోదరేనా?" అన్నది తలోదరి.

" ఏమో ఏం పేరో వినండి. దాని తల్లి చచ్చి పోయింది. అందుచేత రాజు రెండో పెళ్ళాం దాన్ని పెంచింది. రెండో పెళ్ళానికి చాలామంది పిల్లలుండేవాళ్ళు. వాళ్ళందరు ఈ తల్లిలేని పిల్లని ఏడిపించేవారు,"

" వాళ్ళందరికన్నా ఇది పెద్దదిగా? ఎట్లా ఏడిపించేవాళ్ళూ?" అన్నాడు శంభుగాడు.

" పెద్దదని నేనన్నానేమిటి? చెప్పింది వినక అన్నీ ఊహించుకుంటా వేంరా?"

" రెండో పెళ్ళాం పిల్లలంటివిగా, అమ్మమ్మా! మనింటి వెనక రామయ్య పెళ్ళాం, రెండో పెళ్ళి పెళ్ళాం. రామయ్యకు మొదటి పెళ్ళాం కూతురు రెండో పెళ్ళాం కన్నా పెద్దది. మేం చూశాం కూడా".

మా అత్తగారు చిక్కులోపడి, " రాజు గారు ఇద్దరు పెళ్ళాలనీ ఒకసారే చేసు కున్నాడు" అన్నది.

" అట్లా చేసుకుంటే జైల్లో పెడతారటమ్మ మ్మా! అమ్మ చెప్పింది."

" రాజును ఎవరు జైల్లో పెడతార్రా! రాజులేదన్నా చెయ్యొచ్చు. కథ వినండి. పాపం, తల్లిలేని పిల్లని సవిత్తల్లీ, సవితి అన్నలూ, అక్కలూ నానా కష్టాలూ పెట్టేవాళ్ళు, పనంతా చేయించేవాళ్ళు. మూకుట్లో చాలీచాలకుండా పాసిన అన్నం పెట్టేవాళ్ళు."

" ఏం రాజుగారికి డబ్బులేదా?"

"రాజుగారింట్లో మూకుళ్ళుంటాయా?"

" మనింట్లో మిగిలిన అన్నం పనిమనిషిక్కూడా వెయ్యమే."

మా అత్తగారు ఈ ప్రశ్నలకు తట్టుకోలేక, " మీరు కథ వింటారా? నన్నేదన్నా పని చూసుకోమంటారా?" అన్నది.

" వింటాం వింటాం! చెప్పు!చెప్పు!"

మా అత్తగారు పోయిన ఉత్సాహాన్ని మళ్ళీ తెచ్చుకుంటూ, " అప్పుడేమయిందంటే పాపం. ఆ తల్లిలేని పిల్లకు ఒకనాడు చచ్చిపోయిన తల్లి కల్లో కనిపించి., " అమ్మా విను! నీ సవిత్తల్లి, అక్కలూ, అన్నలూ సరిగ్గా చూసేట్టు నే చేస్తాను. నీ నోట మంచి మాట వచ్చినప్పుడల్లా ఓ ముత్యం రాలుతుంది. ఆ తరువాత నువు సుఖంగా ఉంటావు" అని చెప్పింది" అని ప్రారంభించింది.

నేను ఆలోచనలన్నీ కట్టిపెట్టి ఆవిడ చెప్పే కథ వినసాగాను. కథ చప్పున చూడటానికి పాతదల్లే ఉన్నా అందులో ఏదో కొత్త అంశం ఉంది. అది నవ్వితే నవరత్నాలు కథకాదు. తనను ఏడిపించేవాళ్ళు పాడు పనిచేసినా, పాడు మాటలన్నా అనాథ పిల్ల వాళ్ళకు హితబోధ చేస్తుంది. ఆమె నోటినుంచి హితం వచ్చినప్పుడల్లా నోటినుంచి ఒక పెద్ద ముత్యం రాలుతుంది. వాటిని దురాశా పరులైన సవిత్తల్లి ఆవిడ పిల్లలూ ఏరుకుంటూ ఉంటారు.

బహుశా మా అత్తగారి ఉద్దేశం మా పిల్లలకు మంచి మాటలే అనడం నేర్పాలని అయి ఉంటుంది. కాని కథ పూర్తయ్యే లోపలే ఎదుటింటి అంబుజం బయటినుంచి "మామి" అని పిలిచింది. వెంటనే మా అత్తగారు కథను మధ్యలో వదిలేసి బయటికి వెళ్ళింది. మా చుట్టుపక్కలవాళ్ళూ, మా ఇంటికి వచ్చేవాళ్ళూ మా అత్తగారి కంటపడిగాని మా ఆవిడ కంటపడటానికి లేదు. అదీ పరిస్థితి. ఎపుడన్నా దారితప్పి ఆవిడకి తెలియనివాళ్ళు వచ్చి, మా ఆవిడతో మాట్లాడి వెళ్ళితే, వాళ్ళ పుట్టుపూర్వోత్తరాలన్నీ తల్లికి చెప్పకుండా ఆవిడ ఇంకే పని చేసుకోవటానికి లేదు.

" ఇంటికెవరొచ్చినా ముందు తాను పరుగెత్తుతుంది" అన్నది తలోదరి.

" మన గూర్ఖా?" అన్నాడు శంభుగాడు.

"కథ పూర్తి చెయ్యకుండా వెళ్ళింది చూడు. నాన్నా నీకీ కథ వచ్చునా? తరువాత ఏమయింది నాన్నా, అన్నది తలోదరి, శంభుగాణ్ణి వెంటబెట్టుకొని నా దగ్గరకొచ్చి.

"ఏమవుతుందీ? ఆ తల్లిలేని పిల్ల మంచి సలహా చెప్పినప్పుడల్లా దాని నోట ముత్యం రాలుతుంది కదూ? ఆ ముత్యాల కోసం ఆశపడి దాని సవిత్తల్లి, ఆవిడ పిల్లలూ అస్తమానమూ ఏదో పాడు మాటలనేవాళ్ళు. వాళ్ళు పాడు మాటలన్నప్పుడూ, పాడు పనులు చేసినప్పుడూ తల్లిలేని పిల్ల, " అలా అనకూడదు' అనేది. జంతువుల్ని పట్టుకుని చావగొట్టేవాళ్ళు. " అలా జంతుహింస చేయకూడదు" అనేది. ముత్యం రాలేది. దేవుణ్ణి 'లంజా కొడుకు' లంఫ్డీ కొడుకు' అని తిట్టేవాళ్ళు. " దేవుణ్ణి అలా తిట్టకూడదు' అనేది. ముత్యం రాలేది. ఆ పిల్లమూలంగా వాళ్ళు అన్నీ పాపిష్టి పనులే చేసి లక్షలూ, కోట్లూ ముత్యాలు సంపాదించుకున్నారు. చివరకు అందరూ యమధర్మరాజు దగ్గరికి వెళ్ళినప్పుడు యమధర్మరాజు పాపిష్టి పనులన్నీ చేసిన వాళ్ళను స్వర్గానికి పంపించి, మంచి నీతులు చెప్పిన పిల్లను రౌరవ నరకంలో లక్ష ఏళ్ళు కాలమన్నాడు" అని కథ ముగించాను.

అమ్మమ్మ కథ పూర్తిచేసే ఉత్సాహంలో నేను గమనించనేలేదు. ఆవిడ అంబుజాన్ని అప్పుడే పంపేసి తిరిగి వచ్చి నేను పూర్తిచేసిన కథ వినసే విన్నది. కథ పూర్తి అయాక పిల్లలు "హే హే హే రావురావు నరకం!లక్షేళ్ళు!" అని చాలా ఆనందించారు.

ఆరోజు మా అత్తగారు తనకు బొంబాయి వెళ్ళాలని ఉన్నట్లు నా భార్యతో అన్నదిట. మా ఆవిడ కావాలని అన్నదో యథాలాపంగా అన్నదోగాని, "ఇప్పుడేం పోతావులెస్తూ" అన్నదిట. తరువాత నాలుగైదు రోజులకే ఆవిడ బొంబాయి వెళ్ళింది. వెళ్ళి నెలదాటింది. ఇంతవరకు ఒక ఉత్తరం ముక్కన్నా రాయలేదు.

**( కథలు-4 కొడవటిగంటి కుటుంబరావు గారి రచనా సంకలనం 1967 నుండి)**

**- విశ్వ శ్రీ**

# రాజకీయమైన కార్పొరేట్ మీడియా

## ఐద్వా 9వ అఖిల భారత మహాసభలో ప్రతిపాదించిన కమిషన్ పత్రం!

**సమాజంలోని అనేక అంశాలపై ముఖ్యంగా కుల, వర్గ, లింగ సమస్యలపై ప్రజలను పెద్దయెత్తున ప్రభావితం చేసేదిగా మాస్ మీడియా అభివృద్ధి చెందింది. ప్రపంచీకరణ విధానాలు ప్రారంభమైన గత రెండు దశాబ్దాల నుండి ఇది కార్పొరేట్ తరహాలో ప్రజలపై మరింత ప్రభావం చూపుతున్న వార్తా పత్రికలు, మాసపత్రికలు, జర్నల్స్ మొదలైన వాటితో కూడిన ప్రింట్ మీడియా, వివిధ టెలివిజన్ ఛానల్స్‌తో కూడిన ఎలక్ట్రానిక్ మీడియాలను కలిపి స్థూలంగా మాస్ మీడియాగా పరిగణిస్తున్నారు. దీనితోపాటు ఇంటర్‌నెట్ సంబంధిత జర్నల్స్, బ్లాగ్‌లు, ట్విట్టర్‌లు మొదలైనవి కూడా ఉన్నాయి. ఇవి కాక ప్రజాసంఘాలు, ప్రజా ఉద్యమాలతో ప్రత్యామ్నాయ విధానాల కోసం, ప్రజానుకూల విధానాల కోసం తరచూ వాడే అనేక సాధనాలున్నాయి. అవి పుస్తకాలు, కరపత్రాలు, పోస్టర్లు, జానపద కళలు, జానపద గాథలు మొదలైనవి.**

సమాజంలోని అనేక అంశాలపై ముఖ్యంగా కుల, వర్గ, లింగ సమస్యలపై ప్రజలను పెద్దయెత్తున ప్రభావితం చేసేదిగా మాస్ మీడియా అభివృద్ధి చెందింది. ప్రపంచీకరణ విధానాలు ప్రారంభమైన గత రెండు దశాబ్దాల నుండి ఇది కార్పొరేట్ తరహాలో ప్రజలపై మరింత ప్రభావం చూపుతున్న వార్తా పత్రికలు, మాసపత్రికలు, జర్నల్స్ మొదలైన వాటితో కూడిన ప్రింట్ మీడియా, వివిధ టెలివిజన్ ఛానల్స్‌తో కూడిన ఎలక్ట్రానిక్ మీడియాలను కలిపి స్థూలంగా మాస్ మీడియాగా పరిగణిస్తున్నారు. దీనితోపాటు ఇంటర్‌నెట్ సంబంధిత జర్నల్స్, బ్లాగ్‌లు, ట్విట్టర్‌లు మొదలైనవి కూడా ఉన్నాయి. ఇవి కాక ప్రజాసంఘాలు, ప్రజా ఉద్యమాలతో ప్రత్యామ్నాయ విధానాల కోసం, ప్రజానుకూల విధానాల కోసం తరచూ వాడే అనేక సాధనాలున్నాయి. అవి పుస్తకాలు, కరపత్రాలు, పోస్టర్లు, జానపద కళలు, జానపద గాథలు మొదలైనవి.

1980సం|| తరువాత మీడియా, ముఖ్యంగా ఎలక్ట్రానిక్ మీడియా కార్పొరేటీకరణ జరిగిన తరువాత వినిమయతత్వం, వ్యాపారతత్వం బాగా పెరిగాయి. మీడియా ఒక ప్రక్క మహిళలను కించపరిచే విధంగా, వ్యాపార వస్తువుగా చూడడమేగాక పెద్ద ఎత్తున ప్రజలను వారి రాజకీయ ప్రాముఖ్యతల నుండి మళ్ళించి కృత్రిమమైన వినిమయదారీతత్వం వైపు మళ్ళిస్తున్న 50వ దశకంలో రేడియో మాత్రమే ప్రజలకు అందుబాటులో ఉండేది. 1980లలో దూరదర్శన్ మాత్రమే అందుబాటులోకి వచ్చింది. తరువాత కాలంలో వచ్చిన




కార్పొరేట్ మీడియాతో రేడియో, దూరదర్శన్‌ల ప్రాముఖ్యత తగ్గిపోయింది. కార్పొరేట్ మీడియా చాలా శక్తివంతంగా, తన వ్యాపార ప్రయోజనాలకనుగుణంగా ప్రజల ఎజెండాను ప్రభావితం చేయగలిగే స్థాయికి ఎదిగింది. 1983లో 50 కార్పొరేషన్లు మీడియా రంగంలో పనిచేసేవి. 1990లో అవి 23కు పడిపోయాయి. తరువాత 2000సం||నికి 9 కార్పొరేషన్లు మాత్రమే మిగిలాయి. దీనితో కొద్దిమంది ప్రయోజనాలు మాత్రమే మీడియాలో ప్రతిబింబిస్తున్నాయి. పెద్ద ఎత్తున వున్న ప్రజల రాజకీయ, ఆర్థిక అంశాలకు సంబంధించిన విషయాలకు ప్రాముఖ్యత తగ్గింది. ఈ కార్పొరేషన్లు వేల కోట్ల రూపాయల బడ్జెట్‌లు కలిగి ఉంటాయి. అవి రకరకాల సంఘటనలను, అభివృద్ధిని మాత్రమే చూపెడుతుంటాయి తప్పితే తమ మార్కెట్‌కు అనుకూలంకాని అనేక ప్రజా సమస్యలపై దృష్టి సారించడానికి ఇష్టపడవు. ప్రజలకు వినిమయ తత్వాన్ని నూరిపోసి వ్యాపార వర్గాల ప్రయోజనాల కోసం మీడియా కృషి చేస్తున్న వారి ప్రయోజనాలకు సంబంధించిన అంశాలనే సామాన్య మానవుడు అంగీకరించేలా ప్రభావితం చేసి దానిని పబ్లిక్ డిమాండ్‌గా మీడియా మార్చ గలుగుతున్నది.

చరిత్రను సృష్టించడంగాని, కళలను అభివృద్ధి చేయడం గానీ తమ పనికాదనీ, కేవలం డబ్బు సంపాదనే తమ కర్తవ్యమనీ వాల్ట్ డిస్నీ కంపెనీ సి.ఇ.ఓ. మైఖేల్ ఇస్నల్ చెప్పిన మాటలతోనే మనం కార్పొరేట్ మీడియా ఉద్దేశ్యాన్ని తెలుసుకోవచ్చు.

కనుక కార్పొరేట్ మీడియా రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక అంశాలలో వేటిలోనూ సమాజంలో పలుకుబడీ, అర్థబలం వున్న వర్గాలకు వ్యతిరేకంగా ఏవిధమైన చర్చనూ చేపట్టదు.

### మహిళలపై తప్పుడు అభిప్రాయాలు కలిగించడం

గతం నుండీ మహిళల పట్ల తప్పుడు అభిప్రాయాలను కలిగించేవిధంగా మాస్ మీడియా కార్యక్రమాలు ఉండడాన్ని మనం పరిశీలించి వాటిని తప్పు పట్టాము. మహిళల అంశాలు వచ్చేసరికి ప్రధాన మీడియా కూడా చౌకబారుగా చిత్రించడమే తప్ప వారిపట్ల బాధ్యతాయుతంగా వుండడం లేదు. మహిళలను ఒకవైపు సెక్స్ సింబల్‌గా వారి అందంపై కేంద్రీకరించి చిత్రీకరించడం చేస్తూనే మరోవైపు వారిని మూస పాత్రలలో చిత్రీకరిస్తున్నారు. సమాజంలో పలుకుబడి వుండి ధనవంతులైన వారి సంస్కృతినే ఎక్కువ ప్రచారంలో పెట్టడంతో వారి ఆలోచనలే అసలైన సంస్కృతిగా అంగీకరించేలా చేస్తున్నారు. దీనికితోడు ఏదైనా కేసులలో బాధిత మహిళలు మీడియా దృష్టిలో పడితే ముందుగా వారి శీలంపై అభాండాలు వేస్తారు. దీనికి ఆరుషి హత్య కేసే ఒక పెద్ద ఉదాహరణ. పట్టణ ప్రాంతాలలో చాలామంది మహిళలు పట్టపగలే హత్యగావించ బడుతున్నారు. ఆ కేసులలో పోలీసులు ప్రవేశించినపుడు ముందుగా ఆ మహిళలకు అక్రమ సంబంధాలు ఉన్నాయనే ఆరోపణలు చేస్తుంటారు. ఆమె వ్యక్తిగత జీవితంపై రకరకాల కథలల్లుతారు. కేసు దర్యాప్తు పూర్తయిన తరువాత ఆమె నిరపరాధని నిజానిజాలు తేలిన తరువాత కూడా మీడియా అసలు కథను చెప్పడానికి ముందుకు రాదు. ఎందుకంటే చనిపోయిన మహిళలపై ఒక విధమైన చెడు అభిప్రాయాన్ని ప్రజలలో అప్పటికే మీడియా కలుగచేసేసి వుంటుంది. కొన్ని సార్లు సున్నితమైన సమస్యలను కూడా టెలివిజన్ పంచాయితీల పేరుతో మహిళల వ్యక్తిగత సమస్యలను, నిర్ణయాలను బహిర్గతం చేయాలని మీడియా వత్తిడి చేస్తుంది. ఇది మీడియా మొరటుతనానికి నిదర్శనం.

ఈ కమిషన్ పేపర్ ద్వారా రాజకీయ అంశాలను ప్రస్తావించదలచుకోనప్పటికీ రాజకీయ అంశాలలో మీడియా అటు పేదలను, ఇటు ఉన్నత వర్గాలను ప్రభావితం చేస్తూ ఒక రాజకీయ ఆయుధంగా ఏవిధంగా పనిచేస్తుందో మనం పరిశీలించాలి.

సాధారణ ప్రజానీకంపై మీడియా ప్రభావం, దాని పట్టును గురించి ప్రజాస్వామ్య భావాలు కలిగిన వారందరూ ఆలోచిస్తున్నారు. మిగిలిన ప్రధాన అంశాలతోపాటు మీడియా ప్రదర్శిస్తున్న రాజకీయ సంబంధాల గురించి కార్పొరేట్ శక్తుల ప్రయోజనాల కోసం వాటితో మీడియాకున్న సంబంధాల గురించి అనేక చర్చా గోష్ఠులు, ఉద్యమాలు జరిగాయి. కనుక మీడియా తటస్థంగా ఉంటుందనేది నమ్మరాని విషయం. మీడియా ఏమి చెబుతుంది అనేది ఒక అంశమైతే చెప్పాల్సిన విషయాలను అసలు చెప్పకపోవడం కూడా మరొక అంశం.

విస్తారంగా లభించిన సమాచారాన్ని వారు వక్రీకరించడమే కాక కట్టుకథలు అల్లి అసలు సమాచారాన్ని తప్పుత్రోవ పట్టిస్తారు. అభ్యుదయ భావాలు కలిగిన కొందరు ప్రముఖ మీడియా విశ్లేషకులు కూడా మాస్ మీడియాకు, సమాజంలోని వాస్తవాలకు మధ్య పెరుగుతున్న అంతరాన్ని తప్పు పడుతున్నారు.

వార్తా పత్రికలకు కార్మికుల విషయాలు, ప్రాథమిక విద్య, గృహ నిర్మాణానికి సంబంధించి ఒక్క కరస్పాండెంట్ కూడా ఉండడం లేదంటే దేశంలోని 70శాతం ప్రజలకు సంబంధించిన విషయాలకు వీరు ఎంత ప్రాధాన్యం ఇస్తున్నారో తెలుస్తుంది.

వ్యాపార వర్గాల ప్రయోజనాలను కాపాడే కార్పొరేట్ శక్తుల యాజమాన్యంలో మీడియా వుండడం వలన మొత్తం వ్యవస్థపై దానికి నియంత్రణ ఏర్పడింది. పాలక వర్గాల ప్రయోజనాలను కాపాడడానికి అది సామాన్య ప్రజల అభిప్రాయాలను ప్రభావితం చేస్తూ ఉంటుంది. ఈ కార్పొరేట్ మీడియాను ఎజెండా నిర్ణయించే మీడియాగా చెప్పడం సబబుగా వుంటుంది. ఎందుకంటే వనరులపై దానికున్న గుత్తాధిపత్యం ద్వారా అది ఇతరులకు కొన్ని మార్గదర్శకత్వాలను నిర్దేశించి వాటినే అందరూ అనుసరించాలని చెబుతుంది. వాస్తవంగా ఇది పాలకవర్గాల విధానాలపై ఏకాభిప్రాయాన్ని సాధించి నిజానికి జరగాల్సిన మార్పును నిరోధించేదిగా పనిచేస్తుంది.

### వ్యాపారమయమైన ఎన్నికలు

ప్రజాస్వామ్యంలో ఎన్నికలు ఒక ప్రధానమైన అంశం. కానీ ఎన్నికల్లో డబ్బు ఎంత ప్రధాన పాత్ర పోషిస్తుందో మనకు తెలుసు. ఈ మధ్య తమిళనాడులో జరిగిన ఎన్నికలలో డబ్బు ఎలా ప్రవహించిందో మనం చూశాము.

బూర్జువా పార్టీలు ఒకరికి మించి ఒకరు పోటీపడి ఓటర్లను ప్రభావితం చేసి వారిని కలుషితం చేశారు. ఇటువంటి పోటీలో డిఎంకె పార్టీ అగ్రభాగాన నిలిచింది. ఎలక్షన్ కమిషన్ పరిధి నుండి తప్పించుకునే అనేక మార్గాలు ఆ పార్టీ కనిపెట్టింది. డబ్బుకు బదులుగా ఓటర్లకు టోకెన్లు ఇచ్చి వాటిద్వారా తరువాత కాలంలో బట్టలు, వినిమయ వస్తువులు కొనుగోలు చేసే సదుపాయం కల్పించింది. ఓట్లను డబ్బు రూపంలో కాకుండా వేరే విధంగా కొనుగోలు చేసింది. ఈ మధ్య కాలంలో డబ్బుకు వార్తలు ప్రచురించడం జరుగుతున్నది. దీనినే పెయిడ్ న్యూస్ అంటున్నారు. ప్రకటనలకు కాక వార్తలకు కూడా డబ్బు ముట్టచెప్పడం మొదలైంది. 'డబ్బు లేనిదే వార్త లేదు' అనే విధంగా పత్రికలు తయారయ్యాయి. దీనితో వనరులు, డబ్బు తక్కువగా వున్న, నిజాయితీ కలిగిన రాజకీయ పార్టీలకు కానీ, చిన్న చిన్న పార్టీలకు కానీ, వ్యక్తులకు కానీ వారి గొంతు వినిపించే అవకాశాలు ఉండడంలేదు. అంతేకాక వీక్షకులకు గానీ పాఠకులకు కానీ అసలు వాస్తవాలు తెలియకుండా పోతున్నాయి. ఎన్నికల సమయంలో వార్తా

**సమాజంలో పలుకుబడి వుండి ధనవంతులైన వారి సంస్కృతినే ఎక్కువ ప్రచారంలో పెట్టడంతో వారి ఆలోచనలే అసలైన సంస్కృతిగా అంగీకరించేలా చేస్తున్నారు. దీనికితోడు ఏదైనా కేసులలో బాధిత మహిళలు మీడియా దృష్టిలో పడితే ముందుగా వారి శీలంపై అభాండాలు వేస్తారు. దీనికి ఆరుషి హత్య కేసే ఒక పెద్ద ఉదాహరణ.**

పత్రికలలో పుంఖాను పుంఖాలుగా వార్తా కథనాలు ప్రచురితమవుతాయి. అందుకోసం ఆయా పార్టీల నుండి వారికి డబ్బు అందుతుంది. దీని ద్వారా పార్టీలకు విస్తృత ప్రచారం లభించడంతోపాటు పత్రికలు ముట్టచెప్పే డబ్బును ఎన్నికల ఖర్చు నుండి మినహాయించుకొని రెండు విధాలా లాభం పొందుతున్నారు. ప్రమాదకరమైన ఈ పోకడల వలన జర్నలిస్టులలో అవినీతి పెరగడమేకాక మీడియాకు డబ్బు సంపాదన మార్గంగా మారింది. ప్రముఖ యాడ్ ఏజన్సీలు, సంస్థలు ధనవంతులైన వ్యక్తులకు, పార్టీలకు పనిచేసేవిగా మారిపోయాయి. తమ సంస్థకు సంబంధించిన వివిధ పబ్లికేషన్‌లలో ఆ వార్తలను ప్రముఖంగా ప్రచురిస్తూ ఉంటారు. నేరచరితులైన వారిని కూడా హీరోలుగా, నేతలుగా చిత్రీకరించి, ప్రజలతో ఏమాత్రం సంబంధంలేని వారిని ప్రజానేతలుగా భ్రమింపచేయగలుగుతారు. ప్రముఖవార్తలుగా వాటిని ప్రచురించడంతో ప్రజలు కూడా అదినిజమని నమ్ముతారు. వేరొక ప్రక్క మహిళల కోసం, పేద ప్రజల కోసం నిజాయితీతో కష్టపడి పనిచేసే అభ్యర్థులకు రావాల్సిన ప్రచారం రాదు. తమకు ప్రయోజనం కలిగించే అభ్యర్థులపైనే తరచుగా ఒపీనియన్ పోల్స్ పేరుతో ప్రచారం చేసి వారికి అత్యధిక ప్రచారం తెచ్చిపెడతారు. దీనివలన ప్రజాస్వామ్య స్ఫూర్తి పూర్తిగా నశించి ఎన్నికలనేవి డబ్బు సంపాదించే ఒక వ్యాపారంగా మారిపోయాయి. ప్రపంచీకరణ నేపథ్యంలో ప్రజాస్వామ్యానికి నాల్గవ స్తంభంగా చెప్పబడిన మీడియా, పత్రికలకు ఈ దుర్గతి పట్టింది.

ఈ పరిస్థితులలో ఎన్నికల సంస్కరణలకు ఎంత ప్రాధాన్యముందో మనం అర్థం చేసుకోవచ్చు. ఎన్నికలలో డబ్బు ప్రభావాన్ని, దొంగడబ్బు ప్రవాహాన్ని నిరోధించాలంటే ఎన్నికల నిబంధనలలో సవరణలు చేయాల్సిన అవసరం ఉంది. ఎన్నికలలో పోటీ చేసే అభ్యర్థులకు నిధులను, ఎన్నికలకు సంబంధించిన సామగ్రిని రాష్ట్ర ప్రభుత్వం కల్పించాలి. మీడియాలో ఎన్నికలకు సంబంధించి అందరికీ సమాన అవకాశాలు కల్పించాలి. పెయిడ్ న్యూస్‌ను నిషేధించి దానిని ఎన్నికల నేరంగా పరిగణించేలా చట్టం చేయాలి.

**డబ్బుకు బదులుగా ఓటర్లకు టోకెన్లు ఇచ్చి వాటిద్వారా తరువాత కాలంలో బట్టలు, వినిమయ వస్తువులు కొనుగోలు చేసే సదుపాయం కల్పించింది. ఓట్లను డబ్బు రూపంలో కాకుండా వేరే విధంగా కొనుగోలు చేసింది. ఈ మధ్య కాలంలో డబ్బుకు వార్తలు ప్రచురించడం జరుగుతున్నది. దీనినే పెయిడ్ న్యూస్ అంటున్నారు. ప్రకటనలకు కాక వార్తలకు కూడా డబ్బు ముట్టచెప్పడం మొదలైంది. 'డబ్బు లేనిదే వార్త లేదు' అనే విధంగా పత్రికలు తయారయ్యాయి.**

ప్రముఖ జర్నలిస్టు పాలగుమ్మి సాయినాథ్ చెప్పినట్లు పేపర్లు కాని, మీడియా కానీ అభ్యర్థుల నేర చరిత్రలను ప్రజానీకానికి తెలపడం లేదు. మహారాష్ట్రలో ఈ మధ్య ఎన్నికైన ఎంఎల్ఎ లలో 50 శాతం మంది నేర చరిత్ర కలిగినవారే. వారిపై అనేక క్రిమినల్ కేసులు పెండింగులో ఉన్నాయి.

15వ లోక్‌సభలో ఉన్న ఎం.పి.లలో 300మంది కోటీశ్వరులు. ఇది 14వ లోక్‌సభలోని ఎంపిలతో పోల్చితే 100శాతం పెరిగింది. ఈ కోటీశ్వరులు నిజంగా పేదల పక్షాన పనిచేస్తారా? లేక తమ స్వప్రయోజనాల కోసం పనిచేస్తారా? అనేది మన విమర్శ. ఈ పరిణామం వలన 70శాతంగా ఉన్న మహిళలు, పిల్లలు ఎక్కువగా నష్టపోతున్నారు.

## వివక్ష

మీడియా ఈ రోజుల్లో తీవ్రంగా ఆలోచించాల్సిన రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక అంశాల నుండి ప్రజల దృష్టిని మళ్లించే ప్రయత్నం చేస్తున్నది. ఏవైనా సంచలనాత్మక విషయాలపై ఎక్కువ సమయం కేటాయించి వాటిని ముఖ్యమైన ప్రసార సమయాల్లో ప్రసారం చేస్తుంది. లేకపోతే బాలీవుడ్ సినిమా కథనాలపైనా లేక ఫ్యాషన్ షోలపైనా కార్యక్రమాలు ప్రసారంచేసి ప్రజలను ఆలోచించే దిశ నుండి తప్పించి వారిని ప్రేక్షకపాత్ర వహించేలా చేస్తుంది. ఏవైనా తీవ్రమైన ప్రజా సంబంధిత అంశాలపై చర్చ జరిగినపుడు కూడా ఆ అంశాలను రెండు విధానాలకు సంబంధించిన అంశాలుగా కాక ఇద్దరు వ్యక్తుల మధ్య వైరుధ్యంగా చిత్రీకరించే ప్రయత్నం చేస్తుంది. దానితో అది మన్మోహన్ సింగ్‌కూ, ప్రకాష్ కరత్‌కూ మధ్య వైరుధ్యం గానో లేక ధాకరేకు, రాహుల్ గాంధీకి మధ్య వైరుధ్యంగానో చిత్రీకరించబడుతుందే తప్ప అసలు సమస్యపై కేంద్రీకరణ వుండదు. దీనితో ప్రభుత్వ విధానాలైన ఆహార భద్రత, లౌకికతత్వంపై ప్రభుత్వ విధానం లాంటి తీవ్రమైన అంశాలు ప్రక్కదారి పడతాయి. ఆకలి చావులకు ఆఖరి పేజీ కేటాయిస్తు న్నారు. కానీ అందాల పోటీలకు మాత్రం ముందు పేజీలలో ఎక్కువ స్థలం కేటాయిస్తు న్నారు. మహిళలు అనేక అంశాలపై చేసే పోరాటాలకు అసలు ప్రాధాన్యతే ఇవ్వరు. ఒక వేళ ఇచ్చినా కంటితుడుపుగా ఒక ఫోటో ప్రచురిస్తారు. కార్మిక వర్గం చేసే సమ్మెలు, ధర్నాలను వ్యతిరేక ధోరణితోనో లేక అపజయాలుగానో ప్రచురిస్తారు. కార్మికుల పని పద్ధతులపై లేక వారి న్యాయమైన

**ఆకలి చావులకు ఆఖరి పేజీ కేటాయిస్తున్నారు. కానీ అందాల పోటీలకు మాత్రం ముందు పేజీలలో ఎక్కువ స్థలం కేటాయిస్తున్నారు. మహిళలు అనేక అంశాలపై చేసే పోరాటాలకు అసలు ప్రాధాన్యతే ఇవ్వరు. ఒక వేళ ఇచ్చినా కంటితుడుపుగా ఒక ఫోటో ప్రచురిస్తారు. కార్మిక వర్గం చేసే సమ్మెలు, ధర్నాలను వ్యతిరేక ధోరణితోనో లేక అపజయాలుగానో ప్రచురిస్తారు. కార్మికుల పని పద్ధతులపై లేక వారి న్యాయమైన డిమాండ్లపై వ్యతిరేక ధోరణితో అనేక రాతలు రాస్తుంటారు. అనేక వార్తా పత్రికలలో కార్మిక అంశాలపై పనిచేసే విభాగం కానీ, జర్నలిస్టులుగానీ వుండడం లేదు.**

డిమాండ్లపై వ్యతిరేక ధోరణితో అనేక రాతలు రాస్తుంటారు. అనేక వార్తా పత్రికలలో కార్మిక అంశాలపై పనిచేసే విభాగం కానీ, జర్నలిస్టులుగానీ వుండడం లేదు. ఈ మధ్య కాలంలో పేద మహిళలను తీవ్రంగా బాధిస్తున్న ధరల పెరుగుదలపై ఎన్ని ఛానళ్ళు స్పందించాయి? ప్రింట్ మీడియాలోకానీ, ఎలక్ట్రానిక్ మీడియాలో కానీ అధికశాతం పేదల బ్రతుకులపై ప్రభావం చూపే ధరల అంశంపై కావలసినన్ని ప్రసారాలు చేయడం కానీ దాని మూల కారణాలపై చర్చించడం గానీ చేయలేదు. కొన్ని పత్రికల సంపాద కీయాలు ఈ సమస్యను తీవ్రంగా తీసుకోలేదు. పత్రికల యాజమాన్యాలు పాలకవర్గాల ప్రయోజనాలను కాపాడటానికే ప్రయత్నిస్తాయనే దానికి ఇది నిదర్శనం.

పి. సాయినాథ్ గారి మాటల్లో చెప్పాలంటే ఈ రోజుల్లో ఏ అంశమైనా మీడియా చేతుల్లోనే ఉంది. ఏ అంశమైనా, అది ప్రజలకు ఎంత ముఖ్యమైనదనేది ప్రాతిపదిక కాదు. అది మీడియాకు దాని అధిపతులకు అంగీకారమా? లేదా? అనే దానిపైనే వుంటుంది.

## మీడియా వామపక్ష వ్యతిరేకత

రాజకీయాలను పరిశీలించే వారికెవరికైనా కాంగ్రెస్ పాలనలోని యుపిఎ-1 ప్రభుత్వం కొన్నైనా ప్రజోపయోగమైన పనులు చేయాల్సి వచ్చిందనేది తెలుసు. ఎందుకంటే ఆ ప్రభుత్వం వామపక్ష పార్టీలపై ఆధారపడి నందున కొన్ని ప్రజావ్యతిరేక విధానాలను విడనాడాల్సివచ్చింది. సమాచార హక్కు చట్టం, గ్రామీణ ఉపాధి హామీ పథకం, గృహ హింస వ్యతిరేక చట్టం లాంటి వాటితో మహిళలు అనేక ప్రయోజనాలు పొందారు. ఈ రాజకీయ వాతావరణం సహజంగానే మీడియా యజమానులకు, కార్పొరేట్ శక్తులకు, సమాజంలోని ధనిక వర్గాలకు నచ్చలేదు.

**ఒక మీడియా విమర్శకుడు చెప్పినట్లు పేదలు, అణగారిన వర్గాలకు అధికారం లేకపోవచ్చు. కానీ వారు శక్తి హీనులు కారు. తిరోగమన విధానాలను ఎదిరించే శక్తులు కూడా వున్నాయి. సమాజంలోని అన్ని వర్గాల ప్రజలకూ సమాన ప్రాతినిధ్యం ఉండేలా ఎజెండాను రూపొందింప చేయగల శక్తి అసంఖ్యాకమైన ప్రజల చేతుల్లోనే వుంది.**

వామపక్షాలు ప్రభుత్వానికి మద్దతు ఉపసంహరించుకున్న వెంటనే ఈ శక్తులు వామపక్షాలపై, వామపక్ష ప్రభుత్వాలపై తమ దాడిని కేంద్రీకరించాయి. వామపక్ష వ్యతిరేక ప్రచారానికి అవి అత్యంత ప్రాధాన్యత నిచ్చాయి. వామపక్షాలపై వ్యతిరేకతను రెచ్చగొట్టే క్రమంలో అవి మావోయిస్టు హింసను సమర్థించడానికి పూనుకున్నాయి. పశ్చిమ బెంగాల్లో పాలక వామపక్ష ప్రభుత్వంపై తిరుగుబాటుగా ఈ మావోయిస్టు హింసను కార్పొరేటు మీడియా వెనకేసుకొచ్చింది.

బిబిసి న్యూస్ ఛానల్ 2009సంవత్సరం ఏప్రియల్ 15వ తేదీన దేశంలోని పేదరికమే మావోయిస్టులు రగులుకునేలా చేసిందనే కథనం ప్రసారం చేసింది. వాస్తవాలను పూర్తిగా వక్రీకరించి నక్సలైట్లను, మావోయిస్టు లను రాజకీయ నాయకులని పొగడ్తలతో ముంచెత్తింది.

అట్టడుగు వర్గాల పేద ప్రజలను, పేద రైతులను వారి దారిద్ర్యం నుండి కష్టాల నుండి విముక్తి చేసే నాయకులుగా వారిపై "ది డాన్"అనే పత్రిక 2009 ఆగస్టు2వ తేదీన కథనాలు ప్రసారం చేసింది.

భారతదేశం తన వైఖరిని మార్చు కోవాలని, నక్సలైట్లకు స్వేచ్ఛనివ్వాలని ఒక వార్తా పత్రిక వ్రాసింది. వారు ఏ స్వేచ్ఛ గురించి మాట్లాడుతున్నారు? మహిళలు, పిల్లలతో సహా పేద ప్రజలను కిరాతకంగా చంపడమేనా స్వేచ్ఛ అంటే? అట్టడుగు వర్గాల మహిళలపై లైంగిక వేధింపులకూ, అత్యాచారాలకు పాల్పడడానికేనా స్వేచ్ఛ. పగ పేరుతో ఆరోగ్యం, విద్య అంగన్‌వాడీ సౌకర్యాలు లాంటి సామాజిక సేవలకు కూడా అంతరాయం కలిగించడమేనా స్వేచ్ఛ అంటే? లేక స్వేచ్ఛ అంటే పేద రైతులు, కార్మికుల నుండి పెద్ద మొత్తాలను పిండుకోవడమేనా?

మావోయిస్టులచే చంపబడిన ప్రజలలో ఏ ఒక్క భూస్వామి కానీ, ఏ ఒక్క బడా వ్యాపారవేత్తకానీ లేరనే వాస్తవాన్ని ఏ ఒక్క ఛానల్ కానీ, ఏ ఒక్క పత్రిక కానీ వెలుగులోకి తేవడంలేదు. మేము హింసను సమర్థించడం లేదు. కానీ వారి సిద్ధాంతమైన వ్యక్తిగత హింసావాదాన్ని వారు తలక్రిందులుగా అమలు చేస్తున్నారు. మీడియా ఈ విషయాలపై కావాలనే గుడ్డితనాన్ని ప్రదర్శిస్తున్నది.

నందిగ్రామ్‌లో వందలాదిమంది మహిళలు అత్యాచారాలకు గురయ్యారనీ పిల్లలు హత్య గావించబడ్డారనీ కట్టుకథలల్లిన మీడియా మహిళలు, పిల్లలపై మావోయిస్టు గూండాలు జరిపే అరాచకాలపై మాత్రం మౌనం వహించింది. తీవ్రమైన భౌతిక దాడులకు పాల్పడడం, లైంగిక వేధింపులు, లూటీలు, కాల్పులు జరిపి ప్రజలను భయపెట్టడం, చంపడం, పేద కుటుంబాలను ఇళ్ళ నుండి తరిమివేయడం, సామాజిక సేవలను నిలిపివేయటం లాంటి అరాచకాల నన్నింటినీ ఒక ప్రభుత్వ విధానాలపై కక్ష సాధింపు పేరుతో సమర్థించడం, లేక వాటిపై మౌనం వహించడం సబబేనా? ప్రజాస్వామ్య వ్యవస్థపై ప్రజల నమ్మకాన్ని దెబ్బతీసే విధంగా నిరాఘాటంగా పెచ్చుమీరి పోతున్న ఈ హింసను మీడియా ఖచ్చితంగా ఎండగట్టాలి.

కొన్ని మినహాయింపులు తప్పితే

**బిబిసి న్యూస్ ఛానల్ 2009సంవత్సరం ఏప్రియల్ 15వ తేదీన దేశంలోని పేదరికమే మావోయిస్టులు రగులుకునేలా చేసిందనే కథనం ప్రసారం చేసింది. వాస్తవాలను పూర్తిగా వక్రీకరించి నక్సలైట్లను, మావోయిస్టులను రాజకీయ నాయకులని పొగడ్తలతో ముంచెత్తింది.**

మొత్తంగా మాస్ మీడియా సమాజంలో ధనవంతుల, పలుకుబడి కలిగిన వారి పక్షాన మాత్రమే పనిచేసున్నది. ప్రముఖ మీడియా విమర్శకులు నామ్‌చామ్‌స్కీ చెప్పినట్లు ఆ పని చేయడానికి అది అన్ని రకాల మార్గాలను అనుసరిస్తుంది.

అంశాలను ఎంపిక చేసుకోవడం, సమాచారాన్ని పంపిణీ చేయడం, సమాచారాన్ని వడకట్టడం, నొక్కి చెప్పాల్సిన విషయాలను ఎంపిక చేసుకోవడం, చర్చలు నడపడం, అన్నీ కొన్ని పరిమితులకు లోబడే జరుగుతుంటాయి. సమాజంలో పలుకుబడి, ఆధిపత్యం వున్న వారి ప్రయోజనాలను కాపాడడానికి ప్రతి అంశాన్ని వారు ఎంపిక చేయడం, నిర్ణయించడం, నియంత్రించడం, నిరోధించడం లాంటివన్నీ చేస్తారు.

మరొక ప్రక్క ప్రధాన స్రవంతి మీడియా యొక్క ఈ నియంత్రణను ఎదిరించి అత్యధిక శాతం ప్రజానీకం ఆకాంక్షలకు అనుగుణమైన ప్రత్యామ్నాయ సంస్కృతినీ, సమాచారాన్ని అభివృద్ధి చేసేందుకు వీధి నాటకాలు, జానపదగాథలు, స్థానిక కళలు మొదలైన కళా రూపాల ద్వారా ప్రచారం జరుగుతున్నది. ఒక మీడియా విమర్శకుడు చెప్పినట్లు పేదలు, అణగారిన వర్గాలకు అధికారం లేకపోవచ్చు. కానీ వారు శక్తి హీనులు కారు. తిరోగమన విధానాలను ఎదిరించే శక్తులు కూడా వున్నాయి. సమాజంలోని అన్ని వర్గాల ప్రజలకూ సమాన ప్రాతినిధ్యం ఉండేలా ఎజెండాను రూపొందింప చేయగల శక్తి అసంఖ్యాకమైన ప్రజల చేతుల్లోనే వుంది.

స్థూలంగా బడా వ్యాపారవేత్తల, కార్పొరేట్ శక్తుల రాజకీయ పలుకుబడి కలిగిన వారి ప్రయోజనాలను కాపాడడానికై మీడియా ఒకరాజకీయ ఆయుధంగా వినియోగించ బడుతుంది. అది కుల, వర్గ, లింగ వివక్షతోనే వ్యవహరిస్తుంది. కనుక అణచివేతకు గురవుతున్న వర్గాలుగా, మహిళలుగా విస్తార ప్రజానీకానికి చేరువయ్యే విధానాల ద్వారా ఈ సవాళ్ళను ఎదుర్కొని మనం మాస్ మీడియా కంటే శక్తివంతులం అని నిరూపించుకోవాల్సి వుంది.

అనువాదం : కె. నాగలక్ష్మీ

## రాష్ట్రంలో ఐద్వా కృషి

సమాజంలో మహిళల పట్ల హింస, వివక్ష పెరుగుతూ ఉంది. ఐద్వా నిర్వహించిన సర్వేలలో మహిళలపై హింస, నేరాలు పెరగడంలో మీడియా కూడా ప్రధాన పాత్ర పోషిస్తున్నదని వివిధ తరగతుల మహిళలు అభిప్రాయ పడ్డారు. మీడియా కార్యక్రమాలను నియంత్రించాలని ఐద్వా అనేకసార్లు ప్రభుత్వాన్ని డిమాండు చేసింది. ఇటీవల సుప్రీంకోర్టు కూడా మీడియాలో ప్రసారమ వుతున్న విపరీత, వికృత పోకడలకు చెక్ పెట్టాలని కేంద్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది. కుటుంబ సమేతంగా టి.వి కార్యక్రమాలు వీక్షించే పరిస్థితి లేదు. న్యూస్ ఛానళ్ళలో కూడా అశ్లీల కార్యక్రమాలను చొప్పించి ప్రసారం చేయడంతో పరిస్థితి అత్యంత ఇబ్బందికరంగా తయారైంది. కనీసం ఇంట్లో వార్తా పత్రికలు కూడా చదవలేని రీతిలో మహిళల అశ్లీల చిత్రీకరణ ఉంటుంది. ఐద్వా రాష్ట్ర కమిటీ మీడియాలోని అనేక అభ్యంతరకర విషయాలపై జోక్యం చేసుకుని వాటిని మళ్ళించడానికి తొలగించడానికి కృషి చేసి కొన్ని విజయాలు కూడా సాధించింది. ప్రభుత్వం ఎయిడ్స్ నివారణ పేరుతో ఒక ప్రకటన విడుదల చేయదలచుకుంది. పెద్ద పెద్ద హోర్డింగుల ద్వారా ప్రకటన మొదలు పెట్టి “ పులిరాజాకు ఎయిడ్స్ వస్తుందా?” అనే కాప్షన్‌తో పులిరాజాకు ఎయిడ్స్ రావడానికి ఒక మహిళ కారణమని మహిళలను దోషులుగా చిత్రీకరించే ప్రయత్నం చేసింది. వ్యభిచరించే మగవాడిని పులిరాజు అంటూ కీర్తించింది. దానిపై తక్షణం స్పందించిన ఐద్వా అనేక ఆందోళనా కార్యక్రమాలు చేపట్టగా మహిళలను దోషులుగా చిత్రించే ఆ ప్రకటనను ఉపసంహరించుకోవాల్సి వచ్చింది. సమాజంలో ఏ చెడుకైనా మహిళనే దోషిగా చూపే యధాలాప ప్రయత్నాలు జరుగుతున్నాయని దీని ద్వారా తెలుస్తుంది.

కొన్ని సబ్బుల ప్రకటనలు జుగుప్సాకరంగా ఉంటున్నాయి. ఉదా: గతంలో లిరిల్ సబ్బు ప్రకటన చాలా జుగుప్సాకరంగా ఉండేది. దీనిని మార్చవలసిందిగా మహిళల నుండి వేలాది సంతకాలు సేకరించి అడ్వర్టయిజ్‌మెంట్స్ స్టాండర్డ్ కౌన్సిల్ ఆఫ్ ఇండియాకు ఐద్వా లేఖలు వ్రాసిన తరువాత దానిలో కొన్ని మార్పులు జరిగాయి.

సినిమాల విషయంలో గతంలో రామ్‌గోపాల్‌వర్మ తీసిన 'మధ్యాహ్నం హత్య' సినిమా ట్యాగ్‌లైన్ “ మీ భార్య చనిపోతే బాగుండునని మీకెపుడన్నా అనిపించిందా?” అని. ఇలాంటి సినిమాల ద్వారా దర్శక, నిర్మాతలు సమాజానికి ఏమి సందేశమివ్వదల చారని ఐద్వా వారిని నిలదీయడంతోపాటు స్వీయ నియంత్రణ పాటించేలా చూడాలని ప్రభుత్వాన్ని కోరింది. కోర్టులో ప్రజా ప్రయోజనానికి పిల్ వేసింది. కోర్టు ఆదేశంతో ఆ క్యాప్షన్‌ను మార్చుకోవాల్సి వచ్చింది.

### నేరకథనాలు

వివిధ ఛానళ్ళలో ప్రసారమవుతున్న నేరాలు-ఘోరాలు, క్రైంవాచ్, క్రైం రిపోర్ట్ లాంటి ప్రసారాలు పసి మనసులను కూడా కలుషితం చేస్తూ సమాజంలో నేరాలు మరింత పెరగటానికి తోడ్పడుతున్నాయి. ఆ ప్రసారాలు నిలిపివేయాలని వివిధ ఛానళ్ళకు ఐద్వా విజ్ఞప్తి చేసింది. హైద్రాబాద్ నగరంలో వివిధ ఛానళ్ళ ప్రతినిధులను, సినిమా దర్శకులను ఆహ్వానించి పెద్ద ఎత్తున సెమినార్ నిర్వహించగా మీడియా ప్రతినిధులు తమకు రేటింగ్స్ ముఖ్యమని, వీక్షకులు చూస్తున్నారు కనుక అవి ప్రసారం చేస్తున్నామని సమాధానం చెప్పారు. ఐద్వా సమాచార మంత్రిని, హోం మంత్రినీ కలిసి ఛానళ్ళు స్వీయ నియంత్రణ పాటించేలా

**ప్రభుత్వం ఎయిడ్స్ నివారణ పేరుతో ఒక ప్రకటన విడుదల చేయదలచుకుంది. పెద్ద పెద్ద హోర్డింగుల ద్వారా ప్రకటన మొదలు పెట్టి " పులిరాజాకు ఎయిడ్స్ వస్తుందా?" అనే కాప్షన్‌తో పులిరాజాకు ఎయిడ్స్ రావడానికి ఒక మహిళ కారణమని మహిళలను దోషులుగా చిత్రీకరించే ప్రయత్నం చేసింది. వ్యభిచరించే మగవాడిని పులిరాజు అంటూ కీర్తించింది. దానిపై తక్షణం స్పందించిన ఐద్వా అనేక ఆందోళనా కార్యక్రమాలు చేపట్టగా మహిళలను దోషులుగా చిత్రించే ఆ ప్రకటనను ఉపసంహరించుకోవాల్సి వచ్చింది. సమాజంలో ఏ చెడుకైనా మహిళనే దోషిగా చూపే యధాలాప ప్రయత్నాలు జరుగుతున్నాయని దీని ద్వారా తెలుస్తుంది..**

చూడాలని కోరింది. అందుకు ప్రయత్నిస్తామని వారు హామీ ఇచ్చారు. ప్రభుత్వం మీడియా ప్రతినిధులతో కొన్ని సమావేశాలు జరిపింది. కానీ పరిస్థితిలో మార్పురాలేదు.

ఇటీవల వ్యాపార ప్రకటనలు కనీస నైతిక విలువలు కూడా హరించేవిధంగా వుంటున్నాయి. కొన్ని పర్‌ఫ్యూమ్‌లు, స్ప్రేల ప్రకటనలు మహిళల వ్యక్తిత్వాన్ని కించపరిచేవిగా వుంటున్నాయి. ఏక్స్‌ఎఫెక్ట్స్ స్ప్రే చేసుకుంటే విమానాశ్రయంలోని ఉద్యోగిని సైతం సంయమనం కోల్పోయి తనిఖీ మాని సదరు స్ప్రే కొట్టుకున్న మగాడిపై పడిపోతుంది. ఏక్స్ ఎఫెక్ట్ స్ప్రే చేసుకుంటే యువతులంతా ఆకర్షితులై చుట్టుముడతారు. కారులో ప్రేమికుడు వేరే యువతితో అభ్యంతరకరంగా ప్రవర్తించినా ప్రియురాలు సహిస్తుంది. పైగా తనకూ అవకాశమిస్తే చాలంటుంది. వైల్డ్‌స్టోన్ స్ప్రే వాడితే పక్కింటి అమ్మాయి అదుపు తప్పి అబ్బాయి వెంట వెళ్ళిపోతుంది. ఆక్టేన్ పర్‌ఫ్యూమ్ ప్రకటనలో మహిళలకు బట్టలే కరువు. మహిళను అర్ధనగ్నంగా చూపించి పర్‌ఫ్యూమ్ అమ్ముకునే దుస్థితి. " లివ్ ఇన్ జీన్స్" ప్రకటన మహిళలు పురుషుల కోసం ఎంతకైనా తెగిస్తారని చెప్తుంది. పర్‌ఫ్యూమ్‌లు, స్ప్రేలు, జీన్స్ లాంటి చిన్న విషయాలకే మహిళలు తమ వ్యక్తిత్వాన్ని, విలువలనూ వదులుకునే అల్పులుగా ఈ ప్రకటనల్లో చిత్రీకరిస్తున్నారు.

స్ప్రైట్ ప్రకటనలోని క్యాప్షన్ చాలా అభ్యంతరకరంగా ఉందని అనేకమంది మహిళలు అభిప్రాయపడుతున్నారు. " గర్ల్‌ఫ్రెండ్ ముందర వేరే అమ్మాయిని చూడటమెలా?" అనేది క్యాప్షన్. అసలే సమాజంలో నీతి, నిజాయితీలు, నైతిక విలువలు దెబ్బతింటున్న నేటి పరిస్థితులలో ఇటువంటి ప్రకటనలు సమాజాన్ని మరింత భ్రష్టు పట్టించవా?

వార్తా పత్రికలలో కూడా ప్రపంచంలో ఏదో మూల జరిగే అందాల పోటీలలోనో లేక సెలబ్రెటీల ఫోటోలనో అశ్లీలంగా రెచ్చగొట్టే విధంగా వున్నవి ఎంపిక చేసి వాటిని ప్రచురిస్తున్నారు. దీనితో ఇంట్లో వార్తా పత్రికలు చదవటం కూడా ఇబ్బందికరంగా మారుతున్నది. మహిళల అశ్లీల చిత్రీకరణ నిరోధక చట్టం ఉన్నా పరిస్థితులు ఇంత దిగజారుతున్నాయంటే సమాజంలో మార్కెట్, డబ్బు శక్తుల ప్రాబల్యం, పెట్టుబడిదారీ సమాజంలో లాభం తప్ప దేనికీ ప్రాధాన్యం లేదనేది స్పష్టంగా తెలుస్తుంది. కనుక నైతిక విలువలను దిగజార్చి మహిళల వ్యక్తిత్వాన్నీ, ఆత్మస్థైర్యాన్ని దెబ్బతీసే ఇటువంటి ప్రకటనలను తక్షణం ఆపివేయాలని ఎడ్వర్టయిజ్‌మెంట్స్ స్టాండర్డ్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా మరియు వార్తా పత్రిక సంపాదకులకు ఐద్వా లేఖలు వ్రాసింది.

ఈ పరిస్థితులలో మార్పు రావాలన్నా, మీడియాలో ఆరోగ్యకరమైన ప్రసారాలు రావాలన్నా మహిళా లోకం పెద్ద ఎత్తున ఉద్యమించాల్సిన అవసరం ఎంతైనా వుంది.



# పెట్టుబడి

వినయం కూడా ఒక విజయమే
అణకువ కూడా ఒక అఛీవ్‌మెంటే
కోట్లూ మేడలూ కార్లే కాదు
ప్రేమలూ, స్నేహాలూ, పలకరింపులు కూడా
ఓ సంపాదనే
మనం పిల్లలకి నేర్పాలి
ఇంజనీరంటే
ఏ తుఫానులూ కూల్చలేని
జీవితసౌధాలను కట్టేవాడేనని డాక్టరంటే
దూరమవుతున్న మనుషుల్ని
కలిపి కుట్టేవాడేనని
మంచీ మానవత్వాల లెర్నింగ్ కూడా
ఒక ఎర్నింగే
విల్లంబులు పట్టుకుతిరిగేవాడే కాదు
మన మనో కీకారణ్యంలో ఘీంకరించే
మృగాలను వేటాడ్డం కూడా ఓ విప్లవమే
కరెన్సీ సుందరి కల్వపూచూపుల నిల్వలే
కాదు
ఏ కూడలిలో నిల్చున్నాసరే
నాలుగు చల్లని చెలిమి నీడలు
నిన్ను మనసారా ముసురుకోవడం కూడా
బ్యాంకు బ్యాలన్సే
అనురాగంగా ఆప్యాయంగా
నిన్ను తడిమే స్పర్శ కూడా మనీపర్సే
విడిపోతూ విచ్ఛిన్నమైపోతున్న బతుకుల్లోకి
ఒకరికొకరమన్న నమ్మకాన్ని సెలైనెక్కించే
ఆలింగనాలు కూడా ఆమ్‌దనీలే.
ప్లాట్లూ....ఫ్లాట్లూ...రియలెస్టేట్ల అడ్వెంచర్లే
కాదు
నలుగురు కలుసుకోవడం, కలిసి
నవ్వుకోవడం
నవ్వుల్ని పంచుకోవడం కూడా వెంచర్లే
నిరసనలూ, ధర్నాలూ, రాస్తారోకోలే కాదు
నీ ముందు నువ్వే తిష్టవేసి
మనిషితనం కోసం నిన్ను నువ్వే
డిమాండ్ చెయ్యడం కూడా
ఓ ఆందోళనే.....ఓ ఉద్యమమే.
షేర్లూ, సెన్సెక్సులూ, డిపాజిట్లే కాదు
మనిషి మీద మనిషితో
మనిషి పెట్టేది కూడా పెట్టుబడే
రాబడి మానవత్వం

*డా|| ప్రసాదమూర్తి, (నాన్నచెట్టు సౌజన్యంతో)*

# మహా మానవతా వాది మదర్ థెరిస్సా

డాక్టర్ వకుళాభరణం లలిత

అచంచల సేవానిరతే ఒక సామాన్య మహిళ గ్లోబల్ శక్తిగా మారడానికి కారణం. తన ఇంటిముందు వదిలిపెట్టబడిన పసికందును గుండెకు హత్తుకుని ఆ శిశువు బతికి ఉందని తెలిసినప్పుడు థెరిస్సా పొందిన ఆనందం వర్ణించనలవి కాదు సంఘటన. 60 సంవత్సరాలు నిరంతరం అభాగ్యుల, అనాథల సేవలో గడిపి జీవితాన్ని సార్థకం చేసుకున్న వారు ప్రపంచంలోనే అరుదుగా ఉంటారు. గౌతమబుద్ధుడు, స్వామి వివేకానందుడు, గాంధీ మహాత్ముడు త్యాగానికి, మానవతకు మారుపేరుగా నిలిస్తే, అభాగ్యుల, అనాథల ఎవరో చేసిన తొందరబాటుకు ప్రతిఫలంగా జన్మించి, మాతృవాత్సల్యానికి దూరమైన పసికందుల సేవలో తరించిన మహామనీషి మదర్‌థెరిస్సా.

**మదర్‌థెరిస్సా ఒక వ్యక్తికాదు. ఒక శక్తి. మాతృత్వభావన తొణికిసలాడుతున్న అపూర్వమానవి. సేవకు మారుపేరు. సేవనే ఆధ్యాత్మిక ఆహారంగా భావించిన తాత్వికవేత్త. 'నేను మిమ్మల్ని ప్రేమించినట్లు మీరు ఒకరి నొకరు ప్రేమించుకోండి' అని ఆమె ఇచ్చిన సందేశం యావత్ ప్రపంచాన్నే మార్చివేయగల సందేశం.**

మదర్‌థెరిస్సా ఒక మిషనరీ. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ వ్యవస్థాపకురాలు. మత గ్రంథాలు చదివి, జీర్ణించుకున్న పరిజ్ఞానంతో ఎన్నో విశ్వవిద్యాలయాల గౌరవ డాక్టరేట్లను పొందగలిగారు. 1979 డిసెంబరు 10వ తారీఖున ఆమె నార్వే రాజధాని ఓస్లోకి 'నోబెల్ బహుమతి' స్వీకరించడానికి వెళ్ళినప్పుడు మీడియా వారు ఆమెపై కురిపించిన ప్రశంసల జల్లులు నోబెల్ బహుమతి కంటే గొప్పవిగా ఆమె భావించింది. అనాథ మహిళను



ఆదరించినప్పుడు, మరణావస్థలో ఆమె చిరునవ్వుతో మదర్‌థెరిస్సాకు చెప్పిన 'థాంక్యూ' కన్నా ఆమె దృష్టిలో నోబెల్ బహుమతి ఉదాత్తమైందేమీకాదు.

థెరిస్సాను చిన్నప్పుడు ఆగ్నేస్ గోంక్సా అనే పేరుతో పిల్చేవారు. ఏడేళ్ళ వయస్సులో తండ్రి మరణిస్తే, తనకంటే ఆరేళ్ళు పెద్దదైన అక్క మూడేళ్ళు పెద్దవాడైన అన్న, ఆగ్నేస్ బాధ్యతలు తల్లిపై పడ్డాయి. ఎంబ్రాయిడరీ గుడ్డ తయారు చేసి, దాన్ని అమ్మితే వచ్చిన డబ్బుతో ఎంతో పొదుపరిగా జీవిత చక్రాన్ని నడిపింది తల్లి. తనకున్న దాంట్లోనే ఆపదలో ఉన్నవాళ్ళను ఆదుకునేది ఆమె. ఆగ్నేస్‌కు పుస్తకాలంటే ప్రాణం. చర్చి లైబ్రరీలో చదువుకునేది. అక్కతో కలసి సేవా కార్యక్రమాల్లో పాల్గొనేది. జెస్యూట్ సోదరీమణులు కలకత్తాలో పనిచేస్తున్నట్లు తెలుసుకుని, ఐర్లండులో శిక్షణ పొంది, అవివాహితగా వుండి పోవడానికి అదే దృఢమైన నిర్ణయంగా తీసుకుంది. శిక్షణ తర్వాత బొంబాయి చేరుకుని అక్కడి నుండి 1929లో కలకత్తా చేరింది. డార్జిలింగ్‌లో కాన్వెంటులో రెండేళ్ళు పనిచేసి, కలకత్తాలో కాన్వెంటులో ఉపాధ్యాయినిగా చేరింది. 1931లో ఆగ్నేస్ పేరుకు స్వస్తి పలికి సిస్టర్ థెరిస్సా పేరును స్వీకరించింది.

17 సంవత్సరాలు కాన్వెంటులో పనిచేసిన తర్వాత, 1937లో 27 ఏళ్ళ వయస్సులో సిస్టర్ థెరిస్సా మదర్ థెరిస్సా అయింది. మదర్ థెరిస్సా సేవ అపూర్వమైనది. భయంకరమైన వ్యాధులను ఎదుర్కొని ఆమె సేవ చేశారు. తోటి మానవులు కటిక నేలమీద, పేవ్‌మెంట్స్ మీద పడుకోవటం ఆమె భరించలేక పోయింది. ఉన్నవారికి, లేనివారికి మధ్య వున్న వ్యత్యాసాన్ని ఆమె కనిపెట్టి లేనివారిలాగానే మూడే మూడు ముతక

**మదర్‌థెరిస్సా ఒక వ్యక్తికాదు. ఒక శక్తి. మాతృత్వభావన తొణికిసలాడుతున్న అపూర్వమానవి. సేవకు మారుపేరు. సేవనే ఆధ్యాత్మిక ఆహారంగా భావించిన తాత్వికవేత్త. ' నేను మిమ్మల్ని ప్రేమించినట్లు మీరు ఒకరి నొకరు ప్రేమించుకోండి' అని ఆమె ఇచ్చిన సందేశం యావత్ ప్రపంచాన్నే మార్చివేయగల సందేశం. తోటి మానవులు కటిక నేలమీద, పేవ్‌మెంట్స్ మీద పడుకోవటం ఆమె భరించలేక పోయింది. ఉన్నవారికి, లేనివారికి మధ్య వున్న వ్యత్యాసాన్ని ఆమె కనిపెట్టి లేనివారిలాగానే మూడే మూడు ముతక చీరలను వేసుకుంటూ, మితమైన కోరికలతో అతిసాధారణంగా గడిపింది.**

చీరలను వేసుకుంటూ, మితమైన కోరికలతో అతిసాధారణంగా గడిపింది. ఒక బక్కెట్- ఒక సబ్బు- ఎవరికి వాళ్ళు బట్టలు ఉతుక్కోవాలి, బొగ్గుపొయ్యి మీద వంట. పదేళ్ళకొకసారి ఇంటికి వెళ్ళి చూసిరావచ్చు. మదర్ దగ్గర చేరిన సిస్టర్స్ అందరూ క్రమం తప్పక ఈ నియమాలను పాటించితీరాలి.

పది సంవత్సరాలు కలకత్తాకు పరిమితమైన మదర్ సేవలు తర్వాత దేశంలో ఇతర ప్రాంతాలకు, సరిహద్దులు దాటి విదేశాలకు వ్యాపించాయి. నెహ్రూ అనారోగ్యంగా ఉన్నప్పుడే ఢిల్లీలో 'హోం ప్రారంభమయింది. అప్పుడే మదర్‌కు 'పద్మశ్రీ' సత్కారం జరిగింది. 2002 నాటికి భారత్‌లో 217, ప్రపంచంలో 466 కేంద్రాలకు మదర్ సేవలు విస్తరించాయి. అప్పటికే గుండె జబ్బుతో బాధపడుతున్న ఆమె పేస్ మేకర్‌ను వేయించుకుని కూడా సేవను పొడిగించాల్సి వచ్చింది. బాధల్లో వున్న ప్రతి ఒక్కరికీ ఆమె సేవ అందేది. హౌరాలో ' నవజీవన్ ' అనే హోం వికలాంగులకు ఏర్పడింది. కుష్ఠు రోగులకు మొబైల్ డిస్పెన్సరీ, అనాథలకు వియత్నాంలో ఒక కేంద్రం, డ్రగ్స్(మత్తు పదార్థాలు)కు బానిసలైనవారికీ, ఎయిడ్స్ బాధితులకూ లాస్ ఏంజెల్స్‌లో ఒక కేంద్రం, పిల్లలకు కలకత్తాలో 'నిర్మల్ హృదయ్' ఉంది. హోమ్-ఫర్-ది- డైయింగ్ మరణావస్థలో ఉండేవారికోసం. ఎవరైనా మరణాన్ని సుఖంగా పొందగలగాలి. అంటే చిట్టచివరి దశ వరకూ మదర్ సేవలు అందాలి.

ఒక్కోప్పుడు కడుపున పుట్టిన బిడ్డలు సైతం తల్లిదండ్రులకు అటువంటి సేవలందించలేరు.

అనుక్షణం సేవలు చేసే చేతులను రోగులు ముద్దాడుతారంటే, ఆ సిస్టర్స్ చూపే ఆదరణ, ఆప్యాయతలు అనన్య సామాన్యాలు. ప్రపంచంలో ఏ మారుమూల ఉన్న అభాగ్యులైనా వారు పొందే ఆదరణ ఒకే రకంగా ఉంటుంది. శ్రీశ్రీ చెప్పినట్లు "నల్లనివాడో, తెల్లనివాడో, పచ్చనివాడో- మానవుడా ఓ మానవుడా!". మానవత్వంతో నిండిన ఆమె మనస్సునిండా అనాథలే, అభాగ్యులే.

ఎన్నెన్ని అవార్డులు లభించినా 'పద్మశ్రీ' మొదలు భారతరత్న' వరకూ 'మెగసెసె', 'పోప్ జాన్ XXIII శాంతి బహుమతి, అమెరికా వారి గుడ్ సమరిటన్, నోబెల్ బహుమతి, యుయన్‌ఓ యఫ్.ఎ.ఒ పథకం- ఎన్ని వచ్చినా అన్నార్తులను ఆదుకున్న దానివల్ల వచ్చే తృప్తికన్నా తనకు మిన్నకాదు.

**ప్రపంచంలో ఎక్కడ ఎటువంటి అవాంతరాలు ఎదురైనా, ఎలాంటి సమస్యలు ఉత్పన్నమైనా, ఇథియోపియాలో కరువు సంభవించినా, ఇరాక్‌లో అమెరికా చేసిన యుద్ధంలో సర్వం కోల్పోయిన అనాథలకు, అభాగ్యులకు సేవలందేవి. అదే మదర్‌థెరిస్సా శక్తి. ఆమెపడే తపనకు, ఆవేదనకు ప్రతిఫలం.**

అన్నం లేని వారికి కడుపునిండా భోజనం, కుష్ఠు రోగులకు సేవలు, అవివాహిత తల్లులకు పునరావాస కేంద్రాలు, అనాథ బాలుర వసతి గృహాలు ఇవన్నీ నడపడానికి అవార్డుల్లో వచ్చిన డబ్బు, విరాళాలు ఉపయోగించేవారు. మదర్ థెరిస్సాల అవసరం ప్రతి కుటుంబానికీ, మండలానికీ, రాష్ట్రానికీ, జాతీయంగా, అంతర్జాతీయంగా అవసరమే. మదర్‌థెరిస్సా లాంటి వ్యక్తి మరొకరులేరు. ఆమె ఒక ప్రపంచ శక్తి. ప్రపంచానికే జీవం.

ప్రపంచంలో ఎక్కడ ఎటువంటి అవాంతరాలు ఎదురైనా, ఎలాంటి సమస్యలు ఉత్పన్నమైనా, ఇథియోపియాలో కరువు సంభవించినా, ఇరాక్‌లో అమెరికా చేసిన యుద్ధంలో సర్వం కోల్పోయిన అనాథలకు, అభాగ్యులకు సేవలందేవి. అదే మదర్‌థెరిస్సా శక్తి. ఆమెపడే తపనకు, ఆవేదనకు ప్రతిఫలం.

1997 సెప్టెంబర్ 5న థెరిస్సా తనువు చాలించింది. ఆమె అంత్యక్రియల్లో రాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్, సోనియాగాంధీ, పోప్ ప్రతినిధులు, బిల్ క్లింటన్, ఆల్బేనియా దేశాధ్యక్షుడు, ఆబాలగోపాలం పాల్గొన్నారు. **60** సంవత్సరాలు ఆమె సేవా జీవితం అనాథలకీ -అన్నార్తులకీ-మరణావస్థలో ఉన్నవారికి చివరి క్షణం వరకు అంకితం. సేవా భావంతో పని చేసే వారందరికి మదర్ థెరిస్సా ఒక దిక్సూచి. మదర్‌థెరిస్సా సజీవ శక్తి. ఆమె సేవలు అజరామరం.



## సవరణ

క్రిందటి సంచికలో భారత మహిళ నాడు- నేడు అనే వ్యాసంలో మేడమ్ 'కామా' జన్మించినది 1861కి బదులుగా 1961 అని ప్రచురించబడింది. పొరపాటుకు మన్నించండి.

**-ఎడిటర్**

# టాన్యతో ఆత్మీయానుబంధం

## డాక్టర్ రంగారావు జ్ఞాపకాలు

ప్రజావైద్యురాలు మోటూరు టాన్యా అకాల మరణం ప్రజాతంత్ర ఉద్యమాభి మానులను విషాదంలో ముంచింది. ఆమె లేని లోటు తీర్చలేనిదంటూ వివిధ ప్రజాసంఘాల నాయకులు సంతాపం ప్రకటించారు. డాక్టరుగా, ఐద్వా నాయకురాలిగా, మోటూరు ఉదయం ట్రస్టు బాధ్యులుగా ఆమె ప్రజలకు దగ్గరయ్యారు. సామాన్యులకు వైద్యం అందుబాటులో ఉండాలని ఆమె తపించారు. డాక్టర్ బెతూన్ నర్శింగ్‌హోమ్‌లో ఆమె చివరంటా వైద్యసేవలు అందించారు. (టాన్య మృతి పట్ల సిపిఎం అగ్రనేతలు సీతారాం ఏచూరి, వి.శ్రీనివాసరావు, పాటూరి రామయ్య సంతాపం ప్రకటించారు. ఆమె ఆశయాలను ముందుకు తీసుకెళ్ళడమే అసలైన నివాళ్ళని పేర్కొన్నారు. డాక్టర్ టాన్యా సంస్మరణ సభ నేపథ్యంలో ఆమె జీవిత విశేషాలను జీవిత భాగస్వామి డాక్టర్ రంగారావు వివరించారు). జీవితంలో ఆటుపోట్లను అధిగమించి ఎలా ముందుకు సాగారో, వృత్తి పరంగా, ఉద్యమాలలో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకోవడంలో ఆమె పాత్రను వివరించారు, ఆమె భర్త డాక్టర్ నల్లూరి రంగారావు గారు.

### టాన్య పుట్టుక, విద్యాభ్యాసం....

టాన్య 1941 డిసెంబరు 14వ తేదీన గుంటూరులో జన్మించారు. అప్పటికే ఆమె తండ్రి మోటూరు హనుమంతరావు స్వగ్రామం వెల్లటూరు వదిలారు. గుంటూరులో ఉంటూ కమ్యూనిస్టు పార్టీలో పూర్తికాలం కార్యకర్తగా పనిచేస్తున్నారు. కమ్యూనిస్టు పార్టీపై నిర్బంధం ఉన్నందున 1948-52 మధ్య కాలంలో మోటూరు కుటుంబం ఎక్కడా స్థిరనివాసం ఏర్పరచుకునే వీలు కలుగలేదు. మోటూరు హనుమంత రావు జైల్లో ఉన్నారు. టాన్య తల్లి ఉదయం పిల్లలతో ఏలూరులో నివాసం ఏర్పాటు చేసుకున్నారు. టాన్య విద్యాభ్యాసం కూడా ఒకచోట స్థిరంగా సాగలేదు. ఎలిమెంటరీ విద్య మద్రాసులోనూ, స్కూలు విద్య రేపల్లెలోనూ, కాలేజీ విద్య విజయవాడలో సాగాయి. గుంటూరులో మెడిసిన్ చదివారు.



1998 చికాగోలో మనుమరాలు స్మిత మొదటి పుట్టినరోజు సందర్భంగా

### వివాహ బంధం

పార్టీతో నాకు సంబంధాలు ఏర్పడినప్పటి నుంచే ఆ భావాలతో సాగే వధువునే పెళ్ళాడాలని అనుకునేవాడిని. ఆవిధంగా సమీప బంధువైన ఓ వ్యక్తి ద్వారా టాన్యతో వివాహ ప్రస్తావన వచ్చింది. మా వివాహం 1964 సెప్టెంబరులో గుంటూరు నవయుగ హోటల్‌లో జరిగింది. పెళ్ళి ఏర్పాట్లన్నీ గద్దిపాటి కోటేశ్వరరావు చేశారు. వివాహ వేదిక వద్దే రిజిస్టర్ చేసారు. మాకినేని బసవపున్నయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, గుంటూరు మెడికల్ కాలేజీ ప్రిన్సిపల్ పి.వి నరసింహరావు వివాహానికి హాజర య్యారు. 1965లో గుంటూరులో కాపురం పెట్టాం. మెడికల్ కాలేజీ లో ఉద్యోగం వచ్చింది. నెలజీతం రూ॥430లు చౌకరోజులు కాబట్టి ఆ జీతంతోనే కాపురం సాఫీగా సాగింది. 1965 లో కుమారుడు రవి, 1966లో కుమార్తె ఉదయిని పుట్టారు. అనంతరం 1967లో ఒంగోలులో ప్రాక్టీసు మొదలు పెట్టాం. ఏడాదికే ఏర్పడిన ప్రత్యేక పరిస్థితుల్లో ఆసుపత్రిని సహచరుడికి వదిలేసి నెల్లూరు ప్రజావైద్యశాలలో చేరాము. 12 ఏళ్ళ తర్వాత 1981లో తిరిగి ఒంగోలులో ఆసుపత్రిని ఏర్పాటు చేసాం. సామాన్యులకు వైద్యం అందుబాటులో ఉండాలనేది మా లక్ష్యం. అందుకు తగినట్టుగానే సాధారణ రోగులకు ఓపి రూ॥5లు. పేదలకు రెండు రూపాయలే పెట్టాం. చాలా కాలం ఇదే ఫీజులతో ఆసుపత్రి నడిపాం.

### బెతూన్ పేరు ఎందుకు?!

చైనా అంతర్యుద్ధంలో సేవలందించిన కెనడా సర్జన్ నార్మన్ బెతూన్ గురించి మావో ఓ పుస్తకంలో రాశారు. దాన్ని ఓ సందర్భంలో చదివాను. 'ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగి మన సైనికులకు సేవ చేశారు. శ్రామిక వర్గ అంతర్జాతీయతకు ఇంతకన్నా ఉదాహరణ ఏముందని' అని మావో బెతూన్ చనిపోయినపుడు చెప్పిన మాటలు మాలో స్ఫూర్తినింపాయి. అందుకే వైద్యశాలకు బెతూన్

పేరుపెట్టాము. ఆయన చైనా, స్పానిష్ ప్రజాపోరాటాల్లో సేవలందించారు. అంతే కాకుండా విరాళాలు కూడా సేకరించి సైనికులకు సహాయంగా పంపారు.

**బంగారం కొనలేదు!**

ఏనాడూ మేం బంగారం కొనలేదు. బంధువుల అబ్బాయి ఒకడు సైకిల్ కావాలని అడిగితే టాన్య తనవద్ద ఉన్న బంగారు గాజులు అమ్మికొనిచ్చింది. కమ్మలు ఉంటే వాటిని రూ॥1200కు అమ్మేశాం. ఇంకొంత అప్పుచేశాం. ఆ సొమ్మును కలిపి నెల్లూరులో స్థలం కొన్నాం. పెళ్ళయిన కొత్తల్లో మా పెద్దలు తాళిబొట్టు వేశారు. తర్వాత దాన్ని కూడా అవసరం లేదని తీసేశాం.

**ఇంటికి ఎవరొచ్చిన సాదర ఆహ్వానం**

ఇంటికి ఎవరొచ్చినా టాన్య సాదరంగా ఆహ్వానిస్తుంది. చిరునవ్వుతో పలకరిస్తుంది. చదువు కోసం బంధువుల పిల్లలు ఎవరో ఒకరు నిత్యం ఇంట్లో ఉండేవారు. మొదట్లో టాన్య సోదరి ఉష ఉండేది. మా సోదరి, మేనకోడలు కొంతకాలం ఉన్నారు. డాక్టర్ సుధాకర్, సి.హెచ్ కె.వి ప్రసాద్ కొంతకాలం ఉన్నారు. అందరికీ విడిది గృహంలా ఉండేది మా ఇల్లు . ఎవరున్నా అసౌకర్యంగా ఏనాడూ భావించలేదు. అందరితో కలిసిపోయాం. ఆప్యాయంగా గడిపాం.

**పొదుపుగా జీవించాం**

1968లో.... నెల్లూరులో ఉన్నప్పుడు ఇద్దరి జీతం కేవలం రూ॥1,250లే! పార్టీ లెవీ కింద రూ॥125 ఇచ్చేవాళ్ళం. పార్టీ కమిటీకి వందరూపాయలు, ఉష చదువులకు వంద, నా చెల్లెలు చదువులకు మరో వంద, మోటూరు హనుమంతరావు స్నేహితుడి కుమార్తె చదువుల కోసం రూ॥40లు చౌకరోజులు కాబట్టి నాలుగు వందలతోనే కాపురం సాఫీగా సాగేది. ఇంకా వంద రూపాయలు మిగిలేవి. మిగులులో సగం పార్టీకి ఇవ్వాలనే ఆలోచన ఉండేది.

**ఎక్స్‌రే మిషను అమ్మి ప్రజాశక్తికి విరాళం**

ప్రారంభంలో పెట్టిన ఆసుపత్రిలో చీలిన తర్వాత నా వాటా కింద ఏడువేలు రావాలి. ఎక్స్‌రే మిషన్ను రూ॥5వేల కింద జమకట్టి తీసుకున్నా. దాన్ని మరమ్మత్తులు చేయించి మరో మిత్రుడికి ఆరువేల రూపాయలకే అమ్మాం. ఆ ఆరువేలను ఆనాటి ప్రజాశక్తి వార పత్రికకు విరాళంగా ఇచ్చాం. డాక్టర్ బెతూన్ నర్సింగ్‌హోమ్ పెట్టాక ఎక్స్‌రే వాళ్ళనుంచి వచ్చే ఐదు రూపాయలను సొంత అవసరాలకు వాడుకోలేదు. ఈ సొమ్మును కొంతకాలానికి లెక్క కట్టి రూ॥30 వేలు పార్టీ ఆఫీసు నిర్మాణానికి విరాళంగా ఇచ్చాం.

**మూడు రకాల బాధ్యతల్లోనూ టాన్య విజయం**

టాన్య మూడు రకాల పనులు చేసేవారు. కుటుంబం, డాక్టరు బాధ్యతలు, పార్టీ కార్యకలాపాలు.... ఈ మూడు పనులను సమన్వయంతో ముందుకు సాగారు. ఉదయిని కుమార్తెకు ఏడేళ్ళు వచ్చేదాకా మేమే పెంచాల్సి వచ్చింది. ఆ సమయంలో మహిళా సంఘానికి సమయం కేటాయించడం ఆమెకు ఇబ్బంది అయింది. తల్లి ఉదయం చని పోయాక మహిళా సంఘం తరపున ట్రస్టు పెట్టాలనే ఆలోచన వచ్చింది. ఆ పనిలో టాన్య చురుగ్గా పాల్గొన్నారు, డాక్టర్లు, మిత్రులు, బంధువుల నుంచి విరాళాలు సేకరించి ఇచ్చారు. టాన్య అడగ్గానే అమెరికాలో ఉండే సాఫ్ట్‌వేర్ ఉద్యోగి సురేంద్రబాబు ఎనిమిది వేల డాలర్లు ఇచ్చారు. ట్రస్టుకు విరాళాలు సేకరించి ఇవ్వడంలో కీలకపాత్ర వహించారు. ట్రస్టు తరుపున ఒంగోలులో న్యాయసలహా కేంద్రం పెట్టారు. వైద్య శిబిరాలలోనూ కీలకపాత్ర వహించారు.

**జీవితంలో బాధపడ్డ రోజు**

ఎంతో సన్నిహితంగా ఉండే మిత్రుడితో కలిసి పెట్టిన ఆసుపత్రి ఏడాదికే చీలిపోవడం బాధ కలిగించింది. స్నేహితులుగా పెట్టి ఇలా ఎందుకు జరిగిందని చాలాకాలం ఆలోచించాను. తర్వాత సర్దుబాటు అయ్యాను. ఇది మినహా జీవితంలో ఏనాడూ పెద్దగా ఒడిదుడుకులు రాలేదు. చిన్నచిన్నవి మినహాయిస్తే జీవితం సాఫీగా సాగింది.

**సంతృప్తి**

టాన్య మృతి మా కుటుంబానికి తీరని లోటు, అయినా ఆమె సంపూర్ణమైన, ప్రజోపయోగమైన జీవితం గడిపిందనే సంతృప్తి నాకుంది.



**జోహార్లు టాన్యా! జోహార్లు!!**

టాన్యా ! ఓ టాన్యా!!
నీ పేరులోనే ఉంది అంతర్జాతీయ భావం,
విశాల దృక్పథం.
మోటూరు దంపతుల ముద్దు బిడ్డవి,
రెండో ప్రపంచ యుద్ధంలో
నాజీల పీచమణచిన టాన్యా
ధైర్య సాహసాలకు మారుపేరు!
ఎంతో ఉత్తేజంతో ఆనాటి టాన్యా పేరే
నీ పేరుగా పెట్టుకున్నారు
ఆవయాలకంకితమైన నీ తల్లితండ్రులు
వాళ్ళ ఆశయాలను వమ్ము చేయకుండ
సమ సమాజ స్థాపనకై నీవు పోరాడింది
తక్కువేమీ కాదు
ప్రజాసేవలో వుండి వైద్య సేవలందిస్తూ
ప్రజలందరికి తలలో నాలుకవయ్యావు
నీవు లేనిదే మోటూరు ఉదయం భవనమే
లేదు
పీడిత జనానికి సేవలందిస్తున్న ఐద్వాకు
కానుకగా ఇచ్చావు
నీ ఒళ్ళంతా శస్త్ర చికిత్సలతో గాయాలే
అయినా వీడని నిబ్బరం ,
ఆగని చిరున్వు నీ స్వంతం
మోటూరు ఉదయం ట్రస్టుకు సారధ్యం
వహిస్తూ
ఇంకా నీవు చేయవలసిన పనులెన్నో
వున్నాయి
అంతలోగా పిడుగులాంటి వార్త
క్యాన్సర్ మహమ్మారి నిన్ను
కబళించడానికి సిద్ధమైందని
నీవులేని లోటు ఎవరు పూడ్చలేనిది
నీ వ్యక్తిత్వం అలాంటిది
పీడిత జనానికి నీ సేవలెంతో
అవసరమున్న
అంతలోనే నీవు అదృశ్యమయ్యావు
ఎలా నిన్ను మరచిపోవాలమ్మా
నీవు చిరస్మరణీయురాలివి తల్లీ
నీకివే మా జోహార్లు

- ఎన్.ఎస్. లక్ష్మీ దేవమ్మ

మనం చిన్నప్పటి రోజుల నుండి నువ్వులు ఆహారంలో ఒక భాగంగా వాడటం ఆనవాయితీ. నువ్వులు, బెల్లంతో చేసిన ఉండలు, నువ్వుల నూనె, నువ్వుల పిండి ఇత్యాది రూపాల్లో మనం నువ్వులు ఆహారంగా, ఉపాహారంగా తీసుకుంటాము.

మన దేశంలో నువ్వుల వినియోగం వేదకాలం నుంచి ఉన్నది. నూనె గింజలలో ఇవి శ్రేష్ఠమైనవి. ఇవి మూడు రకాలు. తెల్ల నువ్వులు, నల్ల నువ్వులు, ఎర్ర నువ్వులు. తెల్ల నువ్వులను ఆహారపదార్థాలలో ఎక్కువగా ఉపయోగిస్తారు. అలాగే మనం వంటకు ఉపయోగించే నువ్వుల నూనె కూడా తెల్ల నువ్వుల నుంచే వస్తుంది. నల్ల నువ్వుల నుంచి తీసే నూనెను ఎక్కువగా ఆయుర్వేద ఔషధాలలో ఉపయోగిస్తారు. నువ్వుల శాస్త్రీయ నామం (Sesamum indicum) ఆంగ్లంలో Gingelly అంటారు. ఇవి ఆఫ్రికానుంచి ఇతర దేశాలకు వచ్చాయి. ప్రస్తుతం భారతదేశం, చైనా, కొరియా వంటి దేశాలలో పండిస్తున్నారు.

**పోషక విలువలు:** ఒక కప్పు-(సుమారు 144 గ్రాములు) నువ్వుల నుంచి 825 కేలరీల శక్తి వస్తుంది. ఇందులో 72 గ్రాముల కొవ్వు పదార్థాలు, సున్నా శాతం కొలెస్టరాల్ ఉంటాయి. కార్బోహైడ్రేట్స్ 34 గ్రాములు, పీచు పదార్థం 68 శాతం ఉంటుంది. ప్రొటీన్స్ 26 గ్రా. కాల్షియం 140 శాతం, ఐరన్ 116 శాతం ఉంటుంది. ఇంకా ఇందులో మెగ్నీషియం, ఫాస్ఫరస్ మొదలైనవి కూడా ఉంటాయి. కాపర్, మాంగనీస్‌లు ఇందులో పుష్కలంగా లభిస్తాయి. సోడియం చాలా తక్కువగా ఉంటుంది. వీటిలో 50 శాతం అన్‌శాచురేటెడ్ కొవ్వు పదార్థాలు వుంటాయి. థయామిన్, నియాసిన్, బి6 విటమిన్స్ ఉంటాయి. ఇంకా జింక్, సెలీనియం, పొటాషియం కూడా ఉంటాయి.

**మూడు రకాల నువ్వులలో నల్ల నువ్వుల నుంచి తీసిన నూనె శ్రేష్ఠమైనది ఔషధాలకు ఉపయుక్తం కూడా. తెల్ల నువ్వులు కాల్షియం తక్కువ ఉన్నవారు వాడవచ్చు. ముఖ్యంగా మెనోపాజ్ (Menopause)వచ్చిన స్త్రీలు, ఎదిగే పిల్లలు వీటిని వాడవచ్చును, ఎర్ర నువ్వులలో ఐరన్ (ఇనుము లోహం) ఎక్కువగా ఉంటుంది. ఇందులో సహజమైన యాంటీ ఆక్సిడెంట్లు కూడా ఉన్నాయి.**

నూనె గింజలలో నువ్వుల నుంచి తీసిన నూనెను అత్యుత్తమైనదని ఆయుర్వేదం లో చెప్పారు. ఆధునిక శాస్త్రం ప్రకారం కూడానిది ఆరోగ్యానికి మంచిదని నిరూపిత మయ్యింది. ఇది మంచి వాసన కలిగి అధికమైన బాయిలింగ్ పాయింటు కలిగి ఉండటం వలన దీనిని ఆరోగ్యకరమైన వంట నూనెగా వాడు కోవచ్చు.



# నువ్వుల్లో నూరు గుణాలు

✍ కె. భారతి

ఈ నూనెను వేడి చేసినప్పుడు ఇందులో అణువుల పునఃపరివర్తన తక్కువగా ఉండటం వలన ఆరోగ్యరీత్యా ఇది మంచిది. కాన్సర్ కారకం కాదు.

**చికిత్సలో నువ్వుల ఉపయోగాలు**

స్త్రీలలో వచ్చే Oligomenorrhoea (క్రమరహితంగా, ఎక్కువ రోజుల తరువాత రుతుస్రావం అవటం), Scanty menstuation (తక్కువ రుతుస్రావం) మొదలగు సమస్యల్లో నల్ల నువ్వులు ఉపయోగపడతాయి. అలాగే రుతుస్రావ సమయంలో వచ్చే కడుపునొప్పి నివారణకు కూడా ఉపయోగపడుతాయి. నెలసరి ఆగిపోయిన (మెనోపాజ్ వచ్చిన ) స్త్రీలలో కాల్షియం కొరకు వీటిని వాడవచ్చు.

గర్భం ధరించిన మొదటి మాసంలో నువ్వులను తినకూడదు, ఇది గర్భాశయ కండరాలను సంకోచింపచేస్తుంది కనుక గర్భస్రావం అయ్యే అవకాశం ఉంటుంది.

**బుతుశూల:** (Dysmenorrhoea) బాలికలలో, స్త్రీలలో నెలసరి సమయంలో వచ్చే కడుపునొప్పికి అర టీస్పూన్ నువ్వుల పొడిని వేడి నీళ్ళతో తీసుకుంటే నొప్పి తగ్గుతుంది.

**నెలసరి సమయంలో రక్తస్రావం సరిగా కానివాళ్ళు నెలసరి రావటానికి ఐదు రోజుల ముందు నుంచి నల్ల నువ్వులు ఒక చెంచా బెల్లంతో దంచి తీసుకుంటే రక్తస్రావం సాధారణం అవుతుంది.**

నువ్వుల మొక్క ఆకులను దంచి తలకు రాసుకుంటే చుండ్రు పోతుంది. ఈ ఆకుల కషాయంతో తలస్నానం చేస్తే వెంట్రుకలు త్వరగా తెల్లబడవు. నువ్వులనూనెని తలకి రాసుకోవటం వలన కూడా వెంట్రుకలు త్వరగా తెల్లబడవు.

**రక్తహీనత:** (Anemia) రక్తహీనత ఉన్నవాళ్ళు నల్ల నువ్వులను వేడినీళ్లలో రెండు గంటలు నానబెట్టి, దంచి, వడగట్టి తీసిన రసాన్ని పాలు, బెల్లం కలిపి త్రాగాలి.

ప్రసవం తరువాత బాలింతలలో

చనుబాలు ఎక్కువవటానికి ఇది తోడ్పడుతుంది. (Galactogauge) కీళ్ళనొప్పి, నడుమునొప్పి, పక్షవాతం వంటి వాత సంబంధ వ్యాధులకు నువ్వులనూనెలో వావిలి ఆకులు, శొంఠి, కర్పూరం, వెల్లుల్లి వేసి కాచి మర్దన చేయడానికి ఉపయోగించవచ్చును.

క్లినికల్ ట్రయల్స్‌లో కొలెస్ట్రాల్ ఎక్కువ ఉన్నవాళ్ళలో కొలెస్ట్రాల్‌ని తగ్గించటానికి ఇది ఉపయోగకరమని నిరూపించబడినది. నువ్వులలో అధికంగా ఉన్న పాలీ అన్ శాచురేటెడ్ కొవ్వుల వలన మరియు లినలెయిక్ ఆమ్లం వలన ఇది కొలెస్టరాల్‌ని, LDL ( చెడు కొలెస్టరాల్) ని తగ్గిస్తుంది.

నువ్వులతో కూడిన ఆహారాన్ని తీసుకోవటం వలన అధిక రక్తపోటు రాకుండా నివారించవచ్చని ఔషధ ప్రయోగాలలో తేలింది. అధిక రక్తపోటు నివారణలో నువ్వుల నూనెలోని సెసామిన్ అనే లిగ్నాన్ ఉపయోగపడుతుందని కనుగొన్నారు. రక్తంలో గామా టోకోఫెరాల్ శాతం పెంచటం ద్వారా ఇది కాన్సర్, హృదయ సంబంధ వ్యాధులను నిరోధిస్తుందని కనుగొన్నారు. ఇందులో ఉన్న పీచు పదార్థం వలన ఇది మధుమేహ రోగులలో రక్తంలోని గ్లూకోజ్ శాతాన్ని తగ్గించటంలో ఉపయుక్తంగా ఉంటుంది. పొడిబారిన చర్మం ఉన్నవారికి కూడా ఇవి ఉపయుక్తం. పూర్వ కాలంలో నిత్యం నువ్వుల నూనెతో అభ్యంగన స్నానం చేసుకునే అలవాటు ఉండేది. ఈ కాలంలో కూడా ఈ అలవాటుని కొనసాగించటం వలన చర్మ సంబంధమైన సమస్యల నుంచి తప్పించుకోవచ్చు.

మరి ఇన్ని రకాల సుగుణాలున్న నువ్వులను నిత్యం మన ఆహారంలో ఉపయోగిస్తే ఆరోగ్యం మన సొంతమవుతుంది కదా!...

## కన్న కడుపుకు ఆంక్షలా?

కన్యాశుల్కం పోయింది
వరకట్నం వచ్చేసింది
ఇపుడు వర'కట్నం'పోతోందిట!
మళ్ళీ కన్యాశుల్కం వచ్చేస్తోందిట!!
దేశ జనాభాలో ఆడపిల్లల శాతం
తగ్గిపోతూ వుందికదా
గుసగుసలు.....లుకలుకలూ....!
ఎంత దౌర్భాగ్యం??

భరత ఖండంలో-ఆడపిల్ల పుటకని
కన్యాశుల్కాలు, వరకట్నాలు శాసిస్తాయా?
ఇదేనా తరతరాల సంస్కృతి?
ఈ దురాచారాలకు లేదెందుకు నిష్కృతి?

కట్నం ఇచ్చుకోలేమని
ఆడపిల్ల చదువుకి మధ్యలో
గండికొట్టిన వీళ్ళు
ఆడపిండాన్ని కడుపులోనే
చంపేసుకునే మూర్ఖులు వీళ్ళు
కన్యాశుల్కానికి ఆశపడి
ఆడపిల్లల జనాభాని ఎలా పెంచుతారు?

అడవిలో మృగాలకి లేదు ఆడామగా
కొమ్మమీద కోతి జాతులకూ లేదు తేడా
గూటిలోని గువ్వలకూ లేదు
తమతమ పిల్లల పట్ల భేద భావం?

పిండదశలోనే-
గట్టిగా పిడికిళ్ళు మూసుకుని
"కన్యాశుల్కం, వరకట్నం లేకుండా
ఆడా మగా వివక్ష లేకుండా
ఆడపిల్లని ఆడపిల్లగానే గుర్తించి,
గౌరవించే రోజు
వచ్చాక చెప్పమ్మా!
అపుడు నే బయటికి వస్తానేనంటూ "ఉంటే"-
అమ్మగా నేనేం చెప్పగలను!
ఏమని భరోసా ఇవ్వగలను?
గుడ్డులో పిండం ఆడోమగో
బయటికి వస్తేకానీ తెలియదు
కడుపులోని పిండాన్ని మాత్రం
" ఆడ" అని నిర్ధారించి మరీ
చరమగీతం పాడుతున్నారు
ఆడపిల్లని కనకూడదని
కన్నతల్లికే ఆంక్షలు విధిస్తున్నారు!
కన్న కడుపుకే గుండె కోతలు వేస్తున్నారు!?

- దుర్గా ప్రసన్న

## హైకూలు

హృదయం ఎక్కడో
జారిపోయింది
దానికి దగ్గరగా ఉండే
జేబు నిండుకుందని
అది తెలుసుకుంది

❖ ❖ ❖

పంటకు సెలవంట
రైతన్నల
కడుపు మంటంట
తాతలు తాగిన నేతులు
పాలకుల నీతులు
అన్నపూర్ణ అలిగితే
అబద్ధాలతో బుజ్జగింపులా.....!

❖ ❖ ❖

అవినీతి పెరిగింది
అడ్డులేక ఎదిగింది
కొమ్మలను నరికితే లాభమేమి
తల్లి వేర్లను పెకలించాలి
అందుకు వ్యవస్థనే మార్చాలి

- విశ్వ శ్రీ

# కళ పేరిట కరాళనృత్యం

✍ కె. అరుణ

ఆర్భాటంగా ముస్తాబైన సెట్టింగ్. అంతా నిశ్శబ్దం. అంతలో తళుకు బెళుకుల యాంకర్ అక్కడికి అడుగుపెట్టింది. సామాన్యంగా కాదు, ఏదో భీకరమైన మ్యూజిక్‌కు బెల్లీ నృత్యం చేసుకుంటూ! ఉన్నట్లుండి మ్యూజిక్, దాంతోపాటు డాన్సూ ఆగింది. మైకు చేత్తో పట్టుకుని, గొంతు సవరించుకుని మాట్లాడటం ప్రారంభించింది యాంకరమ్మ. ఇదెంత గొప్ప కార్యక్రమమో, ఈ నృత్య పోటీల వల్ల బాలబాలికల్లో, యువతలో అంతర్లీనంగా కుళ్ళిపోతున్న కళను ఎలా బైటికి లాగి,పీకి, పాకానపెడు తున్నామో తెలుగును తూట్లు పొడుస్తూ, మెలికలు తిరుగుతూ వల్లెవేసింది. తరువాత న్యాయ మూర్తులను స్టేజీపైకి ఆహ్వానిస్తున్నా నంటూ వేషాల్లేక ఖాళీగా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్న వర్ధమాన తారామణిని, ఛాన్సుల్లేని ఓ నృత్య దర్శకు రాలిని, ముక్కూ మొహం తెలీని నృత్య దర్శకుడిని వేదికమీదకు ఆహ్వానిం చింది. వారూ యాంకరమ్మకు ఏమాత్రం తీసిపోలేదు. అవనరాన్ని మించిన వేకవ్వు, రకరకాల విన్యాసాలు, పోజులతో కుప్పి గంతులేసు కుంటూ వచ్చి వారి వారి ఆసనాల్లో కొలువుతీరారు.

ఇక మొదలైంది హింసాపర్వం. తనకు వేసిన దుస్తులు ఎంత ఎబ్బెట్టుగా ఉన్నాయో తెలియని పసిది, తాను నృత్యం చేస్తున్న పాటకు అర్థం తెలియని చిన్నారి స్టేజిపైకి వచ్చింది. రావడంతోనే ఓ ఫ్లైయింగ్ కిస్ ఆడియన్స్‌వైపు విసిరింది. మ్యూజిక్ స్టార్ట్! అంతే వాయువేగంతో ఆ పాప 'నాట్యం' మొదలు! ఎవరూ ఊహించని హావభావాలతో, ఒళ్ళు విరుచుకునే భంగిమలతో ఆ పాప తన ప్రదర్శనను రక్తికట్టించింది. వేదికకు ఎదురుగా ప్రేక్షకుల్లో ఉన్న ఆ పిల్ల తల్లితండ్రులు మైమరచిపోతున్నారు. ఉద్వేగాన్ని తట్టుకోలేక తల్లక్రిందులైపోతున్నారు. కెమెరా వారిలో వస్తున్న మార్పుల్ని గమనించింది. వెంటనే ఆ సన్నివేశాన్ని బంధించి తమ కార్యక్రమం రేటింగ్స్ పెంచుకోవచ్చని టీమ్ సంబరపడింది. కెమెరా తమవైపు తిరగటం గమనించిన ఆ దంపతులు మరింత రెచ్చిపోయారు. మైకు చేతికి రాగానే పూనకంతో ఊగిపోయారు. పూర్వజన్మ సుకృతం ఉండబట్టే ఇక్కడ తమ గారాలపట్టికి కళాప్రావీణ్యాన్ని ప్రదర్శించే సదవకాశం దక్కిందన్నారు. ఇందుకోసం ఇంట్లో తామెంతో



కష్టపడి ప్రాక్టీస్ చేయించామంటూ డబ్బా కొట్టుకున్నారు. పక్కనున్న ప్రేక్షకులు వారివంక అయోమయంగా చూస్తున్నారు. వీళ్ళ ఫీలింగ్స్ నిజమైనవేనా అని ఒకింత అనుమానంగా చూస్తున్నా వారికిదేమీ పట్టలేదు.

సన్నివేశం ఇంత రసవత్తరంగా ఉన్నా జడ్జీలు మాత్రం యమ గంభీరంగా ఉన్నారు. పిడుగులు కురిపించే శక్తి తమలోనే ఉందన్నంత సీరియస్‌గా ముఖాలు పెట్టారు. యాంకరమ్మ జడ్జీలవైపు తిరిగింది. ఈ పాలుకారే పసిపిల్ల చేసిన ముదురు డాన్సు ఎలా ఉందని అడిగింది. దానికోనమే ఎదురుచూస్తున్న వర్ధమాన తార పాపవైపు చూస్తూ "ఓకే! కాని ఫలానా భంగిమలో నడుం ఇంకాస్త ఊపాలి. లేకుంటే పర్‌ఫెక్షన్ ఉండదు. తొందరలోనే ఎలిమినేట్ అయిపోతావ్...." చేతులు తిప్పుకుంటూ అంది. చిన్నదాని ముఖం చిన్నబోయింది. "సారీఅక్కా! ఈ సారి జాగ్రత్తగా ఉంటాను" అంది కళ్ళల్లో నీళ్ళు తిరుగుతుండగా మహా దీనంగా. అంతలోనే మరో జడ్జి అందుకుంది. తారకామణి వంక చూనన్తూ, "తప్పుగా మాట్లాడుతున్నావ్. ఇంతకన్నా సెక్సీగా చేయటం మరొకరి వల్ల అవుతుందా? బేబీ చాలా గొప్పగా చేసింది. సిల్క్‌స్మిత, అనూరాధలను మించిపోతుంది" అంది ఆవేశంగా. వింటున్న తల్లి తండ్రులు పట్టరాని ఆనందంతో వెర్రి కేకలు వేశారు. ఒకడుగు ముందుకేసి డాన్సులు చేశారు. ఇక డాన్స్ మాస్టరైతే పిల్లను ఎత్తుకుని గిరగిరా తిప్పేశాడు. ఇక ఇప్పుడు డాన్స్ డైరక్టర్ వంతు! ముందు చాలా సీరియస్‌గా చూసిన అతగాడు డింగుమని నిలబడి చప్పట్లు కొట్టాడు. 'ఈ పాప కాబోయే ఐటమ్ సాంగ్ డాన్సర్' అంటూ ప్రకటించేశాడు. విన్న తల్లి తండ్రులు తన్మయత్వంలో మునిగితేలారు. "ఈ ప్రశంన చాలు...మరే ప్రైజులూ వద్దే వద్దు" అంటూ టపాటపా ఆనందబాష్పాలు రాల్చారు. ఈ విధంగా ఈ కార్యక్రమం దిగ్విజయంగా సా.....గి పోయింది. వచ్చే వారం "జంబల కిడి పంబ" రౌండ్ అంటూ ప్రత్యేకంగా ప్రకటించారు. అంటే తెలుసుగా!

ఇదంతా చదవటానికి ఎబ్బెట్టుగా ఉంది కదూ! మరేం చేద్దాం. ఇవేగా దాదాపు అన్ని ఛానళ్ళలో రాజ్యమేలుతున్న ప్రోగ్రామ్స్! పైగా మామూలుగా కాదు.... టాప్ రేటింగ్స్ ఉన్న ప్రోగ్రామ్స్..... అంటే అత్యంత ప్రేక్షకాదరణ పొందుతున్న కార్యక్రమాలు అనేగా!

లోకం తెలియని అమాయకపు కన్నులు కైపులు కురిపిస్తున్నాయంటే.... భూమికి జానెడు లేని అమ్మాయి జానాబెత్తెడు గుడ్డముక్కలు వేలాడేసుకుని బొడ్డు చూపుతూ చుట్లు తిరుగుతుందంటే.....ఎబిసిడిలు రాని పిల్లవాడు కన్నుకొట్టి రమ్మంటున్నాడంటే...... ఈ తప్పు వాళ్ళదా, మనదా? నృత్యం అంటే ఇదా? నాట్యపోటీలు అంటే ఇవా? ఎదిగే పిల్లలకు మనం నేర్పే విలువలు ఇవా? అసలు నాట్యం చేసిన బాలికను బైట వ్యక్తులు ఏ దృష్టితో చూస్తారు? ఆ కేబరే డాన్సును చూసిన తరువాత ఎవరైనా ఈ పాపలో యవ్వనపు ఒంపుల్ని వెతుక్కుంటారు తప్ప సాధారణ బాలిక అని వదిలేస్తారా? ముద్దాడే నెపంతో ఆ పాపతో మానసిక వ్యభిచారం జరపరా? అన్నెం పున్నెం తెలియని పసిపాపలపై అత్యాచారాలు జరగటానికి ఇదీ ఒక కారణం కాదా? కారణాలను విస్మరించి, జాగ్రత్తలను ఆదమరచి సమాజం కుళ్ళిపోతుందని తిట్టిపోస్తే సరిపోతుందా?

రేటింగ్స్ కోసం ఛానళ్ళు విలువలను మర్చిపోతున్నాయి. విజ్ఞాన దాయకంగా ఉండాల్సిన మాధ్యమం దిగజారుడుగా వ్యవహరిస్తోంది. స్వలాభం, కాసులకు అమ్ముడుపోవడం తప్ప మరేమీ పట్టని ప్రభుత్వమూ, పాలకులు, సెన్సారు బోర్డులూ సరే, నిమ్మకు నీరెత్తినట్లు ఉండటం వారికి అలవాటైపోయింది. మరి వివేచన, విచక్షణ ఉన్న మన సంగతేంటి?

హేయంగా, వికృతంగా, ఎబ్బెట్టుగా ఉంటున్నాయంటూనే 'చెత్త' చూడటం కాదు. మనం చేయాల్సింది నట్టింట్లో కరాళనృత్యాన్ని ఆపడం! వెర్రితలలు వేస్తున్న వెగటు కార్యక్రమాలకు శాశ్వత వీడుకోలు పలకడం! కేవలం ఆ ప్రోగ్రాములు చూడటం మానేస్తే కుదరదు. కలిసికట్టుగా కార్యక్రమాలను అడ్డుకోవాలి. ఛానళ్ళనూ, ప్రభుత్వాన్ని ఢీకొనాలి. ఎంతగానంటే..... పాలకవర్గమే చర్యలు తీసుకుని ఈ వెర్రిని నియంత్రించేలా! టిఆర్‌పి రేటింగ్స్ కోసం రెచ్చిపోయిన ఛానళ్ళు తోకముడిచేలా! తల్చుకుంటే "మహిళా శక్తి"కి ఇదేమంత కష్టసాధ్యమని?!



## బాధితులకు చేయూత మోటూరు ఉదయం ట్రస్ట్

ప్రపంచీకరణ నేపథ్యంలో మైక్రో కుటుంబాల సంఖ్య పెరిగింది. అనివార్యంగా ఆలుమగలు పనిచేయందే నాలుగువేళ్ళూ నోట్లోకి పోయే పరిస్థితి లేదు. పాలకుల విధానాల పుణ్యమాని రకరకాల ఒత్తిళ్ళల్లోకి ప్రజలు నెట్టబడుతున్నారు. చిన్న చిన్న కారణాలతో కుటుంబాలు విచ్ఛిన్నమవుతున్నాయి. దీంతో కౌన్సిలింగ్ పేరుతో డబ్బులు గుంజే వివిధ సంఘాలు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చాయి. వీటికి భిన్నంగా మోటూరు ఉదయం ట్రస్ట్ పేరుతో ఐద్వా రాష్ట్ర వ్యాపితంగా కౌన్సిలింగ్ సెంటర్‌లు ఏర్పాటు చేసింది. బాధిత కుటుంబాలకు చేయూతనిచ్చే దిశగా తన నడకను సాగిస్తోంది. ఈ కౌన్సిలింగ్ సెంటర్‌లకు వివిధ తరగతులకు చెందిన మహిళలతోపాటు ఎన్‌ఆర్‌ఐ మహిళల కేసులు కూడా వస్తున్నాయని కౌన్సిలింగ్ నిర్వాహకురాలు డి. ఇందిర (హైదరాబాద్) బి.శ్రీదేవి, భద్రావతి (ఖమ్మం) వి. శైలజ(ప॥గో॥జిల్లా) కె.పద్మ (గుంటూరు) ఆర్.లక్ష్మి, (చిత్తూరు జిల్లా) ఐద్వా మాజీ కార్యదర్శి, కె.సుబ్బరావమ్మ (ప్రకాశం) పలు విషయాలు తెలిపారు.

వారి మాటల్లోనే......ఉమ్మడి కుటుంబ వ్యవస్థలో చిన్న చిన్న కలహాలు వచ్చినా సర్దుకుపోయే తత్వం ఉండేది. దాంతోపాటు పెద్దలు ఇద్దర్నీ కూర్చోపెట్టి సర్దిచెప్పేవారు. ప్రస్తుతం ఆ సంస్కృతి పోయింది. జీవితం ఉరుకులు పరుగులు, ఆధిపత్య సమస్య, సర్దుబాటు తత్వం లేకపోవటం, నైతిక విలువల పట్ల లక్ష్యం లేకపోవటం సమస్యలుగా ఉన్నాయన్నారు. అన్నింటికన్నా ముఖ్యంగా ఈ సంవత్సర కాలంలో చేసిన కేసుల్లో కొన్ని వందల కేసులు పరిశీలిస్తే మూలం ప్రధానం కారణం 'మద్యం'గా తమ దృష్టికి వచ్చిందన్నారు. వీటిల్లో చదువుకున్న వారు, చదువులేని వారు కూడా ఉన్నారన్నారు, ఎన్‌ఆర్‌ఐ కేసుల విషయంలో జాప్యం లేకుండా స్పందించే విధంగా చట్టాలుండాలని వారు అభిప్రాయపడ్డారు.

మద్యం మత్తులో......ఉన్మాదిలా.....

నిండు గర్భిణి....అప్పటికే ఒక బిడ్డ తల్లి....అనుమానంతో కనికరం లేకుండా కసాయి భర్త నరికేశాడు. ఈ సంఘటన చిత్తూరు జిల్లా పరకాలలో జరిగింది. ఈ కేసులో అన్ని సంఘాలను కలుపుకుని నిందితుడికి శిక్ష పడేలా చేశామని చెప్పారు. ఇంకో కేసులో మూడు సంవత్సరాల బిడ్డపై తండ్రి అత్యాచారం చేశాడు. చూసి ప్రశ్నించిన తల్లిని పిచ్చిదానిగా చిత్రీకరించాడు. పోలీసుల నుండి ఆమెకు సాయం లభించలేదు. ఐద్వా దృష్టికి వచ్చిన ఈ కేసులో పసిబిడ్డకు నిర్వహించిన వైద్య పరీక్షల్లో అత్యాచారం చేసింది వాస్తవమేనని తేలింది. నిందితుడికి శిక్ష పడేలాచేశామన్నారు. ఈ సంఘటన శ్రీకాళహస్తిలో జరిగింది. రేణిగుంటలో జరిగిన కేసులో నాలుగున్నర సంవత్సరాల చిన్న పాపని తాత మందు తాగించి అత్యాచారం చేశాడు. విషాదమేమంటే విషయం తెలిసిన అమ్మమ్మ విషయాన్ని బయటకు రానీయకుండా పిల్లకు వైద్యం చేయించింది. దఫదఫాలుగా ఈ అత్యాచారం కొనసాగింది. గమనించిన పసిబిడ్డ తల్లి ఐద్వా దగ్గరకు వచ్చింది. నిందితుణ్ని అరెస్టు చేయించాము. తిరుపతిలో 13 సంవత్సరాల కూతురిపై తండ్రి అత్యాచారం యత్నం చేశాడు. ప్రతిఘటించిన బిడ్డను గోడకు కొట్టి చంపాడు. ఈ కేసులో తల్లి నిలబడలేదు. 'పోయిన బిడ్డ కోసం ఉన్న బిడ్డను బలిచేయలేను' అని విలపించింది.

భవిష్యత్ కార్యక్రమాలు: సమస్యలకు మూల కారణం ప్రభుత్వ విధానాలు.... ఇవి మారాలి. వీటి వల్ల సమస్యలు ఉత్పన్నమయ్యే బాధిత కుటుంబాలకు మోటూరు ఉదయం ట్రస్ట్ చేయూత ఇస్తుంది. రాష్ట్ర వ్యాపితంగా ట్రస్ట్ ఆధ్వర్యంలో 16 జిల్లాల్లో నడుస్తున్న కౌన్సిలింగ్ సెంటర్‌లకు వస్తున్న వారి సంఖ్య రోజు రోజుకు ఎక్కువగా ఉంటున్నది. మిగిలిన జిల్లాల్లో ఈ కేంద్రాలను నడపడంతోపాటు డివిజన్ కేంద్రాలకు కూడా విస్తరించాలని అనుకుంటున్నట్లు రాష్ట్ర కేంద్ర నిర్వాహకులు తెలిపారు.

-బి.సుధాకిరణ్

## శిశు మరణాల తగ్గింపులో

# చైనా విజయం

**మొత్తం శిశు మరణాల్లో నవజాత శిశువులు 41 శాతంగా ఉన్నారు. పుట్టిన నెలలోపల మరణాల రేటు (ఎన్ఎంఆర్ నియోనాటల్ మోర్టాలిటీ రేట్) భారత్‌లో ప్రతి వెయ్యి మందికి 34గా ఉన్నట్లు యునిసెఫ్ తెలిపింది. చైనాలోని ఎన్ఎంఆర్ కంటే ఇది మూడు రెట్లు అధికం. 2009లో చైనాలో అది 11గా ఉంది. 1990లో భారతదేశ ఎన్ఎంఆర్ 49.**

నవజాత శిశు మరణాల రేటు తగ్గింపులో చైనా అనూహ్య విజయం సాధించింది. అక్కడ దశాబ్ద కాలంలోనే మూడింట రెండువంతుల మరణాలను తగ్గించగలిగినట్లు ఒక నూతన అధ్యయనం వెల్లడించింది. అత్యధిక నవజాత, శిశుప్రసూతి మరణాలతో కొట్టుమిట్టాడుతున్న భారత్ వంటి దేశాలకు ఈ విజయం గుణపాఠమని తెలిపింది. 1996లో ప్రతి వెయ్యి జననాలకు 24.7గా ఉన్న నవజాత శిశు మరణాలు చైనాలో 2008లో 9.3కు తగ్గాయని అంటే 62 శాతం తగ్గుదల అని లాసెట్ వైద్య జర్నల్‌లో ప్రచురితమైన ఒక అధ్యయన పత్రం తెలిపింది. గ్రామీణ ప్రాంతాల్లో గర్భిణులకు అత్యంత మెరుగైన సేవలు అందడం, దేశవ్యాప్తంగా ప్రసవాలు ఆస్పత్రుల్లో జరిగేలా చూడటాన్ని ప్రత్యేక లక్ష్యంగా పెట్టుకోవడం చైనా విజయ రహస్యమని ఈ పత్రం పేర్కొంది. చైనాలోని మహిళల్లో సగానికి తక్కువగా 1988లో ఆస్పత్రుల్లో పురుడు పోసుకున్నట్లు ఆ అధ్యయనం కనుగొంది. అయితే 2008 నాటికి ఆస్పత్రిలో ప్రసవాలనేవి సార్వజనీనంగా మారాయి. చైనా గ్రామీణ ప్రాంతాల్లో ఆరోగ్య రక్షణ అందు బాటులోకి ఎలా తెచ్చారో ఇతర దేశాలు నేర్చుకోవాలని ఆ అధ్యయనం తెలిపింది.

ప్రపంచంలోని నవజాత శిశు మరణాల్లో సగానికి పైగా భారత్, చైనా, నైజీరియా, పాకిస్తాన్, డెమోక్రటిక్ రిపబ్లిక్ ఆఫ్ కాంగోలోనే జరుగుతున్నాయి. ప్రపంచంలోనే అత్యధిక నవజాత శిశు మరణాలు భారత్‌లో సంభవిస్తున్నాయి. 1990 నాటికి 33 శాతం నుంచి తగ్గుదల ఉన్నప్పటికీ 2009లో తొమ్మిది లక్షల మందికి పైగా శిశువులు మరణించినట్లు ప్రపంచ ఆరోగ్య సంస్థ ఇటీవల విడుదల చేసిన తాజా అధ్యయనం వివరించింది. మొత్తం శిశు మరణాల్లో నవజాత శిశువులు 41 శాతంగా ఉన్నారు. పుట్టిన నెలలోపల మరణాల రేటు (ఎన్ఎంఆర్ నియోనాటల్ మోర్టాలిటీ రేట్) భారత్‌లో ప్రతి వెయ్యి మందికి 34గా ఉన్నట్లు యునిసెఫ్ తెలిపింది. చైనాలోని



ఎన్ఎంఆర్ కంటే ఇది మూడు రెట్లు అధికం. 2009లో చైనాలో అది 11గా ఉంది. 1990లో భారతదేశ ఎన్ఎంఆర్ 49. నెలలోపు శిశువుల, ప్రసవ సంబంధమైన సంరక్షణను విస్తరించడం, టీకాల కార్యక్రమాలకు నూతన వ్యాక్సిన్లు వాడటం ద్వారా భారత్‌లో కూడా శిశు మరణాలను గణనీయంగా తగ్గించవచ్చని గత సంవత్సరం వెలువడిన లాసెట్ అధ్యయనం ఒకటి తెలిపింది. వైద్యుల పర్యవేక్షణ లోపించడం వల్ల నవజాత శిశువుల మరణాలు ఎక్కువగా ఇంటివద్దనే సంభవిస్తున్నాయి. భారతదేశ తల్లుల మరణాల రేటు (ఎంఎంఆర్) కూడా చైనాలో కంటే చాలా ఎక్కువగా ఉంది. 2008లో భారతదేశ ఎంఎంఆర్ లేదా గర్భధారణ సంబంధమైన కారణాల వల్ల మహిళల మరణాలు లక్ష సజీవ జననాలకు 230గా ఉన్నాయి. అదే సమయంలో చైనాలో ఈ సంఖ్య 38గా ఉంది. చైనాలో 37 పట్టణ జిల్లాలు, 79 గ్రామీణ జిల్లాల్లోని గణాంకాలపై ఆధారపడి ఈ అధ్యయనం జరిగింది. ఈ అధ్యయనాన్ని యునిసెఫ్ మద్దతుతో పెకింగ్ విశ్వవిద్యాలయానికి చెందిన ఇద్దరు మేధావులు సింగ్ లిన్‌ఫెంగ్, యాన్‌గువో, లండన్ స్కూల్ ఆఫ్ హైజీన్ అండ్ ట్రాపికల్ మెడిసిన్‌కు చెందిన కారైన రోన్స్‌మాన్స్ నిర్వహించారు. యునిసెఫ్ సహకారంతో చేపట్టిన ఈ ప్రాజెక్టు విజయవంతం కావడంతో చైనా ప్రభుత్వం అత్యధిక ఎంఎంఆర్ ఉన్న 450 కౌంటీలలో పైలట్ ప్రాజెక్టును ప్రవేశపెట్టింది. ప్రస్తుతం ఈ కార్యక్రమం దేశవ్యాప్తంగా ప్రతి గ్రామీణ జిల్లాల్లోనూ అమలులో ఉంది. ఈ కార్యక్రమం అమలులో లేని జిల్లాల్లో కంటే సబ్సిడీలతో కూడిన ఆస్పత్రి కార్యక్రమం అమల్లో ఉన్న జిల్లాల్లో తల్లుల మరణాల రేటు గణనీయంగా పడిపోయింది. 1995లో మాతా, శిశు ఆరోగ్యంపై చట్టం అమలు చేయడంతో ఆరోగ్య క్లినిక్‌లకు నిధుల స్థాయి బాగా పెరిగింది. ఈ పథకంపై ఇప్పుడు 90 శాతం గ్రామీణ జనాభాకు విస్తరించారు. ఇపుడు ఒక మహిళ ఏమీ చెల్లించనవసరం లేకుండా ఆస్పత్రికి వెళ్ళగలిగే పరిస్థితి వచ్చింది. ఇది ముఖ్యంగా మహిళలకు, ప్రత్యేకించి ప్రజారోగ్యానికి అద్భుతమైన పరిణామం అని యునిసెఫ్ చైనాలోని ఆరోగ్య పోషకాహార సంస్థ అధిపతి డేవిడ్ హిప్‌గ్రేవ్ తెలిపారు.

–సేకరణ : మానవి డెస్క్

# విముక్త

✍ ఓల్గా

పద్నాలుగేళ్ళ వనవాసాన్నీ, అనేక కష్టాలనూ, అనంత సాగరాన్నీ దాటి అయోధ్య తిరిగివచ్చిన సీతారామ లక్ష్మణులను స్వాగతించటానికి అంతఃపురమంతా కదలివచ్చింది.

ఒక్క ఊర్మిళ తప్ప!

ఆత్రంగా వెదకిన సీత కళ్ళకు ఊర్మిళ ఎక్కడా కనిపించలేదు. అత్తగార్ల ఆలింగనాలూ, కుశల ప్రశ్నలు, మాండవి, శ్రుతకీర్తుల స్నేహపు పలుకులు, సేవలు ఇవేమీ సీత మనసుకెక్కటం లేదు.

"ఊర్మిళ ఏది? ఆరోగ్యంగా లేదా"? హడావుడి కొద్దిగా నిమ్మళించిన తర్వాత చెల్లెలు శ్రుతకీర్తిని దగ్గరకు తీసుకుని మెల్లిగా అడిగింది సీత.

"ఊర్మిళ ఏది?"

శ్రుతకీర్తి ముఖం వివర్ణమైంది. ఆమె ముఖం చూసి సీతకు భయం వేసింది.

"ఊర్మిళకేమయింది? కుశలమే కదా?"

సీత ఆందోళన అర్థమైనా ఏం చెప్పాలో తెలియలేదు శ్రుతకీర్తికి.

ఆమె ఊర్మిళను చూసి పధ్నాలుగేళ్ళయింది.

"మాట్లాడకుండా అలా చూస్తావేమిటి? ఊర్మిళ ఏది? ఎలా ఉంది?" సీత ఆందోళనగా అడిగింది.

"ఊర్మిళ ఎలా ఉందో నాకు తెలియదు. అక్కను నువ్వెళ్ళిన నాటినుంచీ చూడలేదు"

సీతకేమీ అర్థం కాలేదు. తను పొరపాటుగా వింటున్నాననుకుంది. గట్టిగా మళ్ళీ.

"శ్రుత కీర్తి-నేను ఊర్మిళ గురించి అడుగుతున్నాను"అంది.

"నేనూ ఊర్మిళ గురించే చెప్తున్నాను. మీరు వెళ్ళాక ఊర్మిళ ఎవరికీ కన్పించలేదు. తన మందిరంలోంచి బైటికి రాలేదు. ఎవరినీ లోపలకు రానివ్వలేదు".

నిర్ఘాంతపోయింది సీత.

"ఎవ్వరినీ! అత్తగార్లను కూడా"



"ఎవ్వరినీ రానివ్వలేదు. దాసీలు మాత్రం వస్తూ పోతూ ఉన్నారు. ఆమె గదిలోకి ప్రవేశం ఒక్క చారుమతి అనే ఆమెకే ఉంది. ఆమె ఊర్మిళ యోగక్షేమాలు మాకు చెబుతుంది".

సీతకు ఊపిరాడనట్లయింది.

పధ్నాలుగేళ్ళు మనుషులతో మాట్లాడకుండా - తనవాళ్ళను చూడకుండా ఎట్లా ఉంది. అట్లా ఉండాలని నిర్ణయించుకోటానికి ఆమె మనసు ఎంత గాయపడి ఉండాలి. పధ్నాలుగేళ్ళు! ఆమె రామలక్ష్మణులనూ, తననూ క్షమిస్తుందా?

"ఇవాళ మేం వస్తున్నాం అన్న వార్త ఊర్మిళకు తెలుసా?"

శ్రుతకీర్తి తల దించుకుంది.

సీత వెంటనే రాముని దగ్గరకు వెళ్ళాలని చూసింది గానీ మంత్రులు, తమ్ముళ్ళు పుర ప్రముఖులు పరివేష్ఠించిన ఆ సమయంలో రామలక్ష్మణులను సమీపించటం అసాధ్యమనిపించింది.

ఇంతలో శ్రుతకీర్తి ఒక స్త్రీని తీసుకొచ్చింది.

"ఈమే చారుమతి" సీత ఇంక ఆలస్యం చెయ్యలేదు.

'పదమ్మా-ఊర్మిళ దగ్గరకు వెళదాం"

"ఆమె ఎవ్వరినీ చూడదు" అంది చారుమతి ముక్తసరిగా.

"ఎవరివల్ల ఆమె అందరికీ దూరంగా బతుకుతుందో వాళ్ళే వచ్చారని తెలిస్తే ఆమె వారిని తప్పక చూస్తుంది. పద"

సీత చారుమతిని నడవమని కళ్ళతోనే ఆజ్ఞాపించింది. ఊర్మిళ మందిరం వందల యోజనాల దూరం ఉన్నట్లనిపించింది సీతకు. ఎంత నడిచినా రాదేం....

❖ ❖ ❖

అరణ్యవాసమంతా లక్ష్మణుడితో పాటు ఊర్మిళా తమతో ఉంటే ఎంత బాగుండేది అనిపిస్తూనే ఉండేది సీతకు. రామలక్ష్మణులు తమ పనులలో అరణ్య సంచారంలో ఉంటే తనూ, ఊర్మిళా కలిసి అరణ్య సౌరభాలను ఆస్వాదించేవారు గదా అనుకునేది.

ఎందుకు లక్ష్మణుడు ఊర్మిళను తీసుకురాలేదు? ఆ విషయం ఎప్పుడు ప్రస్తావించినా మౌనం తప్ప పెదవి విప్పడు లక్ష్మణుడు. తాము అడవికి వచ్చేటప్పుడు అంతా గందరగోళం. అయోమయం.

దశరథుని అనారోగ్యం, కౌసల్య దుఃఖం, అంతఃపురమంతా అల్లకల్లోలమౌతుంది. తాను రాముని వెంట వెళ్ళటానికి అందరినీ ఒప్పించటమే పెద్ద పనయింది. తీరా సరయూ నది దాటుతుండగా మనసు స్థిమితపడినపుడు ఊర్మిళ తమతో రావటంలేదనే విషయం గట్టిగా మనసును తాకింది. ఈ మొత్తం గొడవలో ఊర్మిళ అసలు జోక్యమే తీసుకోలేదనీ, తమకు వీడ్కోలు కూడా చెప్పలేదనీ గ్రహించిన తరువాత సీత ఆందోళన పెరిగింది. దానితో రాముడిని పదే పదే ప్రశ్నించేది.

'ఊర్మిళ ప్రస్తావనలేదా? లక్ష్మణుడు ఒంటరిగా వస్తుంటే ఆమె ఎంత దుఃఖించిందో! అరణ్యవాసం దుస్సహమను కుందా? అలాగయితే లక్ష్మణుడు అయోధ్యలో ఉంటేనే బాగుండేది గానీ మనకోసం ఊర్మిళను ఒంటరిదాన్ని చేసి రావటం సమంజసమా"?

ఇలా మాట్లాడుతున్న సీతను రాముడు సమయానుకూలంగా సమాధానపరిచేవాడు. అయోధ్యలో అత్తగార్ల సేవకు ఊర్మిళ ఉండాలి. కౌసల్యను చూసుకునే వారెవరు? భర్తృహీన, పుత్రవియోగి అయిన అత్తగారికి అండగా లేకుండా సీత వనవాసానికి వచ్చేసింది. ఆమెకు ఊర్మిళ తప్ప ఎవరున్నారు? ముగ్గురు అత్తగార్లకూ ముగ్గురు కోడళ్ళయినా ఉండొద్దా. ముఖ్యంగా అమ్మ కౌసల్యను అనుక్షణం కాపాడాలిగదా. రాముడు ఇంకా చెప్పేవాడు.

అంతఃపురంలో నిర్వహించాల్సిన బాధ్యతలెన్నో ఉంటాయి. అవి మహారాణిగా కౌసల్య ఎంతో సామర్థ్యంతో నిర్వహించేది. ఇప్పుడామెకు శక్తి చాలదు. ఆసక్తి అసలే ఉండదు. ఆ నిర్వహణ భారం ఊర్మిళ తప్ప ఎవరు మోయగలరు?

**'ఊర్మిళ ప్రస్తావనలేదా? లక్ష్మణుడు ఒంటరిగా వస్తుంటే ఆమె ఎంత దుఃఖించిందో! అరణ్యవాసం దుస్సహమను కుందా? అలాగయితే లక్ష్మణుడు అయోధ్యలో ఉంటేనే బాగుండేది గానీ మనకోసం ఊర్మిళను ఒంటరిదాన్ని చేసి రావటం సమంజసమా"?**

" సీతా చెప్పు- ఈ విషయంలో నీకంటే ఊర్మిళ సమర్థురాలు కదూ? మనం అయోధ్యలో ఉన్నపుడు అమ్మ నీకంటే ఊర్మిళకు ఎక్కువ బాధ్యతలు అప్పజెప్పేది కదూ"?

" ఔను" అని ఆలోచనలో పడేది సీత. ఊర్మిళ లౌకిక వ్యవహారాలలో చాలా సమర్థురాలు. చూపుతో శాసించగలదు. రాణీవాసాలలో జరిగే సమస్త విధులూ ఆమెకు తెలుసు. తండ్రి కూడా ఈ విషయంలో చెల్లినే ప్రశంసించేవాడు.

" నీకు విలువిద్యలో, ఉద్యానవన విహారాలలో ఉన్న ఆసక్తి మిగిలిన విషయాలలో లేదమ్మా" అనేవాడు.

నిజమే. ఆ అంతఃపుర అధికారాలూ, వాటి నిర్వహణ సీతకే మాత్రం నచ్చేవికావు. ఉద్యానవనంలో ఆటలు, విలువిద్యాభ్యాసం, ప్రకృతిలో సేదతీరటం ఇవే చాలు సీతకు. అయోధ్య వచ్చిన తర్వాత కూడా అత్తగారి నుంచి బాధ్యతలు తీసుకునే ఆసక్తి చూపలేదు. ఊర్మిళ మాత్రం కౌసల్య వెంటే ఉండేది.

సీతకు అంతఃపురం కంటే అరణ్యమే హాయిగా ఉంది. ఇక్కడ స్నేహం చేయటానికీ, గౌరవించటానికీ మనుషులుంటారు గానీ అధికారం చలాయించేందుకు కాదు. ఈ సహవాసమే సీతకు పరమప్రియంగా ఉంది.

" నీకు ప్రియమైనది ఊర్మిళకు ప్రియమవ్వాలని లేదుగా. నువ్వు భూపుత్రివి. ప్రకృతి ప్రేమికురాలివి. ఊర్మిళకు నగర జీవితం, అంతఃపుర బాధ్యతలూ ప్రియం కావచ్చుగదా" రాముడెంత సముదాయించినా సీత ఊర్మిళ కోసం దిగులు పడేది.

భర్త వియోగాన్ని భరించటం అన్నిటికంటే పెద్ద కష్టం కదా-

రావణుని చెరలో అదెంత కష్టమో సీతకు బాగా అర్థమైంది.

సీత ప్రకృతి ప్రేమికురాలని తెలిసి రావణుడు ఆమెను అశోకవనంలో ఉంచాడు. ఆ వన సౌందర్యం వర్ణనాతీతం. మిథిలలో, అయోధ్యలో ఎక్కడాలేని వనవైభవం. రావణునికి పిచ్చి ప్రేలాపనలే గాని సీతను తేరిపార చూసే ధైర్యం కూడా లేదు. సీతకతను తృణప్రాయం.

ఐనా అపహరణకు గురైన పతి తన రక్షణార్థం వస్తాడని కూర్చోవటం సీతకు నరకప్రాయంగా ఉండేది.

రాముడు వస్తాడు. రావణుని సంహరిస్తాడు. దీనిలో సీతకే సందేహమూ లేదు. తనను తాను రక్షించుకోగల శక్తిని నియంత్రించుకుని ఏ ప్రయత్నమూ చేయకుండా కూర్చోవటమే అసహనంగా ఉండేది.

రాముని మనసు సీతకు తెలుసు. రావణ సంహారం తానే చెయ్యాలనే రాముని సంకల్పం ముందు సీత ప్రతాపం వెనక్కు తగ్గక తప్పలేదు.

" మన అనుబంధంలో మీకు చాలా ఇష్టమైనదేమిటి?" అని అడిగింది సీత ఒక రోజు.

" నిన్ను కంటికి రెప్పలా కాపాడుకోవటం. నీ కాలిలో ముల్లు దిగినా నేనే తియ్యాలి. నిన్ను సమీపించబోయే క్రూరమృగాలను నేను సంహరించాలి. నిన్ను రక్షిస్తున్నాననే భావన నాకు అయోధ్యసామ్రాజ్య సార్వభౌమత్వం కంటే ఎక్కువ గర్వాన్నీ ఆనందాన్నీ కలిగిస్తుంది". అన్నాడు రాముడు.

" నన్ను నేను రక్షించుకోగలను. విలువిద్యలో మీకు తీసిపోను" అంది సీత నవ్వుతూ రాముని ముఖం చిన్నబోయింది.

" నేను జీవించి ఉండగా నిన్ను నువ్వు





రక్షించుకునే అవసరమే రాదు. రాకూడదు. నువ్వు నాకోసం చూడాలి. నాబలమైన బాహువుల రక్షణకోసం చూడాలి. నిన్ను నువ్వే రక్షించుకుంటే ఇక నేనెందుకు? అలా ఎన్నడూ చెయ్యనని వాగ్దానం చెయ్యి"

సీత రాముని చేతిలో చెయ్యి వేసింది.

అపహరణ, అశోకవనంలో నిరీక్షణ తప్ప సీతకు మరో మార్గం లేకుండా పోయింది. అప్పుడు ఆ పతీ వియోగవ్యథలో ఊర్మిళ ప్రతిక్షణం గుర్తొచ్చేది.

"ఎలా సహిస్తోంది ఊర్మిళ? నా ప్రియమైన చెల్లీ. ఎందుకక్కడ ఉన్నావమ్మా.

ఆ అంతఃపురంపై అంత మక్కువ ఎందుకమ్మా" అని ఊర్మిళను కూడా తన దుః ఖార్తిలో కలుపుకునేది.

చివరకు రావణ సంహారం జరిగింది. అగ్ని పరీక్ష గడిచింది.

' అయోధ్య సీతారాముల రాకకు నిరీక్షిస్తోంది' అని రాముడు సగర్వంగా చెప్పినప్పుడూ సీతకు ఊర్మిళను చూడాలనే తహతహే!

" ఊర్మిళకు ఎంత ఆనందంగా ఉందో. తన మందిరాన్ని ఎంత సుందరంగా అలంకరింపచేసిందో. తను లక్ష్మణుడి ఎదుట పడే క్షణం కోసం ఎంత అలంకరణ చేసుకుం టుందో. అంతఃపురం చేరగానే అత్తగార్లకు నమస్కరించి లక్ష్మణునితోపాటు ఊర్మిళ దగ్గర కు వెళ్ళాలి. లక్ష్మణుని ఊర్మిళకు అప్పగించి వారి సంబరం చూసి-కొద్ది నిముషాలు వారి ఏకాంతానికి భంగం కలిగించినా సరే ముందు ఊర్మిళ మందిరానికి వెళ్ళే తన మందిరానికి వెళ్ళాలి". ఆ దృశ్యాన్ని పదేపదే ఊహించుకుని ఆనందం పొందుతున్న సీతను చూసి "ఆనందంతో వెలిగిపోతున్న నీ వదనం ఎంత అందంగా ఉంది సీతా" అన్నాడు రాముడు.

"ఊర్మిళ ఆనందం ఊహించుకున్నంత మాత్రానే నా మనసుకు ఎంతో హాయిగా ఉంది". అంది సీత మధురంగా నవ్వుతూ.

రాముడు కూడా సీత సంతోషాన్ని పంచుకున్నాడు. ఇద్దరూ అర్ధవంతంగా లక్ష్మణుని చూసి నవ్వుకున్నారు.

తన కోసం పధ్నాలుగేళ్ళు భార్యా వియోగం సహించిన తమ్ముని చూసి గర్వంతో ఉప్పొంగింది రాముని హృదయం.

లక్ష్మణున్ని దగ్గరకు తీసుకుని హృదయానికి హత్తుకున్నాడు.

ఆయాచితమైన అన్నగారి కౌగిలిలోని ఆత్మీయతకు లక్ష్మణుడూ పులకితుడయ్యాడు. నగరం చేరువవుతున్నకొద్దీ ముగ్గురి మనసులూ పున్నమి రాత్రి అలలతో ఎగసిపడే సాగరాల్లా ఉన్నాయి.

ఎన్నో ఆలోచనలు, జ్ఞాపకాలు-వింత అనుభూతితో, ఎంతో ఉద్వేగంతో వస్తే హృదయానికి హత్తుకోవటానికి ఊర్మిళ ఎదురుపడలేదు.

హృదయాన్ని చీలుస్తూ ఊర్మిళ తనకు తాను విధించుకున్న పధ్నాలుగేళ్ళ అజ్ఞాతవాస వార్త!



ఊర్మిళ మందిరం వెలుపలంతా అలంకరించారు. ఆమె గది తలుపులు మాత్రం తెరుచుకోలేదు. చారుమతి మెల్లిగా తలుపుమీద తట్టి

" అమ్మా- మీ సోదరి జానకీదేవి మిమ్మల్ని చూడాలని వచ్చారు". అన్నది.

సీత మనసు మనసులో లేదు. 'ఎలా ఉంటుంది ఊర్మిళ. ఏమంటుంది? తననేం అడుగుతుంది. తనేం చెప్పాలి?" తలుపులు తెరుచుకోలేదు.

సీత తనే స్వయంగా పిలిచింది.

" ఊర్మిళా నేనమ్మా అక్కయ్యను వచ్చాను. అంతా చెబుతాను. మమ్మల్ని క్షమించి తలుపు తెరువు"

ఊర్మిళ గది తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగా ఊర్మిళ. సీత ఒక్క క్షణం దిగ్భ్రమ చెందింది. సీతకు తెలిసిన ఊర్మిళ కాదీమె. మునుపు ఆ కళ్ళలో కొంత అమాయకత్వం ఉండేది. మరికొంత రాచరికపు దర్పం ఉండేది. శరీరపు తీరు చాలా ఠీవిగా రాణిలా ఉండేది. ఇప్పుడు ఆ రెండు కళ్ళలో వెలుగుతున్నదేమిట?. ఇప్పుడామె శరీరంలో ఏదో తెలియని సంయమనం, గాంభీర్యం. ముఖంలో ఆ తేజస్సు ఏమిటి? సీత తెప్పరిల్లుకుంటున్నపుడు ఊర్మిళ వచ్చి అక్కగారి పాదాలకు నమస్కరించి ఆసనం మీద కూర్చోబెట్టింది.

" ఊర్మిళా-పధ్నాలుగేళ్ళూ నీ గురించి ఆలోచిస్తున్నాను. ఎంతో బాధపడుతున్నాను" సీత కళ్ళల్లో కన్నీరు మరి ఆగనంటూ బైటికురికింది.

" మామీద నీకు కోపం ఉండొచ్చు "

ఊర్మిళ ప్రేమగా గంభీరంగా నవ్వింది.

" నాకెవరిమీదా కోపం లేదు"

" మరి ఎందుకిట్లా అందరికీ దూరంగా-కోపం లేకపోతే ఇట్లా ఒక గదిలో బందీవవుతావా? నీ కోపాన్ని ప్రదర్శించు. ఆగ్రహించు. కానీ ఎవరికీ కాకుండా పోకు. అసలేం జరిగిందో, ఇలా ఎందుకు చేస్తున్నావో చెప్పు."

**నా భర్త నాతో ఒక్కమాట చెప్పకుండా, నా నిర్ణయంతో ప్రమేయం లేకుండా నేననేదాన్ని ఒకదానిని ఉన్నాననే ఆలోచన లేకుండా, అన్నగారే సర్వస్వమని వెళ్ళిపోయాడు. ఆనాడు కోపంతో దహించుకుపోయాను. ఈ అంతఃపురాన్ని నా తిరుగుబాటుతో తల్లకిందులు చేయాలనుకున్నాను.**

**అందరూ మీ కోసం దుఃఖిస్తున్నారు. నావైపు చూసేవారే లేరు. నిస్సహాయ ఆగ్రహం- నేనూ ఎవరినీ చూడదల్చుకోలేదు. సత్యాగ్రహం ప్రారంభించాను".**

ఊర్మిళ నవ్వింది.

" చెప్తానక్కా-నీకు కాక ఇంకెవరికి చెప్తాను? నీకు తప్ప ఎవరికీ అర్థం కాదు. అందుకే మౌనంగా ఉన్నాను".

సీత ఉత్సకతతో ఎదురుచూస్తోంది.

" అక్కా నేను కోపంతోనే మొదట ఈ గది తలుపులు మూశాను.

నా భర్త నాతో ఒక్కమాట చెప్పకుండా, నా నిర్ణయంతో ప్రమేయం లేకుండా నేననేదాన్ని ఒకదానిని ఉన్నాననే ఆలోచన లేకుండా, అన్నగారే సర్వస్వమని వెళ్ళిపోయాడు. ఆనాడు కోపంతో దహించుకుపోయాను. ఈ అంతఃపురాన్ని నా తిరుగుబాటుతో తల్లకిందులు చేయాలను కున్నాను.

అందరూ మీ కోసం దుఃఖిస్తున్నారు. నావైపు చూసేవారే లేరు. నిస్సహాయ ఆగ్రహం- నేనూ ఎవరినీ చూడదల్చుకోలేదు. సత్యాగ్రహం ప్రారంభించాను".

సీత మనసు అప్పటి ఊర్మిళను పట్టుకునే ప్రయత్నం చేస్తోంది.

"మొదలు పెట్టినపుడది ఆగ్రహమే-కానీ క్రమంగా అది సత్యం కోసం నాలో నేను, నాతో నేను చేసే అన్వేషణగా మారింది. నాకెందుకింత కోపం, నన్ను నేను కాల్చేసుకునే కోపం, నాకెదురైన ప్రతివారినీ దహించాలనే కోపం, నాకెందుకీ దుఃఖం. కారణం తెలుసు. కానీ ఆ కారణం లోపలికి లోలోపలికి చూడాలనే తహతహ ఒకటి నాకు తెలియకుండానే పుట్టుకొచ్చింది. కోపం ఏమిటి? దుఃఖం ఎందుకు? ఆనందం దేనికి? నా శరీరానికీ, నాలో కలిగే ఈ ఆవేశాలకూ, ఉద్వేగాలకూ మధ్య ఉన్న సంబంధం ఏమిటి? ఇట్లా ఎన్నో ప్రశ్నలు- అవి నన్ను లీనం చేసుకున్నాయి. నా శరీరాన్ని గమనించటం, నా ఆలోచనలు, అవి నాలో రేకెత్తించే ఉద్రేకాన్ని గమనించటంతో మొదలుపెట్టాను. ఈ గమనికకు ఎలాంటి అంతరాయం కలిగినా నాకు అశాంతిగా ఉండేది. అందుకే నేను ఏకాంతాన్ని కోరుకున్నాను. ఒంటరితనాన్ని కాదు. ఏకాంతాన్ని నాలో నేను, నాతో నేను సంభాషించుకునే ఏకాంతాన్ని.

ఆ సంభాషణ నన్నూ, నాకు సంబంధించిన వ్యక్తులనూ ఎదురెదురుగా నిలబెట్టేది. ఆ సంబంధాన్ని చీల్చి చూసేది.

"మొదలు పెట్టినపుడది ఆగ్రహమే-కానీ క్రమంగా అది సత్యం కోసం నాలో నేను, నాతో నేను చేసే అన్వేషణగా మారింది. నాకెందుకింత కోపం, నన్ను నేను కాల్చేసుకునే కోపం, నాకెదురైన ప్రతివారినీ దహించాలనే కోపం, నాకెందుకీ దుఃఖం. కారణం తెలుసు. కానీ ఆ కారణం లోపలికి లోలోపలికి చూడాలనే తహతహ ఒకటి నాకు తెలియకుండానే పుట్టుకొచ్చింది. కోపం ఏమిటి? దుఃఖం ఎందుకు? ఆనందం దేనికి? నా శరీరానికీ, నాలో కలిగే ఈ ఆవేశాలకూ, ఉద్వేగాలకూ మధ్య ఉన్న సంబంధం ఏమిటి? ఇట్లా ఎన్నో ప్రశ్నలు- అవి నన్ను లీనం చేసుకున్నాయి. నా శరీరాన్ని గమనించటం, నా ఆలోచనలు, అవి నాలో రేకెత్తించే ఉద్రేకాన్ని గమనించటంతో మొదలుపెట్టాను. ఈ గమనికకు ఎలాంటి అంతరాయం కలిగినా నాకు అశాంతిగా ఉండేది. అందుకే నేను ఏకాంతాన్ని కోరుకున్నాను. ఒంటరితనాన్ని కాదు. ఏకాంతాన్ని నాలో నేను, నాతో నేను సంభాషించుకునే ఏకాంతాన్ని.

ఒక్కొక్క సంబంధం, మన తండ్రి, నీవు, లక్ష్మణుడు, రాముడు, కౌసల్య ఇలా అందరితోటి నా సంబంధపు సారాంశం ఏమిటని పొరలు, పొరలు విప్పి చూశాను.

సీత ఉత్సుకతతో ఎదురుచూస్తోంది.

" అక్కగా నిన్ను ప్రేమించినపుడు, నన్ను ఒదిలి నీ భర్తతో నువ్వెళ్ళిపోయినపుడు, మన మధ్య సంబంధంలో జరిగిన మార్పు ఎలాంటిది- ఎందుకలా జరిగింది? ప్రేమను కోపంగా మార్చే రసాయనిక చర్యకు మూలం ఏమిటి?

అసూయ, ద్వేషం, ప్రేమ, గౌరవం- వీటి మధ్య తేడా ఎంత? అసలుందా లేక ఒకే వర్ణఛాయా భేదాలా? ఒక నీడలోకి ఇంకొక వెలుగు, ఒక వెలుగులోకి ఇంకొక నీడ ఎలా చొరబడుతుంది. ఏది వెలుగు? ఏది నీడ?

ఒక్కొక్క ప్రశ్న ఉదయిస్తున్నకొద్దీ నాలో సమరోత్సాహం వంటిది కలిగింది. మన పతులు ఈ పధ్నాలుగేళ్ళూ రాక్షస సంహారం కోసం యుద్ధాలు చేశారని విన్నాను. దానివల్ల శాంతి చేకూరిందో, చేకూరుతుందో నాకు తెలియదు. కానీ నేనీ ప్రశ్నలతో చేసిన యుద్ధంలోంచి ఒక గొప్ప శాంతి, ఆనందం వచ్చింది".

ఊర్మిళ ముఖంలో ఆ శాంతి ప్రస్ఫుటమవుతూనే ఉంది. సీత ఊర్మిళను ఆశ్చర్యంతో చూస్తూ ఆమె మాటలను వింటూ,ఆమె చేసానని చెబుతున్న యుద్ధాన్ని ఊహించుకుంటోంది. ఆమెకు లక్ష్మణుడి గురించి ఒక ఆరాటం మొదలైంది.

" లక్ష్మణుడికి నీ మీద ప్రేమ ఉంది ఊర్మిళా-అతనితో-"

సీత మాటలకు అడ్డు వచ్చింది ఊర్మిళ.

"పధ్నాలుగేళ్ళ తర్వాత కలవబోతున్నాం. మేమిద్దరం-ఏమో-నేను మాత్రం చాలా మారాను. మార్పు జీవన సంకేతం. దానికి అతను ఇచ్చే విలువను బట్టే మా ఇద్దరి జీవిత గమనం సాగిపోతుంది.

నేను ద్వేషంతో కాకుండా న్యాయాన్ని గురించి ప్రశ్నించగల విజ్ఞత సంపాదించుకున్నాను. లక్ష్మణునితో నా సంబంధం అతను ' నా విజ్ఞతను ఎలా అర్థం చేసుకుంటాడు. ఎంత గౌరవిస్తాడు '' అనేదానిపై ఆధారపడి ఉంటుంది.

అతను మిగిలిన అధికారాలను ఒదలకుండా వాటికి లోబడుతూ నాపై





మాత్రం అధికారాన్ని ఒదులుకుంటాడా- ఏమో-చెప్పలేను. ఏదెలా జరిగినా నా శాంతి మాత్రం భగ్నమవదు. ఆ శాంతి అవతలి వ్యక్తికి కావాలా లేదా అన్నదే విషయం.

సీత ముఖంలోని ఆందోళన ఊర్మిళకు అర్థమైంది.

తనను తాను మరింత విప్పి చెబితే సీత ఆందోళన తగ్గుతుందా-ప్రయత్నించాలను కుంది.

" నా చుట్టూ ఉన్నవారితో నాకున్న సంబంధంలోని అధికారాన్ని గుర్తించినపుడు నాకు సమస్తం తెలిసిన భావన కలిగింది. సర్వ దుఃఖాలకూ మూలం అధికారమేనక్కా ఇంకొక చిత్రం తెలుసా? ఈ అధికారాన్ని మనం పొందాలి. ఒదులుకోవాలి. నేను ఎవరి అధికారానికీ లొంగను. అపుడు నన్ను నేను విముక్తం చేసుకున్న భావన. నాలో ఇక ఒకే ఆనందం. గొప్ప శాంతి. ఎంతో ప్రేమ. అందరి మీదా జాలి.

పాపం ఈ అధికార చట్రాలలో పడి ఎలా నలుగుతున్నారో గదా- విముక్తం అయ్యేదారి తెలియక అశాంతులతో, దుఃఖాలతో, ద్వేషాలతో కుళ్ళిపోతున్నారు గదా-

అందరికీ చెబుదామా ఈ శాంతి రహస్యం అనుకున్నాను.

కానీ ఎవరికి అర్థమవుతుంది.?

పద్నాలుగేళ్ళు సత్యశోధనలో నే చేసిన గొప్ప తపస్సును నిద్ర అనుకున్నవాళ్ళకు నా మాటలు అర్థం అవుతాయా?

నిద్ర పోయానట నేను. నిద్రకూ మెలకువకూ అర్థం తెలుసా వీళ్ళకు?

ఎన్నడైనా శాంతిగా నిద్రపోయారా? చైతన్యంతో మేలుకున్నారా?

నాది నిద్ర అంటారు-పిచ్చి అంటారు నామాటలు వింటే-"

" లేదు ఊర్మిళా నీ మాటలు ఎంతో బావున్నాయి. నిజంగానే నువ్వు గొప్ప తపస్సు చేశావు".

" నాకు తెలుసక్కా నీకు అర్థమవుతుందని. అందుకే ఇవాళ పెదవి విప్పాను. కాని అక్కా- నీ జీవితంలో నాకొచ్చినటువంటి పరీక్షాసమయం వస్తే అప్పుడు ఆ పరీక్ష నిన్ను మామూలుతనంలోకి,మురికిలోకి నెట్టకుండా, ద్వేషంతో, ఆగ్రహంతో నిన్ను దహించకుండా, నిన్ను నువ్వు కాపాడుకో. నీ మీద అధికారాన్ని నువ్వే తీసుకో-ఇతరులపై అధికారాన్ని వదులుకో. అప్పుడు నీకు నువ్వు చెందుతావు. నీకు నువ్వు దక్కుతావు. మనకు మనం మిగలటమంటే మాటలు కాదక్కా- నా మాట నమ్ము".

ఊర్మిళ మాట్లాడుతుంటే సీత మనసులోకి ఒక నెమ్మదితనం ప్రవేశించింది. ఒక్కరోజులో ఇన్నేళ్ళ ఊర్మిళ జీవితాన్ని అర్థం చేసుకోలేను అనుకుంది సీత. రామునితో ఊర్మిళ మాటలు చెప్పింది.

" ఈ అధికారం నా తమ్ముని బాధించదు కదా" అన్నాడు రాముడు.

" ఊర్మిళను చూస్తేనే బాధలన్నీ పోయేలా ఉన్నాయి " అంది సీత. అపుడపుడూ ఊర్మిళను చూస్తూ ఆమె మాటలు, ఆమె నవ్వు, ఆమె శాంతి, ఆమె కాంతి, అన్నింటినీ ఆస్వాదిస్తూ ఉంది సీత.

❖ ❖ ❖

లక్ష్మణుడు అరణ్యంలో ఒదిలివెళ్ళాక, నట్టనడి సముద్రంలో మునిగి ఉన్నానని పించినపుడు సీత కళ్ళముందు ఊర్మిళ కదలాడింది.

జీవితంలో ఎడబాట్లూ అపనిందలేనా దక్కిందని ప్రశ్నించుకుని అరణ్యరోదనం చేస్తున్న సమయంలో సీతకు ఊర్మిళ మాటలు గుర్తొచ్చాయి.

ఊర్మిళకు చెప్పకుండా లక్ష్మణుడు రాముని వెంట అరణ్యవాసానికి వెళ్ళాడు.

తనకు చెప్పకుండా రాముడు తనను అరణ్యాలలో వదిలేసిరమ్మని లక్ష్మణుని నియోగించాడు.

ఊర్మిళ సత్యాగ్రహమో, తపస్సో ఏదో చేసి తనను తాను కాపాడుకుంది.

" అధికారాన్ని తీసుకో. అధికారాన్ని ఒదులుకో. అప్పుడు నీకు నువ్వు చెందుతావు. నీకు నువ్వు దక్కుతావు. మనకు మనం మిగలాలి". ఎన్నోసార్లు ఎన్నో విధాలుగా ఊర్మిళ ఈ మాటలే మళ్ళీ మళ్ళీ చెప్పింది. అవి తనకు ఊర్మిళ గురించిన అశాంతిని తగ్గించాయి. అంతే.

ఇపుడు సత్యాగ్రహం ప్రారంభించాలా? ఆగ్రహం తగ్గేదెప్పుడు? సత్యం బోధ పడేదెన్నడు? ఎట్లా-

రాముని మీద ఎనలేని అనురాగం. ప్రేమ. ఈ రాముని నుంచి విముక్తి ఎలా దొరుకుతుంది?

ఎలాంటి పరీక్ష ఇది. అగ్ని పరీక్ష ఏ పాటిది దీనిముందు. తనకు యుద్ధ విద్యలన్నీ వచ్చు. ఎన్నడూ ఎవరిమీదా యుద్ధం చేయలేదు. ఇపుడు తనమీద తనే యుద్ధం చేసుకోవాలి.

యుద్ధం మొదలైంది. ఎన్నాళ్ళు సాగుతుందో.

❖ ❖ ❖

"రామచంద్రుడు అశ్వమేధయాగం చేస్తున్నాడమ్మా. ఆహ్వానం పంపించాడు. నే వెళ్ళి వస్తానమ్మా" అని చెప్పాడు వాల్మీకి మహర్షి.

మహర్షి కాసేపు సీత సమాధానం కోసం చూసి, చివరకు వెళ్ళిపోవటం సీతకు తెలియదు. ఆమె దేనినీ గమనించే స్థితిలో లేదు.

" అధికారాన్ని తీసుకో. అధికారాన్ని ఒదులుకో. అప్పుడు నీకు నువ్వు చెందుతావు. నీకు నువ్వు దక్కుతావు. మనకు మనం మిగలాలి". ఎన్నోసార్లు ఎన్నో విధాలుగా ఊర్మిళ ఈ మాటలే మళ్ళీ మళ్ళీ చెప్పింది. అవి తనకు ఊర్మిళ గురించిన అశాంతిని తగ్గించాయి. అంతే.

**ఊర్మిళ ఎంత హఠాత్తుగా వచ్చిందో అంత హఠాత్తుగా వెళ్ళింది. సీత మనసులో జ్వాల మాత్రం అంత హఠాత్తుగా ఆరలేదు.**

**ఎక్కడెక్కడో మూల మూలల దాగిన నిప్పురవ్వలు, ఎప్పటి నుంచో నివురుగప్పిన నిప్పులు కణకణ మండసాగాయి. ఈ మంటలో సుఖాన్ని అనుభవించటానికి అలవాటుపడుతున్న సమయంలో సీతకు వాటిని ఆర్పాలని తెలిసింది.**

**రాముడిని ప్రేమించటం సుఖమా? రామునిపై ఆగ్రహించటం సుఖమా అనే ద్వైధీభావంలో మనసు కొట్టుమిట్టాడటం సీతకు తెలిసీ తెలియని స్థితిలో జరిగింది.**

అశ్వమేధయాగం రాముడెలా చేస్తాడు? తను పక్కన లేకుండా ఎలా?

తన స్థానంలో ఎవరు కూర్చుంటారు?

సీత మనసులో జ్వాల రేగింది.

" ఎవరు కూచుంటేనేం? నీకేంసంబంధం"

సీత మనసు చదివేసినట్లు మాట్లాడుతూ నవ్వుతూ వచ్చింది ఊర్మిళ.

" ఊర్మిళా-నువ్వు" సీత ఆశ్చర్యానికి మేరలేదు.

" నేనే వచ్చాను. నువ్విక్కడ ఉన్నావని లక్ష్మణుడు చెప్పాడు. అశ్వమేధ యాగవార్త నీకు చేరుతుందని తెలుసు. నీ మనసులో అది ఎలాంటి భూకంపం బయల్దేరదీస్తుందో కూడా ఊహించాను. ఈ సమయంలో నిన్ను నిన్నుగా మిగల్చాలని వచ్చాను".

సీత ఊర్మిళను ఆలింగనం చేసుకుని పక్కన కూర్చోబెట్టుకుంది. చాలాసేపటి నిశ్శబ్దం తర్వాత, ఈ నిశ్శబ్దంలో అనేక మాటలు నడిచాక.

" యాగం శ్రీరామచంద్రుడే చేస్తున్నాడా?" అడిగింది సీత.

" మరెవరు చేస్తారు? చక్రవర్తులే గదా చెయ్యాలి".

" నేను లేకుండా ఎలా-"

" ఆ ప్రశ్న నీకెందుకు రావాలి" వస్తే రామునికి రావాలి? యాగం చేయించే వారికి రావాలి. అనవసరమైన ప్రశ్నలతో అశాంతి పడటం అవివేకం కాదా?" తను సీతకంటే పెద్దదానిలా పలికింది ఊర్మిళ.

"నీకు తెలుసు. చెప్పు రాముని పక్కన కూర్చునేదెవరు?"

" నేను నీకు సమాధానం చెప్పి నీ అగ్నిని తాత్కాలికంగా చల్లార్చటానికో మరింత ప్రజ్వలింప చేయటానికో రాలేదు. అనవసరమైన ప్రశ్నలతో నిన్ను నువ్వు హింసించుకోవద్దని చెప్పటానికే వచ్చాను".

"కానీ నేనిది మింగలేకపోతున్నాను".

" మింగవద్దు. అసలది నీ మనసులో ప్రవేశించనే వద్దు. నువ్వు రాముడి నుంచి విముక్తం కావాలి".

" ఊర్మిళా-"

సీత వెక్కి వెక్కి ఏడ్చింది.

" ఎన్ని పరీక్షలు ఊర్మిళా"

" ప్రతి పరీక్షా నిన్ను రాముడి నుంచి విముక్తం చెయ్యటానికే. నిన్ను నీకు దక్కించటానికే. యుద్ధం చెయ్యి. తపస్సు చెయ్యి. లోపలికి చూడు, నీవనే యదార్థం కనపడేదాకా చూడు-"

''చాలాకష్టంగా ఉందమ్మా'' సీత గొంతులోంచి మాట కష్టంగా వచ్చింది.

"చాలా హాయిగా కూడా ఉంటుందక్కా ప్రయత్నించు. మరి నేవెళ్తాను. ఊర్మిళ లేచింది.

"అప్పుడేనా? నా పిల్లల గురించి వినవా? వారిని చూడవా?"

" వాళ్ళు నా దగ్గరకు వస్తే, నన్ను చూడాలని వస్తే తప్పక చూస్తాను".

❖ ❖ ❖

ఊర్మిళ ఎంత హఠాత్తుగా వచ్చిందో అంత హఠాత్తుగా వెళ్ళింది. సీత మనసులో జ్వాల మాత్రం అంత హఠాత్తుగా ఆరలేదు.

ఎక్కడెక్కడో మూల మూలల దాగిన నిప్పురవ్వలు, ఎప్పటి నుంచో నివురుగప్పిన నిప్పులు కణకణ మండసాగాయి. ఈ మంటలో సుఖాన్ని అనుభవించటానికి అలవాటుపడుతున్న సమయంలో సీతకు వాటిని ఆర్పాలని తెలిసింది.

రాముడిని ప్రేమించటం సుఖమా? రామునిపై ఆగ్రహించటం సుఖమా అనే ద్వైధీభావంలో మనసు కొట్టుమిట్టాడటం సీతకు తెలిసీ తెలియని స్థితిలో జరిగింది.

ఆగ్రహాన్ని రగిలించుకోవటంలో, జ్వాలను పెద్దది చేయటంలో బాధగా కనపడే సుఖాన్ని పట్టుకోవటం తేలిక కాదు.

రాముడిపై ప్రేమ ఇచ్చే సుఖంలోని బాధను తట్టుకోవటమూ తేలిక కాదు. ఈ రెండింటినీ దాటి రాముడినుంచి విముక్తమయ్యే యత్నం యాతనాభరితమైంది సీతకు.

ఐనా సీత ఆ తపస్సు చేసింది.

కల్లోల కడలి శాంతి సాగరమయ్యేదాకా మథనం సాగించింది.

క్రమంగా ఆ శాంతి సీతను ఆసాంతం ఆవరించింది.

వాల్మీకి అశ్వమేధయాగం చూసి వచ్చేనాటికి సీత మనసు పూర్తిగా తేటపడింది.

రాముని పక్కన యాగం కోసం కూర్చున్నదెవరు? అని అడగొచ్చని వాల్మీకిని చూసిన తర్వాత కూడా సీతకు తోచలేదు.

వాల్మీకి కొన్ని రోజుల తర్వాత సీతకో విషయం చెప్పేందుకు వచ్చాడు.

" రాముడు లవకుశులను స్వీకరించాడు. సీతనూ స్వీకరించాడు. ఐతే సీత వచ్చి నిండు సభలో తను నిర్దోషినని ప్రకటించుకోవాలి".

ఈ మాటలు సీత ప్రశాంతంగానే విన్నది. చిరునవ్వుతోనే విన్నది.

"అంత అవసరం ఉందంటారా నాకు" అని మాత్రం అన్నది.

శాంతస్మిత వదనంతో పిల్లల నుంచి కూడా విముక్తురాలై తానెక్కడ నుంచి వచ్చిందో అక్కడికి ప్రయాణమైంది.

('విముక్త' కథల సంపుటి నుంచి)



# ఈ పాపం పాలకులదే....

వి. పరిమళ

**భార్యల్ని అమ్మేందుకు సిద్ధపడుతున్న భర్తలు**
**వరుసగా మృతి చెందుతున్న పురుషులు**

గ్రామం నడిబొడ్డులో ఓ వ్యక్తి నిలబడ్డాడు. అంతలో కొందరు వ్యక్తులు అతనికి ఎదురయ్యారు. మా బాకీ తీరుస్తావా? చావుదెబ్బలు తింటావా అని హెచ్చరిస్తున్నారు. అయితే బాకీ తీర్చేందుకు మాధవ్ దగ్గర చిల్లిగవ్వలేదు. కట్టుకున్న భార్యా, కన్నబిడ్డలు మినహా అతని వెంట నడిచే వ్యక్తులు ఎవ్వరూ లేరు. అప్పటికే మత్తులో ఉన్న అతను, చేసిన బాకీ కింద పెళ్ళాన్ని అప్పజెప్పేందుకు ప్రయత్నించాడు. నా భార్య రేటు రూ. 500 లు అంటూ ఓ దశలో వేలంపాటకు దిగిన అతను, మద్యం మత్తులో ఊరిజనానికి వినిపించేలా బిగ్గరగా అరవడం మొదలు పెట్టాడు. దీంతో చుట్టూ చేరిన పురుషులు ఆమె వంక ఎగాదిగా చూడటం మొదలు పెట్టారు. దీన్ని తట్టుకోలేని ఈ ఇల్లాలు, భర్త తనను మరో వ్యక్తికి ఎక్కడ అప్పగిస్తాడోనన్న భయంతో, సహనం నశించి పుట్టింటికి వెళ్ళిపోయింది. ఈ సంఘటన జరిగింది మరెక్కడో కాదు.....కృష్ణాజిల్లా జగ్గయ్యపేట లోని షేర్‌మహ్మద్‌పేటలో. నేడు ఆ గ్రామంలో 200 మందికి పైగా వితంతువులు ఉన్నా రంటే అక్కడి పరిస్థితిని అంచనా వేయవచ్చు. పెత్తందారుల కొమ్ము కాస్తూ, కాపుసారాని, బెల్టుషాపుల్ని ప్రోత్సహిస్తున్న ప్రభుత్వం ఓ చేత్తో తమ పసుపు కుంకుమల్ని తుడిచివేస్తూ, మరో చేత్తో వితంతు ఫించన్లు అంటూ ఎరవేస్తోందని గ్రామీణ మహిళలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఒక్కసారి మా గ్రామాన్ని సందర్శించండి. మాగోడు వినండి అని ప్రజాప్రతినిధుల్ని వేడుకుంటున్నారు.

కాపుసారా ఆ గ్రామంలో కుటీర పరిశ్రమలా మారిపోయింది. ఇంట్లో మంచినీళ్ళు ఎలా ఉంటాయో సారా కూడా వారికంతే. పగలల్లా కష్టపడి కూలీనాలీ చేయడం రూపాయి సంపాదించడం ఆ తర్వాత కల్లు దుకాణానికి వెళ్ళడం,పీకలదాకా సారా తిరిగి ఇంటికి చేరుకోవడం. ఓవేళ కూలిపని దొరకకపోతే, ఇంట్లో ఉన్న ఏ సత్తుగిన్నో, స్టీల్ గిన్నో అదీ లేకపోతే పెళ్ళాం చీరనో పట్టుకెళ్ళి కల్లుదుకాణం వాళ్ళకివ్వడం, వాళ్ళు పోసినంత సారాయిని తాగడం, ఇదేం టని ప్రశ్నించిన పెళ్ళాన్ని చితక బాదటం,



ప్రతి ఇంటిలోనూ ఇదే తీరు. 15,16సం.రాల వయసులో ఆడపిల్లలకు పెళ్ళిచేయడం, 20,21 సంవత్సరాల వయస్సు వచ్చేసరికి భర్త చనిపోవడం, చంకలో చంటిబిడ్డతో మహిళల జీవితాలు వీధినపడడం షేర్‌మహ్మద్‌పేటలో పరిపాటిగా మారింది. బహుశా మన రాష్ట్రం మొత్తంమీద అధిక సంఖ్యలో వితంతువులున్న గ్రామం షేర్‌మహ్మద్‌పేట కావచ్చు అనడం అతిశయోక్తికాదు. గ్రామంలోని ఏ గడపతొక్కినా కనిపించేవి అవే ఆవేదనలూ, అదే రోదనలు.

కళావతి, బండిదేవి, ఆదిలక్ష్మి, దుర్గ, కుమారి, వీరకుమారి, మాధవి, చెంచులక్ష్మి, చల్లాఖాసిం, నర్సమ్మ,ధనలక్ష్మి, లింగమ్మ, సుభద్ర, అన్నపూర్ణ, సయ్యద్ చాంద్‌బీ ఇలా చెప్పుకుంటూ పోతే లిస్ట్ చాలానే ఉంటుంది. గ్రామంలో పిల్లలు, మహిళలు, పురుషులు మొత్తం కలిపి 10వేల మంది ఉండగా వారిలో దగ్గర దగ్గర 200మంది వితంతువు లే ఉన్నారు. చిన్నతనంలోనే తండ్రిని పోగొట్టు కున్న పిల్లలైతే కోకొల్లలు. నాటుసారా కారణం గా నేరుగా రోజుకో వ్యక్తి అర్థాంతరంగా తనువు చాలిస్తున్నారు.

కూలీనాలీ చేసుకుని జీవిస్తున్న షేర్‌మహ్మద్‌పేట గ్రామస్తుల జీవితాల్లో కాపుసారా పెద్ద చిచ్చునే పెట్టింది. ఆదాయం కోసం కాపుసారా వ్యాపారం మొదలుపెట్టిన పెత్తందార్లు, మొదట్లో నగదు తీసుకుని సారాపోసేవారు. రానురానూ కాపుసారా కాసేవాళ్ళ సంఖ్య పెరగడంతో పోటీ అధికమైంది. దీంతో అప్పుకింద సారాపోసిన పెత్తందార్లు వాటిని తీర్చమని కుటుంబీకుల్ని వేధించేవారు. అసలుకు చక్రవడ్డీ కలిపి వసూలు చేసేవారు. బండిదేవితో పాటు చాలామందికి ఇదే పరిస్థితి ఎదురైంది. పూలు అమ్మి జీవనం సాగించే బండి శ్రీనివాసరావు మద్యానికి బానిసయ్యాడు. పగలు పూలు అమ్మడం, వచ్చిన డబ్బులతో సారా తాగడం, పూల అమ్మకాలు సరిగ్గా సాగకపోతే అరువుకింద సారాతాగడం అలవాటుగా మారింది. ఈ క్రమంలో కాపుసారా వ్యాపారులకు రూ॥2000 బాకీ పడ్డాడు. దీంతో వ్యాపారస్తులు ఇళ్ళమీద పడి సామాన్లు తీసుకుపోయేందుకు ప్రయత్నించారు. అప్పుకట్టలేనివాడివి ఎందుకు తాగావంటూ నానా యాగీ చేశారు. రూ.2000ల అప్పుకు రూ.2800 చక్రవడ్డీ కట్టి మొత్తం 4,800 రూపాయల్ని అతని భార్య బండిదేవి వద్ద వసూలు చేసారు. వచ్చే అరకొర ఆదాయంలోనే దేవి కడుపుకట్టుకుని ఆ బాకీని తీర్చాల్సివచ్చింది.

కాపుసారా కారణంగా గ్రామంలో సగానికి పైగా మహిళలు వితంతువుల య్యారు. వారిలో చాలామందికి చిన్న చిన్న పిల్లలు ఉన్నారు. కూలి చేసి పొట్టపోసు కుంటున్న మహిళలు చిన్నపిల్లలతో నానా అవస్థలూ పడుతున్నారు. బాధల్లోనుంచి పుట్టిన ఆవేదనతో మహిళలు తిరగబడుతున్నారు. భర్తల ప్రాణాల్ని హరించిన కాపుసారాపై దాడులు చేస్తున్నారు. ప్రస్తుతం గ్రామంలో కాపుసారా లేకపోయినా, బెల్టుషాపులున్నాయి. వాటిని ఎత్తివేయాలని ఎక్సైజ్ అధికారుల్ని కోరాం. అయితే వారు మాత్రం తాము నిమిత్తమాత్రులం అంటున్నారు. ప్రభుత్వం తమకిచ్చిన టార్గెట్‌ని పూర్తి చేయడమే తమ లక్ష్యమంటున్నారు. కాపుసారా, మద్యం వల్ల వితంతువులుగా మారిన ఈ మహిళల్ని ప్రభుత్వమే ఆదుకోవాలి. వారికి ఉపాధి కల్పించాలి. బెల్టుషాపుల్ని, సారాయి దుకాణాల్ని నిర్మూలించే వరకు సాటి మహిళల శ్రేయస్సుకోసం ఉద్యమాన్ని కొనసాగిస్తూనే ఉంటాం.

ఇక కుమారి విషయానికి వస్తే మైనార్టీ తీరకముందే 14వ సంవత్సరంలోనే తల్లిదండ్రులు ఆమెకు పెళ్ళి చేసారు. సారాకు అలవాటు పడ్డ కుమారి భర్త పెళ్ళైన కొద్ది రోజుల్లోనే మృత్యువాత పడ్డాడు. కేవలం ఒక్క భర్తే కాదు,ఆమె కన్నతండ్రి, తోడబుట్టిన సోదరుడు సారాకి బలయ్యారు. 16 ఏళ్ళ వయసున్న కుమారికి 12 నెలల పాప ఉంది. కుమారిదే కాదు కళది కూడా ఇదే పరిస్థితి. కాపుసారా కారణంగానే ఆమె తన కుటుంబాన్ని కోల్పోయింది. భర్త ఉండగా సంపాదించినదంతా సారాయి దుకాణానికే సరిపోయిందని, వచ్చే అరకొర ఆదాయంతో బిడ్డల్ని ఎలా పెంచుకోవాలో అర్థం కావడంలేదని వాపోతోంది.

ఈ క్రమంలోనే జగ్గయ్యపేట ఐద్వాతోపాటు ఇతర మహిళా సంఘాల ఆధ్వర్యంలో గ్రామంలోని మహిళలు వేల సంఖ్యలో సంఘటితమై పోరుబాట పట్టారు. పగలూ, రాత్రి అన్న తేడా లేకుండా సారాయి దుకాణాలపై దాడులు చేసారు. సారాయి రక్కసి బారి నుండి భర్తల ప్రాణాలతోపాటు, తమ మాన ప్రాణాల్ని కాపాడుకునేందుకు తిరగబడ్డ మహిళలు షేర్‌మహ్మద్‌పేట గ్రామంలో సారాయి దుకాణాల్ని నామ రూపాలు లేకుండా చేసారు. పొలాలతోపాటు విభిన్న ప్రాంతాల్లో నిల్వ ఉంచుతున్న కాపు సారాని ధ్వంసం చేసి ఎక్కడికక్కడ నిప్పు పెట్టారు. ఈ క్రమంలో పెత్తందార్ల నుండి బెదిరింపులు ఎదురవుతున్నా మహిళలు లక్ష్యపెట్టడంలేదు.

కాపుసారా పీడ తప్పినా బెల్టుషాపుల బెడద తప్పలేదని మహిళలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. పసుపు కుంకుమలు కోల్పోయి నిర్జీవంగా మారిన మా జీవితాల్ని చూసైనా బెల్టుషాపుల్ని అరికట్టాలని పాలకుల్ని, ప్రజాప్రతినిధుల్ని వేడుకుంటున్నారు. ఈ క్రమంలో సమస్యను ఎక్సైజ్ అధికారుల దృష్టికి తీసుకెళ్ళి న్యాయం కోరగా వారు చేతులెత్తే సారని వాపోతోంది లింగమ్మ. మహిళల పోరాటాల వల్ల ఇప్పటికే లక్షలాది రూపాయల వ్యాపారం కోల్పోయామని, తమకు సూచించిన టార్గెట్‌ని పూర్తిచేయడమే తమ లక్ష్యమని వారు స్పష్టం చేయడంతో మహిళలు తీవ్రంగా కలత చెందుతున్నారు. మహిళల్ని వితంతువులుగా మార్చుతున్న సర్కారు వైఖరిని నిలదీస్తున్నారు. ఓట్లకోసం మాత్రమే వచ్చే ప్రజాప్రతినిధులు తమ సమస్యల్ని పట్టించుకోవడం లేదని మహిళలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

కాపుసారా కారణంగా గ్రామంలో సగానికి పైగా మహిళలు వితంతువుల య్యారు. వారిలో చాలామందికి చిన్న చిన్న పిల్లలు ఉన్నారు. కూలి చేసి పొట్టపోసు కుంటున్న మహిళలు చిన్నపిల్లలతో నానా అవస్థలూ పడుతున్నారు. బాధల్లోనుంచి పుట్టిన ఆవేదనతో మహిళలు తిరగబడుతున్నారు. భర్తల ప్రాణాల్ని హరించిన కాపుసారాపై దాడులు చేస్తున్నారు. ప్రస్తుతం గ్రామంలో కాపుసారా లేకపోయినా, బెల్టుషాపులున్నాయి. వాటిని ఎత్తివేయాలని ఎక్సైజ్ అధికారుల్ని కోరాం. అయితే వారు మాత్రం తాము నిమిత్తమాత్రులం అంటున్నారు. ప్రభుత్వం తమకిచ్చిన టార్గెట్‌ని పూర్తి చేయడమే తమ లక్ష్యమంటున్నారు. కాపుసారా, మద్యం వల్ల వితంతువులుగా మారిన ఈ మహిళల్ని ప్రభుత్వమే ఆదుకోవాలి. వారికి ఉపాధి కల్పించాలి. బెల్టుషాపుల్ని, సారాయి దుకాణాల్ని నిర్మూలించే వరకు సాటి మహిళల శ్రేయస్సుకోసం ఉద్యమాన్ని కొనసాగిస్తూనే ఉంటాం.

## ఆణిముత్యాలు

## మసిబారిన చెక్కిలిపై

-నల్లి ధర్మారావు

పల్లవి: మసిబారిన చెక్కిలిపై జారుతున్న కన్నీరు
మన యెదలో సృష్టించెను ఎన్నో ప్రశ్నల హోరు
అది జారుతున్న కన్నీరు.....ఎన్నో ప్రశ్నల హోరు...
॥మసి॥

1. అనల వేదిక అయింది ఆ సేతు హిమాచలం
భారతి గొంతులో గరళం అసహాయుల అశ్రుజలం
మనిషి హితం కోరేదే మతం అని చెప్పారే!
మనిషి రక్తాన్ని కోరుతున్న మతాన్ని
ఏమంటారు?.....ఏమంటారు?
॥అదిజారు॥

2. రక్తపంకిలం అయిన రామభక్త ఇప్పుడు
ప్రేమ సీమాలన్నింటినీ తగులవేయు చప్పుడు
మత రాజకీయానికి జీవులే పావులా
సమత సహజీవనము వట్టి ఎండ మావులా
॥అదిజారు॥

3. మతంపేర గతం పేరఘోరంగా దగాచేసి
కలిసి ఉన్న బతుకులపై క్రూరంగా నిఘా వేసి
ప్రేమనురాగాల హృదయ మందిరాలు కూల్చి
శ్మశానాల ఏలుతారా? కన్నుల్లో నీరు పేల్చి
॥అదిజారు॥

4. భవిత కొరకు బతుకు కొరకు పరితపించే మిత్రులారా
విషసంస్కృతి వారసులను ప్రతిఘటించ కదలండి!
సమభావన పరిమళాలు విరజిమ్మ భారతాన్ని
నిర్మించే ఘన సేవకు అంకితమౌదాం రండి!!!
॥అదిజారు॥

చైతన్య మానవి పై మీ అభిప్రాయాలు,
సలహాలు, సూచనలు
తెలియచేయాల్సిందిగా కోరుతున్నాము.
మా చిరునామా:
బ్లాక్ నెం. 24, హెచ్ఐజి, ఫేజ్ 2,
1-8-1,బాగ్‌లింగంపల్లి,హైదరాబాద్.
ఫోన్ : 27605845

# గులాబీ దండు కదిలింది

కె. అంజన

గులాబీ రంగు చీర కట్టుకుని..... పొడవాటి కర్ర పట్టుకున్న మహిళలు ఏ ఇంటి ముందైనా కనిపించారు అంటే.... అక్కడ మహిళకు అన్యాయం జరిగిందనే. వారు ఏదైనా ప్రభుత్వ కార్యాలయం ముందు ఆందోళన చేస్తున్నారూ అంటే అక్కడ ఏదో కిరికిరి చోటు చేసుకుందనే. ఈ మహిళలంతా ఉత్తరప్రదేశ్‌లో గులాబీగ్యాంగ్ సభ్యులు. సంపత్‌పాల్ దేవి వీరి నాయకురాలు. గృహహింసను ఎదుర్కొంటున్న మహిళలను ఆదుకోవటానికి, భార్యలను కొట్టే భర్తలను సరిచేయటానికి గులాబీదండు ప్రయత్నిస్తోంది. అయితే ఇందుకు వీరు ఎన్నుకున్న పద్ధతే విభిన్నం. వినూత్నం. భార్యలను కొట్టకూడదని ముందు నోటితో మంచిగా చెప్తారు. విన్నారా సరి. లేకపోతే సామదానబేధ దండోపాయాలు ఉండనే ఉన్నాయి. పేదరికం, పురుషాధిక్యత, వివక్ష, ఖాప్‌పంచాయితీల పట్టు వేళ్ళూనుకున్న రాష్ట్రంలో ఈ గులాబీదండు పుట్టుకు రావటం..... కూసింత ఆశ్చర్యమే! ఆ వివరాలు.....

గులాబీ గ్యాంగ్ గురించి చెప్పుకునే ముందు అది పుట్టిన రాష్ట్రం గురించి, గ్యాంగ్ నాయకురాలు సంపత్‌పాల్ స్వస్థలం బుందేల్‌ఖండ్ గురించి రేఖా మాత్రంగా తెలుసుకుంటే బావుంటుంది. భారతదేశంలోకెల్లా అత్యంత సనాతన భావాలు కలిగిన రాష్ట్రాలలో ఉత్తరప్రదేశ్ ఒకటి. అంతేకాదు అత్యధిక జనాభా కలిగిన రాష్ట్రం కూడా. ఇక అందులో బుందేల్‌ఖండ్ నిరుపేద ప్రాంతం. అక్కడి నేల సాగుకు అంత సారవంతమైనది కాదు. ఇది చాలదన్నట్టు ప్రభుత్వ యంత్రాంగంలో పేరుకుపోయిన అవినీతి. కుల పెద్దల పెత్తనం నల్లటి మబ్బులా ఎల్లవేళలా పట్టి ఉంటుంది. ఇవి చాలదన్నట్టు పితృస్వామిక భావజాలం. దీనికితోడు అంతులేని గృహహింస. కుల విభజనలు, ఆడపిల్లల భ్రూణహత్యలు, బాల కార్మికులు, బాల్య వివాహాలు, వరకట్న వేధింపులు. ఈ నేపథ్యంలో అక్కడి మహిళలు పడే ఇక్కట్లను ఊహించటం పెద్ద కష్టం కాదు.

సంపత్‌పాల్ దేవిది బుందేల్‌ఖండ్‌లోని ఓ నిరుపేద కుటుంబమే. గొర్రెలు, బర్రెలు, మేపుతూ బాల్యం గడిపింది. మొదట్లో ఆమె అన్నలు, తమ్ముళ్ళు మాత్రమే పాఠశాలకు వెళ్ళేవారు. తనకు కూడా చదువుకోవాలని ఎంతో ఆశగా ఉండేది. అమ్మా నాన్నా ఆమెకు ఆ అవకాశం ఇవ్వలేదు. దాంతో అన్నదమ్ముల దగ్గర అక్షరాలు నేర్చుకున్నది. అంతటితో ఆగలా! తిరుగుబాటు మనస్తత్వం పసితనం నుంచే ఉన్నట్టుంది. మట్టిగోడలమీద, దుమ్ము పట్టిన రోడ్లమీద అక్షరాలు రాయడం మొదలు పెట్టింది నిరసనగా. ఈ గొడవ పడలేక స్కూలుకు పంపారు. అదీ మూడు నాళ్ళ ముచ్చటే అయ్యింది. పన్నెండేళ్ళకే బడి మాన్పించి ఐస్‌క్రీమ్ అమ్ముకునే అతనితో పెళ్ళి చేసేశారు. ఏడాది తిరిగేలోపు ఒక బిడ్డకు జన్మనిచ్చింది. అప్పటికి సంపత్ వయసు పదమూడేళ్ళే. తరువాత కొద్ది సంవత్సరాల కాలంలోనే ఐదుగురి పిల్లల తల్లయ్యింది. ప్రభుత్వ ఆరోగ్య విభాగంలోనూ పనిచేసింది. కానీ తన కోసం తను కాక ఇతరుల కోసం కూడా పనిచేయాలన్న మొలక మొలవడంతో ఆ ఉద్యోగానికి రాజీనామా చేసింది.




ఓరోజు ఒక భర్త తన భార్యను చావగొడుతుండడం చూసింది సంపత్. అతణ్ని ఆపమని అడిగింది. ఆపకపోగా ఆమెను కూడా చెడ్డగా తిట్టాడు. మరునాడు మరో ఐదుగురు గులాబీదళ సభ్యులను తీసుకుని ఆ ఇంటికెళ్ళింది. గులాబీదళ సభ్యుల దగ్గర కర్రలు ఉంటాయన్న విషయం తెలిసిందేకదా. వాటికి పనిచెప్పారు. అతగాడి నోటి నుంచి శబ్దం వస్తే ఒట్టు. ఆ వార్త గ్రామంలో దావానంలా వ్యాపించింది. ఇక అప్పటి నుంచి సంపత్‌ను కలిసి తమ బాధలు చెప్పుకునేవారి సంఖ్య క్రమేణా పెరిగింది. గ్రామంలోని మహిళలను సంఘటితం చేసి సమావేశాలు పెట్టసాగింది. భర్తలు పెట్టే

**సైకిల్ మీద వెళుతూ చెట్ల కింద మీటింగులు పెడుతూ కొత్త సభ్యులను ఆకట్టుకుంది సంపత్. ఇప్పుడు గులాబీ దళ సభ్యుల సంఖ్య బాగా పెరుగుతోంది. ఈ క్రమంలో ఆమె అనేక కేసులు సైతం ఎదుర్కోవాల్సి వచ్చింది. అందుకు కారణాలు ఏంటయా అంటే.... బాధిత మహిళలతో సమావేశమవ్వడం, గృహహింసను భరించలేక మహిళలు కేసు పెట్టబోతే పోలీసు అధికారులు తిరస్కరించి నందుకు గొడవచేయటం, చవక దుకాణాల్లో నిత్యావసర సరుకులను సక్రమంగా ఇవ్వనందుకు నిలదీయటం....ఇవీ.**

బాధలు పడలేక ఇళ్ళనుంచి బయటకు వచ్చేసిన వారు, భర్తలు రెండోపెళ్ళి చేసుకుని నిర్లక్ష్యం చేసిన వారు సంపత్‌ను కలుసుకునేవారు. వారందరి కోసం ఏదైనా చేయాలనుకున్న సంపత్ 2006లో గులాబీ గ్యాంగ్‌ను ఏర్పాటు చేసింది. యూనిఫారమ్‌గా గులాబీ చీరను కూడా ఎంపిక చేసింది.

సైకిల్ మీద వెళుతూ చెట్ల కింద మీటింగులు పెడుతూ కొత్త సభ్యులను ఆకట్టుకుంది సంపత్. ఇప్పుడు గులాబీ దళ సభ్యుల సంఖ్య బాగా పెరుగుతోంది. ఈ క్రమంలో ఆమె అనేక కేసులు సైతం ఎదుర్కోవాల్సి వచ్చింది. అందుకు కారణాలు ఏంటయా అంటే.... బాధిత మహిళలతో సమావేశమవ్వడం, గృహహింసను భరించలేక మహిళలు కేసు పెట్టబోతే పోలీసు అధికారులు తిరస్కరించి నందుకు గొడవచేయటం, చవక దుకాణాల్లో నిత్యావసర సరుకులను సక్రమంగా ఇవ్వనందుకు నిలదీయటం....ఇవీ.

ఏదైనా ఘటన గురించి విన్నప్పుడు, బాధితులకు సహాయం అందించాల్సి ఉందని భావించినప్పుడు గులాబీ గ్యాంగ్ సభ్యులు ముందుగా ప్రణాళిక సిద్ధం చేసుకుంటారు. మొదట పోలీస్ స్టేషన్‌కు వెళ్లి సాయం చేయమని అడుగుతారు. అనేక సందర్భాల్లో అటునుంచి సాయం అందదు. దాంతో వారే రంగంలోకి దిగుతారు. ముందు భార్యను కొట్టకూడదని భర్తకు చెపుతారు. అతను వింటాడా సరి. లేకపోతే భార్యను గులాబీ గ్యాంగ్‌లో చేరమని అడుగుతారు. ఎందుకో తెల్సా! అతగాడికి బడితపూజ చేయడానికి.

ప్రస్తుతానికి ఉత్తరప్రదేశ్‌లోనే లక్షా నలభై వేల మంది గులాబీ దళ సభ్యులున్నారు. పురుష మద్దతుదారులూ ఉన్నారు. చవక దుకాణాల్లో బిపిఎల్ కుటుంబాలకు ఆహార ధాన్యాలను ఇవ్వనప్పుడు, వింతు పెన్షన్లు, జన్మ నమోదు పత్రాలు సరిగా ఇవ్వనప్పుడు, బాలికలను, మహిళలను వేధించినప్పుడు గులాబీ దళం ముందు నిలబడుతుంది. పోరాడుతుంది. గులాబీ దళం అధికశాతం మహిళా హక్కుల కోసం పోరాడినట్టు కనిపించినా మొత్తంమీద పోరాటం మాత్రం మానవహక్కుల కోసమే. బలహీనుల హక్కుల కోసమే.

## నా వెనుక దండు ఉంది

**-సంపత్‌పాల్ దేవి**

“ఓసారి అవినీతిపరులైన అధికారులు పంపిన గూండాలు వచ్చి నన్ను కాల్చి చంపుతామని బెదిరించారు. అప్పుడు గులాబీ దళ మహిళలు అండగా నిలిచి ఇటుకరాళ్ళు విసరడంతో పారిపోయారు. మరెప్పుడూ రాలేదు. కానీ ఎక్కువ శాతం ఒంటరిగానే ప్రయాణం చేస్తుంటాను. ఎవరికీ భయపడను, గులాబీదండు నాతోఉంది. అదే కొండంత అండ. బయటకు వెళ్ళిన ప్రతిసారి మా కుటుంబం అండగా లేదు. కానీ నా భర్తకు విషయం అంతా వివరించడంతో నన్ను అర్థం చేసుకున్నాడు. కానీ అదంతా చేయడం సులభం కాదు. నా దగ్గర దబ్బులేదు. నేను ప్రతి చోటికీ పాత సైకిల్ మీదే వెళతాను. మా మద్దతుదారులు కొందరు చిన్న చిన్న మొత్తాలు ఇస్తుంటారు. అలాగే స్థానిక సంస్థలు, విదేశీ సంస్థల నుంచి మద్దతు వస్తే బావుంటుంది. కింది స్థాయిలో నేను పనిచేస్తుంటాను గనుక పేద గ్రామీణులకు చిన్నతరహా పరిశ్రమలు ఏర్పాటు చేస్తే బావుంటుందనుకుంటున్నాను. మనకు మెరికల్లాంటి యువత, మహిళలకు కొదవలేదు. వారితో ఎరువులు, కొవ్వొత్తులు, పచ్చళ్ళు, ఆయుర్వేద మందులు తయారు చేయించవచ్చు. దాంతో వారికి చక్కటి జీవిక లభిస్తుంది. నాకే కనుక డబ్బు అందితే మహిళల కోసం కుట్టు కేంద్రాలు ఏర్పాటు చేస్తాను. దాంతో వారు వారి కుటుంబాలకు అండగా నిలబడే వీలు కలుగుతుంది. గులాబీ దండుకు భవిష్యత్తు తప్పకుండా బావుంటుంది. ఇది ప్రజా ఉద్యమం. మున్ముందు మరింత విస్తరిస్తుంది. స్థానిక పరిపాలక సంస్థల నుంచి కూడా మద్దతు లభిస్తున్నది. గ్రామాల్లో మహిళలపై ఎన్నో భారాలున్నాయి. వాళ్ళు చదువు కోవటానికి లేదు. బాల్యంలోనే పెళ్ళి చేస్తారు. డబ్బు కోసమే ఇదంతా. అందుకే వారు చదువుకుని వీటినుండి బయటపడాలి. స్వతంత్రంగా బ్రతకగలగటం నేర్చుకోవాలి. గులాబీ రంగునే ఎందుకు ఎంచుకున్నామంటే..... ఇప్పటికే రాజకీయ పార్టీలు అనేక రంగులను తమ పార్టీ పతాకాల్లో ఉపయోగించు కుంటున్నాయి. పైగా ప్రదర్శనలకు వెళ్ళినప్పుడు గ్రూపు సభ్యులు తప్పిపోకుండా ఈ రంగు ఎంతగానో సహకరిస్తుంది”.



**సంపత్‌పాల్ దేవిది బుందేల్‌ఖండ్ లోని ఓ నిరుపేద కుటుంబమే. గొర్రెలు, బర్రెలు, మేపుతూ బాల్యం గడిపింది. మొదట్లో ఆమె అన్నలు, తమ్ముళ్ళు మాత్రమే పాఠశాలకు వెళ్ళేవారు. తనకు కూడా చదువుకోవాలని ఎంతో ఆశగా ఉండేది. అమ్మా నాన్నా ఆమెకు ఆ అవకాశం ఇవ్వలేదు. దాంతో అన్నదమ్ముల దగ్గర అక్షరాలు నేర్చుకున్నది. అంతటితో ఆగలా! తిరుగుబాటు మనస్తత్వం పసితనం నుంచే ఉన్నట్టుంది. మట్టిగోడలమీద, దుమ్ము పట్టిన రోడ్లమీద అక్షరాలు రాయడం మొదలు పెట్టింది నిరసనగా.**

# బ్యాంకులు - ఎస్‌హెచ్‌జీల మధ్య బంధం బలపడాలి
# మైక్రోఫైనాన్స్ సంస్థలకు కళ్ళెం వేయాలి.

సుధా సుందర్ రామన్

స్వయం సహాయక బృందాలకు (ఎస్‌హెచ్‌జి) రుణాలిచ్చేందుకు అర్బన్ కో ఆపరేటివ్ బ్యాంకులకు అనుమతించాలని భారతీయ రిజర్వ్ బ్యాంకు (ఆర్‌బిఐ) ఇటీవల తీసుకున్న నిర్ణయం స్వాగతించదగినదే. అయితే ఇది మాత్రమే చాలదు. చేయాల్సింది ఇంకా చాలా వుంది. ఆర్‌బిఐ గతంలో తీసుకున్న కొన్ని చర్యలను బ్యాంకుల లాభదాయకత కోసం కుదించేశారు. ఈ పరిస్థితిని చక్కదిద్దేందుకు నిర్దిష్టంగా కొన్ని చర్యలు చేపట్టాల్సిన అవసరం వుంది.

వీటిలో మొదటిది, పేద మహిళలకు రుణాలు అందించే యంత్రాంగాన్ని పటిష్టపరచడం, ప్రభుత్వ రంగ బ్యాంకులు తాము ఇచ్చే రుణాల్లో కనీసం 10శాతం రుణాలను మహిళలకు కేటాయించాలని ప్రభుత్వం ఇదివరకే సూచించినా, 2010 సంవత్సరంలో మొత్తం బ్యాంకు రుణాల్లో కేవలం 3 శాతం రుణాలు మాత్రమే అవి వెచ్చించాయి. బలహీన వర్గాల పరిధిలోని మహిళలను ప్రత్యేక కేటగిరిగా గుర్తించి వారిని రుణ ప్రాధాన్యతా రంగం (పిఎస్‌ఎల్) కిందకు తీసుకురావాల్సిన అవసరం వుంది. మరో ముఖ్యమైన అంశమేమిటంటే ఇతర ప్రభుత్వ పథకాల్లో భాగంగా ఇచ్చే మొత్తం బ్యాంకు రుణాలలో 30శాతానికి తగ్గకుండా మహిళా కంపోనెంట్ ప్లాన్ కింద వీరికి చూడాలి. ఇందుకు గాను ఒక పర్యవేక్షణా యంత్రాం గాన్ని ఏర్పాటు చేయాల్సిన అవసరం వుంది. భూమిలేని కూలీలు, చేతివృత్తిదారులు, ఎస్సీ, ఎస్టీలు, స్వర్ణజయంతి సహారి రోజ్‌గార్ యోజన లబ్దిదారులు మున్నగువారంతా ఈ తరగతులకు చెందిన మహిళలేనన్న విషయం గుర్తించాలి.

రెండవది. మహిళా స్వయం సహాయక సంఘాలకు, బ్యాంకులకు మధ్య అనుసంధానాన్ని మరింత పటిష్టపరచాలి. నాబార్డ్ ఇచ్చిన సమాచారాన్ని బట్టి ఎన్‌హెచ్‌జిలకు అందించిన రుణాల వృద్ధిరేటు 2009-10లో కేవలం 17.9 శాతం మాత్రమే ఉన్నట్లు స్పష్టమవుతుంది. ఇది అంతకుముందుఏడాది 38.5శాతంగా ఉండేది. ఎస్‌హెచ్‌జి మహిళలకు చిన్న రుణాలను అందుబాటులో ఉంచినట్లయితే వారు వడ్డీ వ్యాపారుల కబంధ హస్తాల్లోంచి బయటపడతారు. ఎన్నిసార్లు మొత్తుకున్నా బ్యాంకుల నుంచి వీరికి రుణాలు అందటం నేటికీ గగనంగానే ఉంది. పొదుపుతో ముడిపడిన బ్యాంకు రుణాల మంజూరుకు సంబంధించి నాబార్డు కొన్ని మార్గదర్శకాలను జారీచేసింది. అందులో పొదుపు రుణాల నిష్పత్తి 1.4గా ఉండేలా (కొన్ని సందర్భాల్లో దీనికి మించి ఉన్నాయి). చూడాలని చెప్పినా వాటిని బ్యాంకులేవీ పాటించడం లేదన్న విషయం మా దృష్టికి వచ్చింది.

మూడవది. కీలకమైన అంశం ఏమిటంటే బ్యాంకులు వసూలు చేసే వడ్డీరేట్లు ప్రస్తుతం ఎస్‌హెచ్‌జిలకు లేదా ఆ గ్రూపు సభ్యులకు ఇస్తున్న రుణాలపై వడ్డీరేట్లు బ్యాంకుల విచక్షణకే వదిలేశారు. ప్రస్తుతం వాణిజ్య బ్యాంకులు వసూలు చేసే వడ్డీరేట్లు 9.5శాతం నుంచి 10.75 శాతం దాకా ఉంటున్నాయి. వేగంగా పెరుగుతున్న ద్రవ్యోల్బణం రీత్యా ఇవి మరింత పెరిగే అవకాశముంది. ఎస్‌హెచ్‌జిలకు ఇచ్చే రుణాలపై బ్యాంకులు ఇప్పటికే అధిక వడ్డీని గుంజుతున్నాయి. మున్ముందు ఈ వడ్డీరేట్లను అవి మరింతగా పెంచినా ఆశ్చర్యపోనక్కర్లేదు. ఇది పేద మహిళలకు హానికరంగా పరిణమించనున్నది. ప్రత్యేకంగా గుర్తించిన కొన్ని అల్పాదాయ వర్గాలకు వడ్డీలో రాయితీలతో సాయం అందించేందుకుద్దేశించిన పథకాలను అన్ని ఎస్‌హెచ్‌జిలకు వర్తింపచేయాలి. సంవత్స రానికి 4శాతం వడ్డీ రేటుపై రుణాలను వీటికి తప్పనిసరిగా అందించేలా చూడాలి.

నాల్గవది : బ్యాంకులు స్వల్ప వడ్డీరేట్లకు రుణాలు సరిగా ఇవ్వకపోవడంతో మహిళలు మైక్రో ఫైనాన్స్ సంస్థల జాయింట్ లయబిలిటి గ్రూపుల్లోకి బలవంతంగా నెట్టబడుతున్నారు. ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, ఢిల్లీ, తమిళనాడు, కర్నాటక, పశ్చిమబెంగాల్ తదితర రాష్ట్రాలలో అనుభవాలను పరిశీలిస్తే ఈ మైక్రో ఫైనాన్స్ సంస్థలు పేద మహిళలను పణంగా పెట్టి విపరీతమైన వడ్డీరేట్లతో దండిగా లాభాలు గడించాయి. రుణ బకాయిలను రాబట్టడానికి రకరకాల నిర్బంధ పద్దతులను అనుసరించాయి.

స్వయం సహాయక బృందాలకు రుణాలిచ్చే మైక్రోఫనాన్స్ సంస్థలకు బ్యాంకు లిచ్చే రుణాలను కూడా రుణ ప్రాధాన్యతా రంగం (పిఎస్‌ఎల్) కింద ఇచ్చినట్లుగానే పరిగణించవచ్చున్న నిబంధనను బ్యాంకులు, మైక్రోఫైనాన్స్ సంస్థలు ఒక మంచి అవకాశంగా తీసుకున్నాయి. దీనిని ఆసరాగా చేసుకుని బ్యాంకులు రుణాల మంజూరులో స్వయం సహాయక బృందాలను పక్కనపెట్టి ఈ మైక్రో ఫైనాన్స్ సంస్థలకివ్వడం మొదలెట్టాయి. ఈ విధంగా 2009-10లో బ్యాంకులు రూ.8062కోట్ల మేర రుణాలను మైక్రోఫైనాన్స్ సంస్థలకు ఇచ్చాయి. ఇది అంతకు ముందు సంవత్సరంతో పోల్చితే

రెండు రెట్లు ఎక్కువ. అదే సమయంలో స్వయం సహాయక బృందాలకు ఈకాలంలో బ్యాంకులిచ్చిన రుణాలు ఆ మేరకు తగ్గాయి.

మైక్రోఫైనాన్స్ సంస్థలు వసూలు చేసే వడ్డీరేట్లును వాటి దయాదాక్షిణ్యాలకు వదిలేసి ఆర్‌బిఐ నాన్ బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీల గుర్తింపునకు కొన్ని నిబంధనలు విధించేందుకు తన నియంత్రణాధికారాలను ఉపయోగించింది. అయితే వడ్డీ రేటుపై పరిమితి, మార్జిన్ పరిమితి, రుణాన్ని పొందేందుకు ఆదాయ పరిమితి వంటి విషయాల దగ్గరకొచ్చే సరికి అది ఎప్పటిలానే వ్యవహరించింది. గరిష్ఠంగా 26శాతం వార్షిక వడ్డీ రేటు విధించుకునేందుకు అది అవకాశం కల్పించింది. ఈ వడ్డీ రేటు చాలా ఎక్కువ. మైక్రో ఫైనాన్స్ సంస్థలు వడ్డీరేట్లలో తమ నిర్వహణా వ్యయాన్ని 2శాతం విధించినా అది అవసరమైన దానికన్నా ఎక్కువేనని నిపుణులు పేర్కొన్నారు. ఈ రీత్యా లబ్ధిదారుల నుంచి వసూలు చేసే వార్షిక మార్జిన్‌ను ఎట్టి పరిస్థితుల్లోనూ 4శాతం మించకుండా చూడాలని మేము కోరుతున్నాము.

మైక్రోఫైనాన్స్ సంస్థలుగా అవతారమెత్తిన నాన్ బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీలకు ఇచ్చిన రుణ ప్రాధాన్యత ప్రతిపత్తిని ఉపసంహరించుకోవాల్సిన అవసర ముందని కూడా మేము దృఢంగా భావిస్తున్నాము. దేశంలో చాలా ప్రాంతాల్లో మైక్రోఫైనాన్స్ సంస్థలు నిర్వహిస్తున్న కార్యకలాపాలు చూస్తే వడ్డీ వ్యాపారులకన్నా అవి ఏమాత్రమూ తీసిపోవని అర్థమవుతుంది. ఎంతసేపూ లాభాలు చూసుకోవడమే తప్ప అభివృద్ధిపై కొంచెం కూడా ధ్యాస ఉండడం లేదు. స్వయం సహాయక బృందాలకు బ్యాంకులు ఇచ్చే రుణాలనే ప్రాధాన్యత రంగం రుణాల కింద పరిగణించాలి తప్ప మైక్రో ఫైనాన్స్ సంస్థలకు బ్యాంకులిచ్చే రుణాలను వీటిలో కలవరాదన్నదే మా వాదన. మాలెగావ్ కమిటీ నివేదికలో దీనిని ప్రోత్సహిస్తున్నది.

ఈ పరిస్థితుల్లో మైక్రోఫైనాన్స్ సంస్థలకు ఉమ్మడి నియంత్రణ వ్యవస్థనొకదానిని ఏర్పాటు చేయాల్సిన అవసరం వుంది. ప్రస్తుతం వివిధ రూపాల్లో ఈ మైక్రోఫైనాన్స్ సంస్థలు పనిచేస్తున్నాయి. లాభాలే పరమార్థంగా పనిచేసేవి. లాభ నష్టాలతో నిమిత్తం లేకుండా పనిచేసేవి ఈ రెండు రకాల సంస్థలూ ట్రస్టులు, సొసైటీలు, కో-ఆపరేటివ్స్, నాన్ ప్రాఫిట్ నాన్ బ్యాంకింగ్ ఫైనాన్స్ కంపెనీల చట్టంలో సెక్షన్ 25 కింద నేడు ఉనికిలో ఉన్నాయి. లాభార్జనే ధ్యేయంగా కలిగిన మైక్రోఫైనాన్స్ సంస్థలు నాన్ బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీలుగా ఆర్‌బిఐవద్ద రిజిస్టరు చేసుకుంటున్నాయి. ఈ సొసైటీలకు, ట్రస్టులకు తగినన్ని నిధులు సమకూరిన దాఖలాలు కానీ, తగిన ముందస్తు జాగ్రత్తలు కానీ ఏమీ ఉన్నట్లు లేవు. పైగా వీటి వడ్డీ రేట్లపై కానీ, రుణ బకాయిలను తిరిగి రాబట్టేందుకు అవి అనుసరించే పద్ధతులపై కానీ ఎలాంటి పర్యవేక్షణ ఉండడంలేదు. వీటన్నిటి రీత్యా రుణ బకాయిల వసూళ్ళ సందర్భంగా వేధింపులు, ఒత్తిళ్ళు, వంటివాటికి పాల్పడే సంస్థలను దండించాలి. రుణాలు ఇవ్వడానికి ముందు డిపాజిట్లు వసూలు చేయడం, రుణం తీసుకునేవారు బీమా ప్రీమియం తప్పనిసరిగా కట్టాలనడం వంటి అనైతిక పద్ధతులను ఆపాలి.

ఆర్‌బిఐ గరవ్నరుతో జరిపిన చర్చల సందర్భంగా ఐద్వా ప్రతినిధి బృందం మరికొన్ని ముఖ్యమైన అంశాలను లేవనెత్తింది. ఆర్‌బిఐ ఆదేశాలు జారీచేసినా వాణిజ్య బ్యాంకుల నుంచి స్వయం సహాయక బృందాలు నేటికి సరిగా రుణాలందక అనేక ఇబ్బందులు పడుతున్నాయి. రుణాల మంజూరులో బ్యాంకులు నెలల తరబడి జాప్యం చేస్తున్నాయి. కర్నాటకలో ఎస్‌హెచ్‌జీల కు రుణాలివ్వడానికి మైక్రోఫైనాన్స్ సంస్థల నుంచి సంతకాలు చేయించుకుని రావాలని బ్యాంకులు మెలిక పెట్టాయి. మహిళలకు ఇచ్చే రుణాలపై వడ్డీ రేట్లు కూడా భరించలేని విధంగా ఉన్నాయి. దాదాపు 90శాతం రుణాలు ఇటువంటివే. ఎస్‌హెచ్‌జీలకు రుణాలు ఇచ్చే వాణిజ్య బ్యాంకులు, సహకార బ్యాంకులకు ప్రోత్సాహకాలు ఉండాలి. బ్యాంకులకు ఎస్‌హెచ్‌జీలకు మధ్య ఈ అనుసంధానం లేని ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, తమిళనాడు, వంటి రాష్ట్రాల్లో ఈ రుణాలపై అధిక వడ్డీలను మహిళలు చెల్లించలేని పరిస్థితి వచ్చింది. ఈ పరిస్థితుల్లో వారిపై మైక్రో ఫైనాన్స్ సంస్థ ఆగడాలు పెరుగు తున్నాయి. అవి పెట్టే వేదింపులు, ఒత్తిళ్ళకు తట్టుకోలేక కొందరు మహిళలు ఆత్మహత్య చేసుకున్నారు. మహిళలకు తక్కువ వడ్డీపై చిన్న రుణాలను ఎలాంటి జాప్యం లేకుండా సులువుగా అందించేట్లు చూడాలి. బ్యాంకుల మొత్తం రుణాల్లో కనీసం పది శాతం రుణాలను ఎస్‌హెచ్‌జీలకు ఇవ్వాలన్న ఆర్‌బిఐ సూచనను బ్యాంకులు ఇంతవరకు నెరవేర్చిన పాపాన పోలేదు.

బ్యాంకుల నుండి రుణాలు పొందడంలో ఎస్‌హెచ్‌జిలకు ఎటువంటి చిక్కులు ఎదురుకాకుండా చూసేందుకు ఆర్‌బిఐ తక్షణమే తగు చర్యలు చేపట్టాలి. రుణ బకాయిలను తిరిగి రాబట్టడానికి మైక్రోఫైనాన్స్ సంస్థలు నిర్భంధ పద్దతులు అనుసరిస్తూ వారిని ఇబ్బందుల పాలు చేస్తున్నాయి. ఇటువంటి తప్పుడు పద్దతులను అరికట్టాలి. మైక్రో ఫైనాన్స్ సంస్థలు బలవంతపు వసూళ్ళకు పాల్పడకుండా నివారించేందుకు ఒక నిఘా సంస్థను కూడా ఏర్పాటు చేయాల్సిన అవసరం వుంది. ప్రాధాన్యతా రంగ రుణాల (పిఎస్ఎల్)లను మహిళలకు తప్పని సరిగా వర్తింప చేయాల్సిన అవసరం వుంది. బ్యాంకులు నాన్ బ్యాంకింగ్ ఫైనాన్స్ కంపెనీలకు రుణాలు ఇచ్చే అవుట్‌సోర్స్ విధానానికి బదులు ఎస్‌హెచ్‌జిలకు ఇచ్చేందుకు బ్యాంకులు చొరవ చూపేలా ఆర్‌బిఐ తగు మార్గదర్శకాలు జారీ చేయాలి.

*(ఐద్వా ఆర్‌బిఐ గవర్నర్‌కు ఇటీవల సమర్పించిన పత్రం ఆధారంగా)*

*అవగాహన సందర్భం...*

# స్త్రీలెప్పుడూ స్నేహావారధులే!

డా॥ శిలాలోలిత

స్త్రీలు స్నేహితులుగా జీవించాలంటే ఏం చెయ్యాలి? అని ఆలోచిస్తే-స్త్రీలు స్నేహ స్వభావులే అని తెలిసిపోతుంది. మరింత లోతుగా వెళ్ళి స్త్రీలను ఎందుకు విడదీస్తున్నారని ప్రశ్నించుకుంటే, విషయం స్పష్టంగా అర్థమైపోతుంది. ఈ మధ్యకాలంలో ఆంధ్రజ్యోతిలో వచ్చిన జి.వెంకటకృష్ణ రాసిన 'శయ్యాగారం' అనే కథ చదివాను. కథను చదవటం ఆపినా కథ నన్ను వీడిపోలేదు. ఆ కథలో అత్త, కొడుకు, కోడలు ఈ మూడు పాత్రలు ఉంటాయి. కొడుకూ కోడలు నేటి తరానికి ప్రతినిధులు. మూఢాచారాలు, మూఢ భక్తి పట్ల నమ్మకం లేనివాళ్ళు. ఇష్టపడి, కట్నాల బారిన పడకుండా ఒక్కటైనవాళ్ళు. తల్లి కొడుకు మీద పంచప్రాణాలూ పెట్టుకుని కొడుకే లోకం, జీవితంగా బతికింది. అనేక ఆర్థిక కష్టాలను అధిగమించింది. వీళ్ళు ముగ్గుర్ని విడివిడిగా చూస్తే మంచి వ్యక్తులే. కాని ఆధిపత్యాల, అధికారాల పోరులో తమకు తెలీయకుండానే జారిపోయారు. తల్లీ, భార్యల మధ్య సంయమనానికీ, స్నేహానికి అతను ప్రయత్నించలేదు. అతిమంచివాడు కావడం వల్ల తనలో తాను బాధపడ్డాడేకానీ, విడమర్చిచెప్పలేకపోయాడు. కోడలు చాలా ఎడ్జెస్ట్ అవడానికి, భరించడానికీ సిద్ధపడిందే కానీ ఆమెవల్ల కాలేదు. వ్యక్తిత్వహీనంగా బతకలేననుకుంది. ఇన్నాళ్ళూ తనే లోకంగా బతికిన కొడుకు, కోడలు మాట వింటున్నాడని, తనని నిర్లక్ష్యం చేస్తున్నాడని అనుకుంది. అప్పటి వరకూ నెమ్మది స్వభావురాలైన ఆమె-గందరగోళంలో పడి, చెప్పేవాళ్ళు లేక, తనేదనుకుందో అదే కరక్టనుకొని, తనకు తానుగా ఒక దుర్మార్గ స్వభావాన్ని పులుముకుని మారిపోతుంది. వివరీతమైన కోపంతో, బీపీతో చివరికి పక్షవాతానికి గురౌతుంది. అప్పుడు కూడా కొడుకు తప్ప ఎవ్వరూ తనను ముట్టుకోవద్దని పట్టుదలకు పోయి ప్రాణాలు తీసుకుంటుంది. తనే తల్లికి అన్ని సేవలూ చేస్తుంటాడతను. చివరికి ఆ తల్లికి తమ మధ్య గొడవలన్నింటికీ కారణం కొడుకేనని, మగవాడేనని అర్థమై-ఓరోజు కొడుకుతో నువ్వేరా మన జీవితాలిలా కావడానికి కారణం అంటుంది.

అత్తా, కోడళ్ళ గొడవలకి మూలమేమిటో మనని ఆలోచింపచేస్తుందీ కథ. పాతికేళ్ళు పెంచిన తన శరీరపు ముక్కపై



ఆ తల్లికి ఎంత మమకారముంటుందో అర్థం చేసుకోవాలి. నామాటే వినాలి. నేనే కరక్ట్, నేనా? తల్లా? ఎవరెక్కువ? ఎవరో ఒకరే నీకు-ఇలాంటి మాటలు, ఊహల జోలికెళ్ళకూడదు కోడలు. తనుకూడా ఇంకో ఇంటిని వదిలేసి, కొత్త ఇంటికి వచ్చింది. అంతా కొత్త. అతడిని అర్థం చేసుకోవడంలో ఎంత సహనం, ప్రేమ, ఓర్పు కలిగి ఉంటుందో అలానే అత్త విషయంలో కూడా వుండాలి. అప్పటి వరకూ కొడుక్కి చేస్తున్న ప్రేమపూర్వకమైన చిన్న చిన్న పనుల్ని అంతే ఇష్టంగా కోడలికి అప్పచెప్పగలగాలి. పెంచడం వరకే తల్లి బాధ్యత. పెరిగిన పిల్లవాడు భార్యతో సన్నిహితంగా మెలగడమనేది ఎంతో సహజమైన చర్య. వాళ్ళలా అన్యోన్యంగా ఉండటమే జీవితం. ఇక్కడ ఎక్కువ తక్కువలనలే లేవు. తను ఆధిపత్యం చెలాయించడం ద్వారా దూరం పెరిగిపోతుందనే చిన్న విచక్షణ ఉంటే సమస్యలింత జటిలం కావు. కోడలంటే తనింటికి వచ్చిన కొత్త కూతురులాంటిదనే ప్రేమ ఉన్నప్పుడు ఏవీ సమస్యలు కావు.

మన సమాజం చేసిన నిర్ణాయక సూత్రాలలో 'అత్తా కోడళ్ళకు పడదు', 'స్త్రీకి స్త్రీయే శత్రువు', అత్తంటే ఆరళ్ళు పెట్టేదే, కోడలంటే కొరివి దెయ్యమే'- ఇలాంటివెన్నో.

ఇలాంటివి వినీ వినీ చూసీ చూసీ నిజమే కాబోలు అనుకునే స్థితిలోనే చాలామంది ఉన్నారు. కానీ పైవేవీ నిజాలు కావు.

ఒకరినొకరు అర్థం చేసుకోవడంలోనే అసలు విషయముంది. ఎవరి వ్యక్తిత్వాలను వాళ్ళు నిలుపుకుంటూ, అవసరమైనప్పుడల్లా రాజీపడుతూ, ఆ రాజీపడటాలు శాంతి కోసమేననే నిజాల్ని తెలుసుకుంటూ, ఒకరిపట్ల ఒకరు ప్రేమతో, గౌరవంతో సహకారంతో కలిసి జీవించాలి. వారి సహజీవన ప్రయాణంలో కుటుంబ సభ్యులుకూడా తోటి ప్రయాణీకులే. అహంకారాలు, పట్టుదలలు, మనుషుల్ని విడదీస్తాయేకానీ కలపవు. ప్రేమ మూర్తులైన ఇద్దరు స్త్రీల మధ్యన వచ్చుగడ్డిని వేయకుండా, ఎంతో తెలివితేటలతో సమర్థవంతంగా వారిమధ్య స్నేహపు వంతెనను నిర్మించడంలో కొడుకు పాత్ర ఎంతో కీలకమైంది. 'శయ్యాగారం' కథలోలా విషాదాంతం కాకుండా మన జీవితాలను మనం పునరాలోచించుకుని హాయిగా జీవించడంలోనే జీవన సౌందర్యముంది.

చట్టాలు

# వృద్ధులు-తల్లిదండ్రులు-హక్కులు

### తల్లి తండ్రులను పోషించకపోవటం చట్ట వ్యతిరేకం

పొత్తూరి సురేష్ కుమార్



**త**ల్లి తండ్రులు, వృద్ధులకు పోషణ మరియు సంక్షేమం కొరకు 2007లో ప్రభుత్వం చట్టం తెచ్చింది. ఈ చట్టం ప్రకారం తమను తాము పోషించుకోలేని తల్లితండ్రులు, తాతలు, మామ్మలు, పిల్లల దగ్గర నుంచి పోషణ పొందేందుకు హక్కు కలిగి ఉంటారు. అయితే పిల్లలు మేజర్లు అయిఉండాలి. 60 సంవత్సరాలు, అంతకంటే ఎక్కువ వయసు ఉన్నవారిని ఈ చట్టం ప్రకారం సీనియర్ సిటిజన్స్ లేదా వృద్ధులు అంటారు.

పిల్లలు లేని వృద్ధులు తమ ఆస్తిని పొందిన బంధువులపై కాని లేదా భవిష్యత్తులో పొందే వారి నుంచి కాని, స్వాధీన పరుచుకున్నవారి నుంచి కాని పోషణ పొందుటకు అర్హులు.

**ఎంత భరణం పొందవచ్చు? :** వృద్ధులు లేక తల్లిదండ్రులు వారు సాధారణ జీవితం గడపుటకు అవసరమైనంత భరణం పొందుటకు హక్కు ఉన్నది.

మొత్తం మీద గరిష్ఠంగా నెలకు 10,000 రూ॥ల వరకు భరణాన్ని పొందవచ్చు. కానీ అది అందరికీ అన్ని కేసులలోనూ ఒకే రకంగా ఉండదు.

**ఎవరు దరఖాస్తు చేయవచ్చు?** భరణం కొరకు తల్లితండ్రులు, వృద్ధులు కాని లేదా రిజిష్టరు చేయబడిన స్వచ్ఛంద సంస్థలు కాని దరఖాస్తు చేయవచ్చు.

**పేద వృద్ధులకు వృద్ధాశ్రమాలు నెలకొల్పాలి:** పేద వృద్ధుల కొరకు కనీసం జిల్లాకొక్కటయినా వృద్ధాశ్రమం ప్రభుత్వమే నిర్మించాలి. దానిలో 150 మంది వరకు నివాసముండే విధంగా నిర్మించాలి.

**వైద్య సేవలు అందించాలి:** పూర్తిగా ప్రభుత్వ సహాయంతో నడిచే వైద్యశాలలలో సాధ్యమైనంత గాని, పాక్షికంగా కొంతవరకైనా గాని ప్రభుత్వం ఏర్పాటు చేయాలి.

వృద్ధులకు ప్రత్యేకమైన "క్యూ"లు ఏర్పాటు చేయాలి.

దీర్ఘకాలమైన, ఆయుక్షీణమైన వ్యాధులకు చికిత్సకు సౌకర్యాలు ఏర్పాటు చేసి వృద్ధులను కాపాడాలి.

**ఆస్తి బదిలీ ఆంక్షలు:** 2007 తరువాత వృద్ధులెవరైనా తమ ఆస్తిని గిఫ్ట్‌గా గాని ఏ ఇతర రూపంలో గాని బదిలీ చేసి, దానిలో తమను పోషించాల్సిన బాధ్యత ఆస్తి పొందిన వారిపైన ఉందనే నిబంధన విధించితే, అలా ఆస్తి పొందిన వ్యక్తులు వీరిని పోషించుటకు నిరాకరించినా లేదా నిర్లక్ష్యం చేసినా ఆ ఆస్తి బదిలీని రద్దు చేయవచ్చు.

వృద్ధులను పోషించవలసిన ఆస్థి పిల్లలకు, బంధువులు వేరొకరికి ఉచితంగా బదిలీ చేస్తే, వారికి ఈ వృద్ధులను ఆ ఆస్తి పొంది పోషించే బాధ్యత ఉంటుంది. వృద్ధులను శాశ్వతంగా వదిలించుకొనేందుకు వారిని ఏదైనా ప్రదేశంలో వదిలి వెళ్ళిపోతే వారికి 3 నెలల వరకు జైలుశిక్ష విధించవచ్చు.

**(అక్టోబరు 1 అంతర్జాతీయ వృద్ధుల దినోత్సవం సందర్భంగా)**

---

### మహిళా రిజర్వేషన్ బిల్లు ఆమోదం కొరకు ఐద్వా క్యాంపెయిన్

పార్లమెంట్ శీతాకాల సమావేశాల్లోనే చట్టసభల్లో మహిళా రిజర్వేష్ బిల్లును ప్రవేశపెట్టి ఆమోదింపచేయాలని కోరుతూ దేశ ప్రధానమంత్రికి, న్యాయశాఖమంత్రి (సల్మాన్ కుర్షీద్)కు మెయిల్స్ పంపాలని 'ఐద్వా' కేంద్ర కమిటి పిలుపునిచ్చింది. ఈ పిలుపులో భాగంగా ఐద్వా రాష్ట్ర కమిటి రాష్ట్ర వ్యాప్తంగా మహిళలందరూ అధిక సంఖ్యలో పాల్గొని ఈ క్యాంపెయిన్ విజయవంతం చేయాల్సిందిగా కోరుతున్నాము.

మీ ఆకాంక్షలను తెలపాల్సిన ఇ-మెయిల్ అడ్రస్‌లు

**pmo@pmindia.nic.in, Ph. : 23019334, 23015603**

**giriketharaj@hotmail.com, Fax : No. : 23015223, 23384241**




గౌరవనీయులైన ఎడిటర్ గారికి,

చైతన్య మానవి జులై-సెప్టెంబరు పత్రిక లోని కథలు,వ్యాసాలు చాలా బాగున్నాయి. సంపాదకీయం క్లుప్తంగా వివరించిన తీరు బాగుంది. "భారత మహిళ నాడు-నేడు' వేములపల్లి సత్యవతి గారి వ్యాసంలో ఆనాడు చిన్న పిల్లలు పెళ్ళిళ్ళ పేరుతో శారీరకంగా హింసించబడినతీరు అలాగే మహిళల పరిస్థితి గురించి చక్కగా వివరించారు. స్వరూపరాణి గారి 'భ్రూణ హత్యలపై సమరభేరి వ్యాసంలో మహాసభల విశేషాలను చక్కగా వివరించారు. ' మారకపు విలువలే తప్ప మానవ విలువలు పట్టని ప్రకటనలు' ఎ.రవిగారి వ్యాసం చక్కగా ఉన్నది.'కేస్‌స్టడీలో ఆత్మస్థైర్యంతో ముందడుగు'లో స్త్రీ చెప్పిన సమాధానం దగాపడ్డ మహిళలకు మార్గదర్శకంగా ఉన్నది. అమ్మాజీ 'పరివర్జిత' కథలో భాగ్యలక్ష్మి తీసుకున్న నిర్ణయం చైతన్యవంతంగా ఉంది. జాజుల గౌరి గారి కథ 'దస్తకత్' మొత్తం తెలంగాణా యాసలో అభం శుభం తెలియని పిల్లలకు కులాల పేరుతో "ఎక్వోల్లు, తక్వోల్లు" అనే విషపూరితమైన ఆలోచనలు మెదడులో ఎక్కించడం, కుల ధృవీకరణ కాగితం మీద 'దస్తకత్' పెట్టించుకోవటానికి ఎన్ని తిప్పలు పడుతున్నారో చక్కగా వివరించారు. కె. అంజన గారి కథ 'పనిపిల్ల' కూడా చాలా బాగుంది. అందులో మణి భర్త చక్కని సలహా చెప్పి, ఆమె ఆలోచనలకు ఒక రూపం ఇచ్చి, గంగ జీవితంలో చదువు అనే వెలుగును నింపుమన్న ముగింపు చక్కగా ఉంది. కాశీవఝుల రమానరసింహం గారి యథార్థగాథ 'భార్య ఖరీదు రెండు కోట్లు' నేటి యువత డబ్బే సర్వస్వం అనుకుని భార్య-భర్తల మధ్య ఉన్న సంబంధాలను ఎట్లా మంటగలుపు తున్నారో చక్కగా వివరించినారు.' అవగాహన సందర్భం'లో హింసకు బహుముఖాలు డా॥శిలాలోలిత గారి వ్యాసంలో తల్లి తండ్రుల, పెళ్ళి చేసుకోబోయే అమ్మాయిల ఆలోచనా విధానంలో ఎలాంటి మార్పులు రావాలో చక్కగా వివరించారు. 'మహిళలు-హక్కులు' పొత్తూరి సురేష్ కుమార్ గారు చట్టాల గురించి చక్కగా అవగాహన కల్పించారు. ప్రసన్న లక్ష్మి గారి 'ఒక్క క్షణం ఆలోచిద్దాం'లో పనివాళ్ళ గురించి చక్కగా వివరించారు. ' స్త్రీలలో రక్తహీనత మన దగ్గరే ఎక్కువ"లో స్త్రీలలో రక్తహీనత గురించి తెలియజేసారు. అలాగే దాన్ని అధిగమించటానికి ఎలాంటి ఆహారం తీసుకోవాలో సూచనలు కూడా వివరిస్తే బాగుండేది. ' ఆరోగ్యం శీర్షికలో సమతులాహారం, ఎం. నీలిమ గారు రాసిన అంశాలు బాగున్నాయి. ' మైక్రోఫైనాన్స్ అభివృద్ధి నియంత్రణ బిల్లు-2011' జమున/పి.ఎ. దేవి గార్లు రాసిన వ్యాసం బాగుంది. 'పార్వతీబాయి అథావతి' వకుళాభరణం లలితగారు రాసిన దానిలో పార్వతీబాయి జీవితం గురించి పరిస్థితుల వలయంలో చిక్కుకుని నిరాశ చెందక ముందుకు ఏవిధంగా సాగిపోయిందో చక్కగా తెలియజేశారు. బృందాకరత్ గారి ఆహార భద్రత బిల్లు ఇచ్చేది తక్కువ- హరించేది ఎక్కువ' వ్యాసం చాలా బాగుంది. లక్ష్మీదేవమ్మగారి ' అమ్మలకు అమ్మ అమ్మమ్మ' పుస్తకం గురించి వి.శ్రీనివాసరావుగారు రాసిన రివ్యూ చక్కగా ఉంది. వీలైనంత తొందరగా ఆ పుస్తకము చదవాలనుంది. మొత్తం మీద 'చైతన్య మానవి' విజ్ఞానవంతమైన వ్యాసాలతో చక్కటి కథలతో నిజంగానే చైతన్యం కలిగించేదిగా ఉంది.

**-పి. రమాదేవి, కూకట్‌పల్లి. హైదరాబాద్**

చైతన్య మానవి జులై-సెప్టెంబరు పత్రికలోని కథలు,వ్యాసాలు చాలా బాగున్నాయి. అమ్మాజీగారి 'పరివర్జిత' కథ అలాగే 'పనిపిల్ల' కథ చాలా బాగున్నాయి.

**- శైలజ, కూకట్‌పల్లి, హైదరాబాద్**

చైతన్య మానవి జులై-సెప్టెంబరు పత్రికలో ఇంతకు ముందు ప్రచురణకంటే దీనిలో కథలు,వ్యాసాలు చాలా బాగున్నాయి. 'పరివర్జిత' కథ చాలా బాగుంది. 'దస్తకత్', అలాగే యదార్థగాథ', 'భార్య ఖరీదు రెండు కోట్లు', కేస్ స్టడీ 'ఆత్మస్థైర్యంతో ముందడుగు' చాలా బాగున్నాయి. ఆరోగ్యం శీర్షికలో సమతులాహారం గురించి చక్కగా ఉంది కాని దానిలో మహిళలకు సబంధించిన సందేహాలకు సమాధానాలు వేస్తే బాగుంటుంది. ఈ ఆరోగ్య శీర్షిక ఇంకో రెండు పేజీలు పెంచితే బాగుంటుంది.

**-రత్నకుమారి, కూకట్‌పల్లి,హైదరాబాద్**

మానవి పత్రిక చదివిన తరువాత వెంటనే డైరీలో రాసుకోవాలి అనిపించింది. కథలు, వ్యాసాలు అన్నీ బాగున్నాయి. మానవి విజ్ఞానదాయకమైన పత్రిక.

**-సుచిత్రా ప్రసాద్, చంపాపేట.**

చైతన్య మానవి జులై-సెప్టెంబరు పత్రిక చాలా బాగుంది. ముఖ్యముగా 'పరివర్జిత' కథ చాలా బాగుంది. ఎలాంటి ప్రలోభాలకు లొంగకుండా భాగ్యలక్ష్మి తీసుకున్న నిర్ణయం చైతన్యవంతంగా ఉన్నది. 'యథార్థగాథ' భార్య ఖరీదు 2కోట్లులో ఆర్థిక ఇబ్బందులు ఎదురైనప్పుడు చెడ్డ స్నేహితుల ప్రభావంతో భార్య- భర్తల మధ్య ఉన్న విలువలను మరిచి నేటి యువత ఏ రకంగా పెడ త్రోవ పడుతున్నదో వివరించారు. అవగాహన సందర్భంలో, హింసకు బహుముఖాలు వ్యాసంలో మహిళలపై హింస ఎలా జరుగుతుందో వివరిస్తూ, తల్లి తండ్రుల, పెళ్ళి చేసుకోబోయే అమ్మాయిల ఆలోచనలో ఎలాంటి మార్పులు రావాలో చక్కగా వివరించారు. భారత మహిళ నాడు-నేడు వ్యాసంలో మహిళల స్థితిగతులు చక్కగా వివరించారు. ఆరోగ్య శీర్షికలో సమతులా హారంలోని అంశాలు బాగున్నాయి. ఈ శీర్షిక క్రింద మహిళలు ఎదుర్కొనే ఆరోగ్య సమస్యలు -సమాధానాలు అని డాక్టర్ సలహాల రూపంలో వివరిస్తే బాగుంటుంది.

**-పి. విమల, ప్రగతినగర్, హైదరాబాద్**

ఎడిటర్ గారికి,

నేను చైతన్య మానవిని రెగ్యులర్‌గా చదువుతాను. సాధారణ గృహిణిని. నాలాంటి వారికి పత్రిక ద్వారా కొత్త విషయాలు తెలుస్తున్నాయి. పత్రిక చదవక ముందు ఎవరితోనైనా ఏదయినా మాట్లాడాలంటే భయంగా ఉండేది. నాకేం తెలియదని ఎగతాళి చేస్తారేమోనని. కాని ఇప్పుడా భయం పోయింది.

జులై-సెప్టెంబరు పత్రిక చదివాక నా స్పందన తెలియ చేయాలనుకుంటున్నాను. మొదటి వ్యాసం 'మైక్రోఫైనాన్స్ బిల్లు'లో పేద స్త్రీలకు బిల్లు వల్ల వచ్చే నష్టాలు, కష్టాలు చెప్పారు. కాని చదవటం కొంచెం కష్టంగా ఉంది. సత్యవతిగారి వ్యాసం భారత మహిళ నాడు-నేడు చదివాక చాలా విషయాలు తెలిశాయి. వ్యాసాలు చిన్నవిగా ఉంటే నాలాంటి వారు తేలికగా చదవగలరు.

కథలు బాగున్నాయి. పరివర్జిత కథలో ఆఫీసుకని వెళ్ళిన తల్లి ఆలస్యంగా ఇంటికి రావడం చూసి 'ఏంటి మమ్మీ లేటయింది? అంటూ భాగ్యలక్ష్మి పెద్ద కొడుకు మంచినీళ్ళు తెచ్చిస్తూ అడుగుతాడు. అది నాకు చాలా నచ్చింది. మామూలుగా మగపిల్లలకు ఇటువంటి బాధ్యతలు మనం నేర్పం కదా. 'దస్తకత్' బాగుంది. పనిపిల్లను కొంచెం సంక్షిప్తం చెయ్యవచ్చు. భార్య ఖరీదు బాగానే ఉంది. కాని ఇతివృత్తాలు ఎన్నో ఉన్నాయి కదా!

మహిళలు-హక్కులు బాగుంది. మన హక్కులు ఏమిటో మనం తెలుసుకోవాలి కదా! అయితే ఒక్కొక్క చట్టం గురించిన వివరాలు భవిష్యత్‌లో తెలియజేస్తే బాగుంటుంది.

24వ పేజీలో 'తెగువచూపిన మహిళలు' శీర్షిక ద్వారా మహిళలు చూపిన ధైర్య సాహసాలు చదువుతుంటే చాలా గొప్పగా అనిపించింది. కాని వాళ్ళు పడ్డ బాధలు, చేసిన పోరాటాలు వివరించేటప్పుడు చదివి ఆకట్టుకునే విధంగా రాస్తే ఇంకా బాగుండేది.

'భ్రూణహత్యలపై సమర భేరి' నివేదిక ఇచ్చినట్లుగా ఉంది. కాని మహాసభల ఉత్సాహం, మహిళల కోసం ఐద్వా చేస్తున్న కృషి ఈ రిపోర్టు ప్రతిబింబించలేదు అనిపించింది.

ఆహార భద్రత, అస్పష్ట హామీలు వంటి అనువాదం చేసిన వ్యాసాలు కొంచెం సంక్షిప్తంగానూ, సూటిగాను ఉంటే బాగుండేది. సాధారణ పాఠకులకు కర్తవ్యం బోధపడేలా స్వేచ్ఛానువాదం చెయ్యవచ్చుకదా!

పత్రిక ఇంకా బాగా రావాలన్న ఆకాంక్షతో వ్రాశాను. అన్యదా భావించవద్దు. ఎన్నో ఉద్యమాలు చేస్తూ నాలాంటి మహిళలకు తెలియని విషయాలు చెప్పాలన్న తపనతో మీరు పత్రికను ప్రచురిస్తున్నందుకు ధన్యవాదాలు.

**-జి.నాగమణి,. హైదరాబాద్**

పత్రికలోని అంశాలు ఆలోచింప చేసేవిగా, అనుకరించేవిగా ఆత్మవిశ్వాసం పెంచేదిగా చాలా బాగున్నాయి. జులై, సెప్టెంబరు సంచికలో జాజుల గౌరి దస్తకత్ కథ మనస్సును కదిలించింది. చదివి నంతసేపూ లీనమైపోయాను. భార్య ఖరీదు రెండు కోట్లు కథ ఆశ్చర్యపరిచింది. డబ్బుకోసం ఎంతటి నీచానికైనా దిగజారే పరిస్థితి అసహ్యమేసింది. నీలిమగారి సమతుల్య ఆహార పట్టిక బాగుంది. జాగ్రత్త పరిచాను. వేములపల్లి సత్యవతిగారి నాడు-నేడు వ్యాసంలో చాలా విషయాలు తెలుసుకున్నాను. ఇంతటి విజ్ఞానం ఇచ్చిన చైతన్యమానవి నాకు చాలా నచ్చింది.

**- కె.జయలక్ష్మి, చందానగర్.**

# లైంగికవేధింపుల్లో ఆంధ్రాటాప్

**ఎన్.సి.ఆర్.బి. లెక్కల ప్రకారం**

ప్రేమోన్మాదుల దాడులు, అత్యాచారాలు, లైంగిక వేధింపులు, కిడ్నాపులు, వరకట్న వేధింపులు తదితర నేరాలు ఆంధ్రప్రదేశ్‌లో గణనీయంగా పెరిగాయి. లైంగిక వేధింపుల కేసులు ఆంధ్రప్రదేశ్‌లోనే అత్యధికంగా నమోదయ్యాయి. రాష్ట్రంలో మహిళలకు సంబంధించిన నేరాలు 2009లో 25,569 నమోదవగా, 2010లో 27,244 నమోదయ్యాయి. దేశ వ్యాప్తంగా మహిళలకు సంబంధించిన కేసులు 2,08,681 నమోదవగా, వాటిలో మన రాష్ట్ర వాటా 12.8 శాతం కావడం ఆందోళనకరం.

**లైంగిక వేధింపులు**

| రాష్ట్రం | కేసులు | స్థానం |
|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 4562 | 1 |
| మహారాష్ట్ర | 1180 | 2 |
| మధ్యప్రదేశ్ | 918 | 3 |

**అత్తింటి వేధింపులు**

| | | |
|---|---|---|
| పశ్చిమబెంగాల్ | 17796 | 1 |
| ఆంధ్రప్రదేశ్ | 12080 | 2 |
| రాజస్థాన్ | 11145 | 3 |

**అత్యాచారాలు**

| | | |
|---|---|---|
| మధ్యప్రదేశ్ | 3135 | 1 |
| పశ్చిమబెంగాల్ | 2311 | 2 |
| మహారాష్ట్ర | 15699 | 3 |
| ఆంధ్రప్రదేశ్ | 1362 | 7 |

**చీటింగ్ కేసులు**

| రాష్ట్రం | కేసులు | స్థానం |
|---|---|---|
| రాజస్థాన్ | 16584 | 1 |
| ఉత్తరప్రదేశ్ | 9533 | 2 |
| ఆంధ్రప్రదేశ్ | 9164 | 3 |

చిత్ర సమీక్ష

# జీవిత పాఠాలు నేర్పే పిల్ల జమిందార్

**డి**.ఎస్ రావు సమర్పణలో జి. అశోక్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహించిన పిల్లజమిందార్ చిత్రం రొటీన్ సినిమాలకు భిన్నంగా వుంది. కాలేజీ పిల్లలు విలాసాల గురించే కాక కొంత సమాజం గురించి కూడా ఆలోచించే విధంగా ప్రేరణ కలిగించిందని చెప్పవచ్చు. విద్యార్థులు తమ గురించే కాక సమాజంలోని తోటివారి గురించీ, వారి సాధక బాధకాల గురించీ కూడా ఆలోచించే ప్రోద్బలం ఈ చిత్రం కలిగించింది.

కథ: పి.జె (నాని) తల్లితండ్రులు ఒక ప్రమాదంలో చనిపోగా తాతవద్ద గారాబంగా పెరుగుతాడు. అపారమైన ఆస్తిపాస్తులతో, విలాసాలతో పెరిగి పెద్దవాడవుతాడు. అతని తాత చనిపోయిన తరువాత మైనార్టీ తీరిన అతను ఆ ఆస్తి మొత్తానికీ ఏకైక వారసుడిని నేనేనని విర్రవీగుతుంటాడు. ఎవరినీ లెక్కచేయని మనస్తత్వంతో, విందులు, విలాసాలతో గడుపుతుంటాడు. కాని అతని తాత ఆస్తి పి.జెకు దక్కాలంటే వీలునామాలో అనేక షరతులు విధిస్తాడు. ఒక మారుమూల పల్లెటూళ్ళో వసతి గృహంలోనే వుండి చదువుకుంటూ 3 సంవత్సరాలలో డిగ్రీ పూర్తి చేయాలనీ, ఈ 3 సంవత్సరాలలో ఆస్తిలో ఒక్కపైసా కూడా ముట్టుకోవడానికి వీలులేదనీ, మూడు సంవత్సరాలలో డిగ్రీ పూర్తి చేయకపోతే ఆస్తి రాదనీ, డిగ్రీ చదివే మూడు సంవత్సరాలలో ఒక్కసారైనా కాలేజీ ఎన్నికలలో ప్రెసిడెంటుగా కూడా పనిచేయాలనీ షరతులు పెడతాడు.

అనునిత్యం మందు, విందులు, అమ్మాయిలతో విచ్చలవిడి జీవితానికి అలవాటు పడ్డ పి.జెకి ప్రభుత్వ హాస్టల్లో గడపాల్సిరావడం నరక కూపంగా తోస్తుంది. మనుషుల చెమటవాసన నచ్చదని చెప్పే అతను 8 మంది నివసించే ఒక ఇరుకైన గదిలో గడపాల్సి వస్తుంది. కానీ ఆస్తికోసం అవన్నీ భరించడానికి సిద్ధపడతాడు. కాలేజీలో చదువుతున్న క్రమంలోనే అనేక జీవిత సత్యాలు తెలుసుకుంటాడు. తోటి విద్యార్థుల మంచితనం, స్నేహం అతనిని ఆకట్టుకుంటాయి. వారి పేదరికం చూసి క్రమంగా అతనిలో మార్పు వస్తుంది.

కాలేజీ ప్రెసిడెంటుగా గెలవాలంటే స్థానిక సెంటిమెంటు కూడా ఉంటుంది. కనుక గ్రామంలో విద్యార్థుల తల్లిదండ్రుల్లో మంచిపేరు తెచ్చుకోవడానికి ప్రయత్నాలు మొదలుపెడతాడు. ఆ




క్రమంలో గ్రామంలోని అనేక సమస్యలను పి.జె అతని స్నేహితులు తెలివిగా పరిష్కరించగలుగుతారు. క్రమంగా అతనిలో మార్పు వచ్చి డబ్బుకంటే మనుషుల మధ్య ప్రేమానురాగాలే మిన్న అని తెలుసుకుంటాడు. స్నేహితుడు ప్రాణాపాయంలో ఉండగా ఆస్తి మొత్తం త్యాగం చేసైనా అతనిని రక్షించుకోవాలని ప్రయత్నిస్తాడు.

కాలేజీ టీచర్లను కించపరుస్తూ తీసే అనేక సినిమాలకు భిన్నంగా వారిపై గౌరవం పెంచేలా ఉపాధ్యాయుల పాత్రల్ని చిత్రీకరించారు. ప్రభుత్వ కాలేజీలలో ప్రభుత్వ హాస్టళ్ళలో విద్యార్థుల దయనీయ స్థితిని, సౌకర్యాల లేమిని దర్శకుడు కొంత వెలుగులోకి తేగలిగారు. ఒక విద్యార్థి నాయకుడు కాలేజీలో సమస్యలను ఎలా పరిష్కరించవచ్చో చూపారు. యువతరం సామాజిక సమస్యలపై దృష్టి సారిస్తే ఎలాంటి ప్రజోపయోగ పనులు చేయవచ్చునో చూపారు. "అలా మొదలైంది" ఫేమ్ నాని అటు జమిందారుగా ఇటు విద్యార్థి నాయకుడుగా పాత్రలో జీవించాడని చెప్పవచ్చు. " దేవుడు మనుషులను ప్రేమించడానికీ, వస్తువులను వాడుకోవడానికీ సృష్టించాడు. కానీ మనుషులే వస్తువులను ప్రేమిస్తూ మనుషులను వాడుకుంటున్నారని" చెప్పే డైలాగ్ నేటి సమాజంలో పెరుగుతున్న వస్తు వ్యామోహాన్ని తెలుపుతుంది. మొత్తం మీద కుటుంబ సభ్యులతో కలిసి ఒక మంచి సినిమా చూసిన అనుభూతిని పిల్లజమిందార్ కలిగిస్తుంది.

-కె. నాగలక్ష్మి

# డెంగ్యూ ఫీవర్

✍ డా. రమాదేవి

రాష్ట్రంలో డెంగ్యూ పెద్ద ఎత్తున వ్యాపిస్తోంది. వందలాది మంది దాని బారినపడి చనిపోతున్నారు. ఇంకోవైపు డెంగ్యూ జ్వరం గురించి అపోహలు కూడా ఎక్కువగా వ్యాప్తిలో ఉన్నాయి. దానితో అనవసర భయాందోళనలు కలుగుతున్నాయి జనంలో. ఆ భయాలను కార్పొరేట్ ఆసుపత్రులు సొమ్ము చేసుకుంటున్నాయి. అందుకనే డెంగ్యూ గురించి కొన్ని ముఖ్యమైన విషయాలు తెలుసుకుందాం.

**డెంగ్యూ అంటే:** ఇది ఒక రకమైన వైరల్ ఫీవర్. అన్ని వైరల్ జ్వరాల్లాగానే మామూలు జ్వరమే. చాలా మందికి డెంగ్యూ జ్వరం వచ్చి బయటపడకుండానే దానికదే తగ్గిపోతుంటుంది. వైద్య పరిభాషలో దీన్ని సబ్‌క్లినికల్ ఇన్‌ఫెక్షన్ అంటారు.

**ఎలా వస్తుంది?** డెంగ్యూ ఒక వైరస్ (సూక్ష్మజీవి) వల్ల వస్తుంది. ఆ వైరస్ పేరు "గ్రూప్ బి ఆర్థోవైరస్". దోమలో ఈ వైరస్ పెరుగుతుంది. ఆ దోమ "ఈడిస్ ఈజిప్టి'' అనే ఒక రకం ఆడదోమ. ఈ దోమ కుట్టడం ద్వారా ఈ జబ్బు ఒకరి నుండి మరొకరికి వ్యాపిస్తుంది. డెంగ్యూ ఉన్న మనిషిని దోమ కుడితే ఆ దోమలోకి ఈ వైరస్ ప్రవేశిస్తుంది. 8 నుండి 11 రోజులు ఈ దోమలో వైరస్ పెరుగుతుంది. ఆ తర్వాత ఆ దోమ చనిపోయేదాకా కుడుతూ డెంగ్యూను వ్యాపింపజేస్తుంది. కుట్టిన 5 నుండి 6 రోజులకు జ్వరం ప్రారంభమవుతుంది.



**దోమ ఎక్కడ ఉంటుంది?** నిలువ నీళ్ళలో ఈ దోమ గుడ్లు పెడుతుంది. ఓవర్‌హెడ్ ట్యాంకులు, కూలర్లు, ఇంట్లోని పాత్రలు, ఫ్లవర్‌వాజులు, పాతటైర్లు, పనికిరాని పడేసిన బాటిళ్ళు, పాత్రలు, డబ్బాలు, ఇలా ఎక్కడ నీళ్ళు నిలువ ఉండటానికి అవకాశం ఉంటే అక్కడంతా ఈ దోమ గుడ్లు పెడుతుంది.

**డెంగ్యూ లక్షణాలు :** 1. జ్వరం హఠాత్తుగా తీవ్రస్థాయిలో (103 నుండి 105 డిగ్రీ ఫారన్‌హీట్) వస్తుంది. 2 నుండి 7 రోజుల దాకా జ్వరం వచ్చి ఈ క్రింది లక్షణాల్లో రెండు లేక ఎక్కువ ఉంటే డెంగ్యూ అని అనుమానించాలి.

- తీవ్రమైన తలనొప్పి
- కంటి వెనుక తీవ్రమైన నొప్పి

**(అటు, ఇటూ చూస్తే నొప్పి ఎక్కువవుతుంది.**

- కండరాల నొప్పి, కీళ్ళలో నొప్పి
- చర్మంపై ఎర్రటి మచ్చలు
- తెల్ల రక్తకణాలు తగ్గిపోవటం

**డెంగ్యూ హెమరేజిక్ ఫీవర్:**

డెంగ్యూలోనే మరోరకం ఉంది. దానిని డెంగ్యూ హెమరేజిక్ ఫీవర్ అంటారు. ఇది చాలా ప్రమాదకరమైన జ్వరం. శరీరంలోని ఏ భాగం నుండైనా రక్తస్రావం జరగటం దీని లక్షణం. పళ్ళనుంచి రక్తం, రక్తవాంతులు, నల్లటి మలం, ముక్కునుంచి రక్తం కారడం ఇవన్నీ కూడా జ్వరంలో కనిపించవచ్చు. రక్తాన్ని గడ్డ కట్టించే "ప్లేట్‌లెట్స్" అనే రక్తకణాలు తగ్గిపోవడం వల్ల ఈ లక్షణాలు కనిపిస్తాయి. 50 వేల కంటే ప్లేట్‌లెట్స్ తగ్గినప్పుడు ఈ పరిస్థితి ఏర్పడుతుంది.

**డెంగ్యూ హేమరేజిక్ ఫీవర్ ముదిరితే దాన్ని "డెంగ్యూ షాక్ సిండ్రోమ్" అంటారు. ఇందులో రక్తప్రసరణ వైఫల్యం ఉంటుంది. నాడి బలహీన పడటం, లో బిపి, కాళ్ళు చేతులు చల్లబడటం, తీవ్రమైన దాహం, మనిషి స్థిమితంగా ఉండకపోవటం- ఈ లక్షణాల్లో అన్నీ కాని కొన్ని కాని ఉంటాయి. డెంగ్యూ హేమరేజిక్ ఫీవర్, డెంగ్యూ షాక్ సిండ్రోమ్‌కి ఆసుపత్రిలో చేర్చి అత్యవసర వైద్యం ప్రారంభించాలి. ఈ రకంగా వైద్యం అవసరమయ్యేవారు వంద మందిలో ఒకరు ఉండొచ్చు. త్వరగా వైద్యం ప్రారంభించడం ద్వారా వీరిని రక్షించవచ్చు.**

**వైద్యం ఏమిటి?** డెంగ్యూ జ్వరానికి లక్షణాలను బట్టి వైద్యం చేయాలి.

1. రోగి విశ్రాంతి తీసుకోవాలి.
2. పారసెటమాల్ మాత్రలే రోజుకి నాలుగుసార్లు తీసుకోవాలి. ఇవి జ్వరాన్ని తగ్గిస్తాయి. ఆస్పిరిన్, బ్రూఫిన్ లాంటి మాత్రలు అస్సలు ఇవ్వకూడదు.
3. వైరల్ జ్వరాలకు అంటిబయాటిక్స్ పనిచేయవు. కాబట్టి అవి ఇవ్వాల్సిన అవసరం లేదు.
4. జ్వరం ఎక్కువగా ఉండి, డీహైడ్రేషన్ (శరీరం నీళ్ళు కోల్పోవటం) ఉంటే "ఓఆర్ఎస్" తాగించాలి. అర లీటరు నీళ్ళలో మూడు చిటికెల ఉప్పు, ఒక పిడికిలి చక్కెర కలపటం ద్వారా "ఓఆర్ఎస్" ఇంట్లోనే తయారు చేసుకోవచ్చు. రెండు మూడు లీటర్ల వరకూ కూడా దీన్ని ఇవ్వచ్చు. వాంతులవుతున్నా దీన్ని తాగించాలి.
5. పథ్యం అవసరం లేదు. రుచిని బట్టి ఏది తినాలనిపిస్తే అది తినొచ్చు. శుభ్రంగా, వేడిగా ఉంటే చాలు.

**జాగ్రత్తలు:**

మామూలుగా జ్వరం రెండు నుంచి ఏడు రోజుల్లో తగ్గిపోతుంది. జ్వరం తగ్గినా ఇంకో రెండు రోజులు ఇతర సమస్యలు వస్తాయేమో చూడాలి. తీవ్రమైన కడుపునొప్పి, నల్ల మలం, చర్మంలో ఎర్రటి మచ్చలు, ముక్కు నుండి, పళ్ళ చిగుళ్ళ నుండి రక్తం కారడం, ఒళ్ళు చల్లబడటం, చెమట పట్టడం ఇవన్నీ ప్రమాద సూచికలు. ఇలాంటివి కనిపిస్తే డెంగ్యూ హేమరేజిక్ ఫీవర్‌గా అనుమానించి వెంటనే ఆసుపత్రిలో చేర్చాలి.

మొదట్లో డెంగ్యూకు, డెంగ్యూ హేమరేజిక్ ఫీవర్‌కు మధ్య తేడాను కనుక్కోవడం సాధ్యం కాదు. కాబట్టి ఈ జాగ్రత్తలు అవసరం. ఆసుపత్రిలో అవసరాన్ని బట్టి ప్లేట్‌లెట్స్ (రక్తకణాలు) ఇవ్వడం ద్వారా వైద్యం చేస్తారు.

**వ్యక్తిగతంగా తీసుకోవాల్సిన జాగ్రత్తలు** దోమల వ్యాప్తికి దోహదపడే నిలువ నీటిని ఇంట్లోనూ, చుట్టుపక్కలా లేకుండా చూసుకోవటం ప్రధానమైన జాగ్రత్త, దోమలు కుట్టకుండా చూసుకోవాలి.

**సమిష్టి చర్యలు :** వారానికి ఒకరోజు ఒక వీధిలో కాని, ఒక ఊరిలో కాని ఉన్నవారందరు ఒకే రోజు డ్రైడే పాటించాలి. ఈ రోజు ఇంట్లో ఉన్న నీళ్ళనీ (చిన్న పాత్రలో ఉన్నా, పెద్ద పాత్రలో ఉన్నా, ఉపయోగంలో లేని పాత్రలో ఉన్నా ) బయటకు పారపోసి ఒక గంటసేపు పాత్రలను ఎండబెట్టాలి. ఇట్లా చేయటం వల్ల ఈ నీటిలో ఉన్న దోమ గుడ్లన్నీ నశిస్తాయి. ఈ విధంగా ఒక మూడు వారాలు (మూడు సార్లు) చేయాలి. ఇలా చేస్తే డెంగ్యూ దోమను నియంత్రించడం సాధ్యమవుతుంది. ఇది ఉద్యమ స్థాయిలో జరిగితే మరింత ఉపయోగం.

# ఉద్యమ వార్తలు

## క్రాప్ హాలిడే

రాష్ట్రంలో అత్యధిక సంఖ్యలో జనం వ్యవసాయంపై ఆధారపడి ఉన్న జిల్లా తూర్పుగోదావరి జిల్లాలో 8 మండలాలు సంపూర్ణంగానూ, 5 మండలాలలో పాక్షికంగానూ భూ యజమానులు సుమారు 80 వేల ఎకరాలలో క్రాప్ హాలిడే (పంట విరామం) ప్రకటించారు. కోనసీమగా పిలువబడే అమలాపురం ప్రాంతంలో పచ్చని పంట పొలాల స్థానంలో ఇపుడు ఎటుచూసినా బీడు భూములు కనపడుతున్నాయి.

ఎకరానికి 25 బస్తాలు రెండు పంటలకు కౌలుగా తీసుకుంటూ భూములను కౌలుకిచ్చేవారు. కోనసీమ ప్రాంతంలో సాగవుతున్న భూమిలో 80 శాతానికి పైగా కౌలు రైతులే సాగుచేస్తున్నారు. కౌలుదార్లలో మూడొంతుల మంది బీసిలు. ప్రకృతి వైపరీత్యాలు, పంటలకు గిట్టుబాటు లేకపోవటం ఎరువులు, పురుగు మందులు, విత్తనాల కొరతతో వడ్డీ వ్యాపారులను ఆశ్రయిస్తున్నారు. పెట్టిన పెట్టుబడి రాక ఈ మధ్య కాలంలో అప్పులు తీర్చేమార్గం లేక ఒక్క కోనసీమలోనే 10 మంది పైగా కౌలు రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. కౌలురైతు కుటుంబాలలో మహిళలు తమ కౌలు భూములలో పనిచేస్తూనే కూలిపనులకు పోయి జీవనం సాగిస్తున్నారు. భూస్వాములు క్రాప్ హాలిడే ప్రకటించటానికి గల కారణాలను పరిశీలించడం నేడు అత్యంతవసరం.

అమలాపురం, అయినవిల్లి మండలాల్లో ఐద్వా బృందం పర్యటించింది. రైతులతో ముఖ్యంగా కౌలు రైతు మహిళలు, వ్య.కా మహిళల ఉపాధి సమస్యలపై మహిళలతో సమావేశాలు నిర్వహించింది. వ్యవసాయంతో ఎకరానికి 70 దినాలు మహిళలకు పనులు దొరుకుతాయి. వ్యవసాయ కూలి మహిళకి పని సమయంలో రోజుకు 100 రూపాయల దాకా కూలి వస్తుంది. పంట విరామం వలన స్త్రీలకు పనులు లేకుండా పోయాయి. పనుల కోసం సొంత ఊరు వదిలిపెట్టి వలసబాట పడుతున్నారు. వ్యవసాయ కార్మిక సంఘం, ఐద్వా కార్యకర్తలు గ్రామ గ్రామాన సమావేశాలు నిర్వహించి వ్యవసాయ కూలీలకు ఉపాధి సౌకర్యాలు కల్పించాలనే డిమాండ్‌ను ముందుకు తెచ్చారు. అమలాపురం మండలంలో మూడువేలమంది మహిళలు మాకు రూరల్ ఎంప్లాయిమెంటు గ్యారంటీ రేగా ద్వారా ఉపాధైనా చూపండి-తిండైనా పెట్టాలని; డ్వాక్రా గ్రూపులకు ప్రభుత్వం ఇచ్చిన ఋణాలు రద్దు చేయాలని, ప్రభుత్వ కాలువ గట్లపై ఉన్న 10 లక్షల కొబ్బరిచెట్లను పేదలకు పంచాలనే డిమాండ్స్‌పై ఐక్యంగా కదిలారు.

## ఏదీ ఆహార భద్రత

ప్రజలందరికి ఆహార భద్రత కల్పించాలని, గ్రామీణ ప్రాంతాలలో రోజుకు 20 రూపాయలు, పట్టణ ప్రాంతాల్లో 32 రూపాయలు ఆదాయం ఉన్నవారు దారిద్ర్యరేఖకు పైగా ఉన్నారట, ప్రణాళికా సంఘం సిఫారసులు ఉపసంహరించుకోవాలని కోరుతూ ఒంగోలుతోపాటు రాష్ట్ర వ్యాప్తంగా రౌండ్ టేబులు సమావేశాలు, ధర్నాలు జరిగాయి. పెరిగిన నిత్యావసరాలతోపాటు, వంట


ప్రకాశం

చేసుకోవడం కూడా ప్రజలకు భారం కానుంది. ప్రస్తుతం సంవత్సరానికి 4 సిలిండర్లే అనే పరిమితి విధించి, ఆ తర్వాత సిలిండర్‌పై ఇచ్చే సబ్సిడీ ఎత్తివెయ్యడానికి ప్రభుత్వం కసరత్తులు చేస్తుంది. రేషన్ సరుకులను ఆధార్ కార్డుతో లింక్ చేస్తోంది. పెరిగిన ధరల వల్ల పేదలు ఆహార వినియోగాన్ని కుదించుకుంటున్నారు. వాటికి తోడు ప్రణాళికాసంఘం దారిద్ర్య రేఖకు ఇచ్చిన నిర్వచనం ప్రకారం రేషన్ కార్డుల కుదింపుకు ప్రభుత్వం రంగం సిద్ధం చేస్తూ వుంది. వీటికి వ్యతిరేకంగా ఐద్వా అనేక జిల్లాల్లో ఆందోళనా కార్యక్రమాలు నిర్వహించింది.

## ఇఫ్తార్

రంజాన్ పండుగ సందర్భంగా ముస్లిమ్ మహిళలకు ఐద్వా ఖమ్మం


ఖమ్మం

జిల్లా కమిటీ ఇఫ్తార్ విందునిచ్చింది. మైనారిటీ మహిళలకు శుభాకాంక్షలు తెలుపుతూ మత సామరస్యాన్ని కాంక్షిస్తూ ఐద్వా ఇఫ్తార్ విందులు ఏర్పాటు చేసింది. ఇఫ్తార్ విందులలో ముస్లిమ్ మైనారిటీ మహిళలతోపాటు అన్ని మతాలకు చెందిన మహిళలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. ఒకరికొకరు శుభాకాంక్షలు తెలుపుకోవడంతోపాటు మహిళా సమస్యలపై ఐక్యంగా ఉద్యమించాలని తీర్మానించుకున్నారు. ఖమ్మం టౌన్, ఖానాపూర్ హవేలీ కమిటీ పరిధిలో ఇఫ్తార్ విందులు జరిగాయి. 400మంది మహిళలు పాల్గొన్నారు.

## కిరోసిన్ కోటా తగ్గింపుపై

రాష్ట్ర ప్రభుత్వం కిరోసిన్ కోటాను తగ్గిస్తూ జి.వో.29ని విడుదల చేసింది. దీనిపై రాష్ట్ర రాజధాని మరియు మున్సిపాలిటీలు హైదరాబాద్ నగరంతోపాటు ఇతర అనేక జిల్లాల్లో మహిళలు తీవ్ర



హైదరాబాద్

నిరసన వ్యక్తం చేశారు. కార్పొరేషన్ పరిధిలో 5నుండి 4 లీటర్లకు, మండల కేంద్రాల పరిధిలో 4 నుండి 2లీటర్లు కిరోసిన్‌ను తగ్గించారు. 3నెలల క్రితమే కిరోసిన్ సబ్సిడీ ధరను 13నుండి 15 రూపాయలకు పెంచారు. పేద ప్రజలకు కనీసం వంట చేసుకునే భాగ్యాన్ని కూడా దూరం చేస్తోందీ ప్రభుత్వం. కేంద్ర ప్రభుత్వం వెంటనే రాష్ట్రానికి 2004సం॥లో ఇచ్చిన విధంగా 23 లీటర్ల కిరోసిన్ కోటాను పునరుద్ధరించాలని ఐద్వా డిమాండ్ చేస్తోంది.

## మా బతుకుకు భరోసా ఏది?

ఇంటి పనివారల సమస్యలను వెంటనే పరిష్కరించాలని ఐద్వా, స్నేహ ఇంటి పనివారల సంక్షేమ సంఘం ఆధ్వర్యంలో



కృష్ణా

విజయవాడలో సదస్సు జరిగింది. ఇంటి పనివారలకు గుర్తింపు కార్డులు, వేధింపులు, పిల్లల స్కాలర్‌షిప్పులు కనీస వేతన చట్టం అమలు తదితర సమస్యలు అనేకం చర్చకు వచ్చాయి. సంఘటితంగా పోరాడి, ప్రభుత్వంపై వత్తిడి తెచ్చి సమస్యలు పరిష్కరించుకోవాలని సదస్సు పిలుపునిచ్చింది. రాష్ట్ర వ్యాప్తంగా అన్ని పట్టణాలలో ఇంటి పనివారలు జనరల్ బాడీలు, సదస్సులు, సభ్యత్వ చేర్పింపు కార్యక్రమం కొనసాగుతున్నది.

## ఆడపిల్ల భారమా?

ఆడపిల్లలను కడుపులోనే చిదిమేసే విషసంస్కృతికి చిత్తూరు మరియు ఇతర వ్యతిరేకంగా భ్రూణహత్యలపై మహబూబ్ నగర్ టౌన్‌తోపాటు


చిత్తూరు

20 జిల్లాలో రౌండ్‌టేబుల్ సమావేశాలు, సదస్సులు నిర్వహించారు. 2011 జనగణన లెక్కల ప్రకారం తగ్గుతున్న 6 ఏళ్ళలోపు బాలబాలికల నిష్పత్తి సభ్య సమాజాన్ని నివ్వెరపరుస్తున్నది. భ్రూణహత్యల నిరోధానికై


నల్గొండ

పోరాడి సాధించుకున్న పిసి పిఎన్‌డిటి యాక్ట్ కాగితాల పైనే ఉంది. స్కానింగ్ సెంటర్లపై నిఘా పెరగాలని, చట్టాన్ని పకడ్బందీగా అమలు చెయ్యాలని, ఆడపిల్లల సంక్షేమానికి ప్రభుత్వం మరిన్ని చర్యలు చేపట్టాలని, రాష్ట్ర వ్యాపితంగా ప్రచారం నిర్వహించాలని ఈ సమావేశాల్లో సదస్సులలో ఐద్వా పిలుపునిచ్చింది.

## డివిజన్ మహాసభలు

మహబూబ్ నగర్ టౌన్‌తోపాటు నాగర్ కర్నూల్, వనపర్తి, కొల్లాపూర్ డివిజన్ మహాసభలు, చిత్తూరు, రేణుగుంట, పుత్తూరు, గాజువాక జోన్, శ్రీకాకుళం, రాజం, పాలకొండ, జగ్గయిపేట ఈ కాలంలో జరిగాయి. ఐద్వానిర్మాణాన్ని పటిష్టం చేసుకోవడంతోపాటు బహుళ వర్గంగా ఉన్న మహిళల సమస్యలను తీసుకుని పనిచెయ్యాలని




మహాసభలు పిలుపునిచ్చాయి. మహిళగా, వర్గ మహిళగా,పౌరురాలిగా సమాజంలో స్త్రీలు ఎదుర్కొంటున్న అన్ని రకాల సమస్యల పరిష్కానికి ఐద్వా కృషి చేయాలని బాధిత మహిళలకు అండగా నిలబడాలని మహాసభలు నిర్ణయించాయి.

## భవన ప్రారంభోత్సవం

ప్రకాశం జిల్లా ఐద్వా కమిటీ ఒంగోలులో సంఘానికి నూతన భవనాన్ని ఏర్పాటు చేసుకుంది. జిల్లా వ్యాప్తంగా మహిళల్లో కార్యక్రమాలు విస్తృతవరుచు కునేందుకు, సమస్యలతో సతమతమవుతున్న మహిళలకు అండగా నిలబడేందుకు ఈభవనం ఏర్పాటు అనేకమంది మహిళా ఉద్యమ శ్రేయోభిలాషులకు ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని ఇచ్చింది. జిల్లా మహిళల ఆకాంక్షలు నెరవేర్చుటకు ఐద్వా జిల్లా కార్యాలయం ఖచ్చితంగా కేంద్రబిందువు అవుతుంది.




**బాలికా హంతకులను శిక్షించాలి** కర్నూలు నగరంలో ఇంటిపని కార్మికురాలైన 16 సంవత్సరాల హీనాపై అత్యాచారం చేసి హత్యకు పాల్పడ్డ నిందితులను కఠినంగా శిక్షించాలని కర్నూలు జిల్లా ఐద్వా నగర కమిటీ, స్నేహ ఇంటిపనివారల సంఘం ఆధ్వర్యంలో హీనా మృతదేహంతో కలెక్టరాఫీసు ముందు ధర్నా చేశారు. ఇంటిపనివారలకు రక్షణ లేకుండా పోయిందని, మైనర్‌లను పనిలో పెట్టుకుంటున్నారని, ఘాతుకానికి పాల్పడ్డ యజమాని శంకర్ తదితరులను వెంటనే అరెస్టు చేసి కఠినంగా శిక్షిం చాలని డిమాండ్ చేశారు.ఆందోళనకు దిగివచ్చిన కలెక్టర్ తన నిధినుంచి 5,000 రూ.లను బాధిత కుటుంబానికి అందజెయ్యటంతో పాటు, నిందితులను వెంటనే అరెస్టు చేశారు.

## పట్టణ ప్రజలపై భారాలు

పట్టణాలలో సంస్కరణలు అమలు చెయ్యడంలో భాగంగా ప్రభుత్వం అనేక భారాలను పేద ప్రజలపై మోపుతూవుంది. ఈ సంస్కరణలను వ్యతిరేకిస్తూ ఖమ్మం డివిజన్‌లో రౌండ్‌టేబుల్ సమావేశం జరిగింది. 70 మంది పాల్గొన్నారు. స్కూల్ యాజమాన్యాలు, మేధావులు, డాక్టర్స్, లాయర్స్, మహిళా సంఘాల ప్రతినిధులు




హాజరయ్యారు. వన్‌టౌన్ ఆధ్వర్యంలో 800 మందితో సంతకాల సేకరణ చేశారు. ఖానాపురం హవేలీ కమిటి ఆధ్వర్యంలో 300 మందితో సదస్సు జరిగింది. పేద, మధ్య తరగతి ప్రజానీకంపై భారాలను వేసే సంస్కరణలను రాజకీయాలకతీతంగా అందరూ వ్యతిరేకించారు. ఖమ్మంతోపాటు విశాఖ, విజయవాడ, ప్రకాశం, హైదరాబాద్ తదితర పట్టణాల్లో సదస్సులు జరిగాయి.

## నిండు గర్భిణి గెంటివేత

మహబూబ్ నగర్ జిల్లా దేవరకద్ర మండలం, జినూరాల గ్రామానికి చెందిన లక్ష్మి పురుటి నొప్పులతో బాధపడుతూ జిల్లా కేంద్రంలోని ప్రభుత్వాసుపత్రికి వెళ్లింది. ఆసుపత్రిలోని డాక్టర్లు, నర్సులు తమ వృత్తి ధర్మాన్ని మరిచి లక్ష్మికి విపరీతమైన రక్తస్రావం, నొప్పులతో బాధపడుతున్నా కనీస వైద్యం అందించక హైద్రాబాద్‌కు వెళ్ళమని గెంటివేశారు. నొప్పులు అధికమైన లక్ష్మి భర్త సపర్యలతో రోడ్డుపైనే కవలలను ప్రసవించింది. విషయం తెలిసిన ఐద్వా కార్యకర్తలు లక్ష్మికి అవసరమైన రక్షణ సౌకర్యాలు కల్పించడంతోపాటు, ఆసుపత్రి ముందు ధర్నా చేశారు. మహిళల ఆందోళనలతో హాస్పిటల్ సూపరిండెంట్ బయటకు వచ్చి లక్ష్మికి క్షమాపణ చెప్పడంతోపాటు భవిష్యత్తులో ఇటువంటి ఘటనలు పురావృత్తం కాకుండా చూస్తానని హామీ ఇచ్చారు. తల్లి, పిల్లలను ఆసుపత్రికి తరలించి వైద్యం అందించారు.

## టాన్యా సంస్మరణ సభ

డా॥ మోటూరు టాన్యా అక్టోబర్ 26 తేదీన అనారోగ్యంతో ఒంగోలులో మరణించారు. ఆమె తల్లి మోటూరు ఉదయం పేరున ఏర్పడిన ట్రస్ట్‌కు కోశాధికారిగా వున్నారు. ఐద్వా, మోటూరు ఉదయం ట్రస్ట్ ఆధ్వర్యంలో 8-11-11న హైదరాబాద్ లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో సంస్మరణ సభ జరిగింది. మల్లు స్వరాజ్యం అధ్యక్షతన జరిగిన ఈ సభలో ఐద్వా సీనియర్ నాయకులు అల్లూరి మన్మోహినీ, పుతుంబాక భారతి, టి.సి. లక్ష్మమ్మ, ఎస్.పుణ్యవతి, టి. జ్యోతి తదితరులు పాల్గొని ఆమె జ్ఞాపకాలను గుర్తుచేస్తూ, ఆమె సేవాభావాన్ని, ఆత్మీయానురాగాలను మననం చేశారు. ఆమె కుటుంబ సభ్యులు మోటూరు పూర్ణ చంద్ర రావు మరియు సోదర మహిళా సంఘాల నాయకులు ఈ సభలో పాల్గొని సంతాపం తెలియచేశారు.



# శుభాకాంక్షలు



## శ్రీ & శ్రీమతి సునీతా ప్రకాశ్ గౌడ్

### కార్పొరేటర్

అడిక్‌మెట్ డివిజన్, ముషీరాబాద్,

హైదరాబాద్.

# భావ విప్లవకారుడు

# గురజాడ



స్త్రీ పురుష సంబంధాలలో విప్లవాత్మక మార్పు అంటే యజమాని బానిస సంబంధాలు ధ్వంసమై ప్రేమపూరితమైన స్నేహ సంబంధాలు ఏర్పడటమే. గురజాడ 'కాసులు' కవితలో అలాంటి సంబంధాలనే ప్రతిపాదించాడు. అందుకే ఆయన భావవిప్లవకారుడు, నేటి మన సినిమాలు యువతీ యువకుల మధ్య ప్రేమ పేరుతో 'మరులు'ను మాత్రమే ప్రేరేపిస్తున్నాయి. తెలుగు సినిమాలలో స్త్రీల చిత్రణ ఆ అమ్మాయిలకు డబ్బులు కురిపిస్తాయేమో గాని, వాళ్ళ వెంటపడే స్త్రీలకు మాత్రం దక్కేది అన్యాయమే. ఎందుకంటే సినిమాలు ప్రేమ పేరుమీద ప్రేమ కాని విషాన్ని నూరిపోస్తున్నాయి. స్త్రీని అర్ధనగ్నంగా, ముక్కాలు నగ్నంగా ప్రదర్శించి జేబులు నింపుకుంటున్నాయి. నాయికలను బెడ్‌రూం డ్రస్సులో, బాత్‌రూం డ్రస్సులో, స్విమ్మింగ్‌పూల్ డ్రస్సులో, ఎల్‌కెజి డ్రస్సులో ప్రదర్శించి సారాంశంలో స్త్రీ శరీరాన్ని ప్రదర్శించి యువతలో సినిమా కలిగిస్తున్నది 'మరులు' తప్ప ప్రేమ కానేకాదు. 1910లోనే గురజాడ మరులను ప్రేమగా భ్రమ పడవద్దు అని హెచ్చరించాడు.

**మరులు ప్రేమని మది దలంచకు**
**మరులు మరలును వయసు తోడనె**
**మాయ మర్మము లేని నేస్తము**
**మగువలకు మగవారి కొక్కటె**
**బ్రతుకు సుకముకు రాజమార్గము"**

గురజాడ స్త్రీ పురుషుల మధ్య భూస్వామ్య సంబంధాలనే గాక, ధనస్వామ్య సంబంధాలను కూడా తిరస్కరించి ప్రేమ సంబంధాలను ప్రతిపాదించాడు. అయితే సమాజం ఈ దశకు చేరాలంటే తరతరాలుగా భూస్వామ్య వ్యవస్థ మన బుర్రల చుట్టూ అల్లిన బూజును నిర్మూలించుకోవాలి. పెట్టుబడిదారీ వ్యవస్థ సాంస్కృతికాంశాన్ని, సినిమా సృష్టిస్తున్న మరులు నుంచి యువత బయటపడాలి. ఇందుకు గురజాడ సాంస్కృతిక నాయకత్వం వహించే కవితలు రాసి వైతాళికుడయ్యాడు. ధనం రెండు తెరగులుగా ఉంటుందని, ఒకటి మట్టిలో పుట్టిన నోట్ల కట్టకాగా, రెండవది 'హృత్కమలంపు సౌరభము' అంటే ధనం అని వివరించాడు గురజాడ. డబ్బుకు, ప్రేమకు సంబంధమే లేదన్నది ఆయన అవగాహన అందుకే "అదియునిదియొక్కెడను కలుగుటయరుదు" అన్నాడు.

ఈ రెండింటిలో స్త్రీలకు కోరదగింది నిస్సందేహంగా 'ప్రేమ' తప్ప 'ధనం' కాదని చెప్పాడు. భూస్వామ్య వ్యవస్థను ధిక్కరిస్తూ పెట్టుబడిదారీ వ్యవస్థకు ఆహ్వానం పలికిన గురజాడ, దానిని కూడా విమర్శనాత్మకంగానే పరిశీలించి, అందులోని ధన ప్రాధాన్యాన్ని వ్యతిరేకించాడు. అందుకే ఆయన వైతాళికుడు.

స్త్రీ పురుష సంబంధాలలో ధన ప్రమేయాన్ని తిరస్కరిస్తూ, బాల్య వివాహాలను, అసమవివాహాలను వ్యతిరేకిస్తూ 'పూర్ణమ్మ' కవిత రాసిన గురజాడ, స్త్రీని దౌర్జన్యంతో లోబరచుకునే పురుషాధిపత్యాన్ని వ్యతిరేకిస్తూ 'కన్యక'కవితను రాశాడు. 'లవణరాజుకల'లో వివాహ వ్యవస్థలో కుల ప్రమేయాన్ని వ్యతిరేకించడమే గాక, మొత్తం అస్పృశ్యతనే ఎండగట్టిన తీరును మనం వ్యాసాల్లో చూస్తాం. ఇవన్నీ 1910-12 నాటికి ఎంతో ప్రగతిశీలమైన అభిప్రాయాలు. 'డామన్ పితియస్' కవితలో స్నేహ సౌందర్యాన్ని ఆవిష్కరించాడు. స్వార్థ ప్రయోజనాలను సాధించుకోవడమే పెట్టుబడిదారీ విధానం. దానిని ముందే పసిగట్టాడు గనుక గురజాడ స్వార్థత్యాగాన్ని ఒక మానవీయ విలువగా ఆనాడే ప్రతిపాదించాడు.

"సొంత లాభము కొంత మానుకు
పొరుగువాడికి తోడు పడవోయ్"

అని దేశభక్తి'లో ప్రబోధించిన గురజాడ, 'డామన్ పితియస్'లో స్నేహం కోసం సంపూర్ణ త్యాగానికి సిద్ధపడే మిత్రుని చిత్రించాడు. ఇవన్నీ గురజాడ మన సమాజంలో కోరుకున్న మార్పులు. ఆయనది సరికొత్త స్వప్నం. చెడ్డ సమాజం పోయి మంచి సమాజం రావాలన్నది ఆయన ఆకాంక్ష. మానవుల మధ్య ప్రేమ పాదుకొన్నప్పుడే మనుషులకు లేదా ప్రజలకు దేశం మీద కూడా ప్రేమ కలుగుతుందని ఆయన భావించాడు. దేశముపట్ల అభిమానము మొలకెత్తాలంటే మనం అధిగమించవలసిన అవరోధాలన్నిటినీ కూడా గురజాడ మనకు గుర్తు చేశాడు.

**నవంబర్ 30 గురజాడ వర్ధంతి సందర్భంగా**

**- (ఆచార్య రాచపాలెం చంద్రశేఖరరెడ్డి గారి 'దీపధారి గురజాడ వ్యాసాల కలనం నుంచి)**



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A133 |
| పుస్తకం పేరు | చైతన్య స్రవంతి |
| తారీఖు | 21/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |